సెప్టెంబరు

19

ప్రారంభం!





పద్మశ్రీ వారి

# సిరిసంపదలు

నిర్మాత
వి.వెంకటేశ్వర్లు.B.A + దర్శకుడు
పి.పుల్లయ్య.B.A



ఆంధ్ర,సీడెడ్ విజయ రిలీజ్ నైజాం,మైసూరు ఈస్టిండియా రిలీజ్

TARAKA

# ఈ సంచికలో



## యువతీలోకం



ముఖచిత్రం. 'వన్నెలవయ్యారం'

చిత్రకారుడు: వడ్డాది పాపయ్య




ఆర్యా

సెప్టెంబరు 'యువలో' యద్దనపూడి సులోచనారాణిగారు వ్రాసిన "పేర్లు-ముద్దుపేర్లు మారుపేర్లులో" ఇచ్చిన పాప పరిణామాలు వరుసగా రాకపోయినా మా చుట్టాల్లో ఒక పాప 18 ఏళ్ళు వచ్చేసరికి, పేరు పీపా అని పిలవకపోయినా ఆకారం మాత్రం పీపాఅయి కూర్చుంది.

'సుగుణ'
విశాఖపట్టణం.

నేను రెండు నెలలనుండి మాత్రమే "యువ" చదువుతున్నాను. ఇంత మంచి పత్రిక నేను చదవడములేదే అని ఎంతో బాధ పడ్డాను. ముఖ్యంగా "శాయస్న"గారి ప్రేమోప హతులు అత్యంత 'ఆకర్షణీయకంగా వుంది. సెప్టెంబరు సంచికలో తుమ్మల కృష్ణకుమార్ గారి మరణవాఙ్మూలం కథ చాలా బావుంది. కళ్ళ నీరు కురిపించింది. మానవుని మానవత్వము, రాక్షసత్వమూ రెండూ కళ్ళకు కట్టినట్లు రచయిత రచించాట. యద్దనపూడి సులోచనారాణిగారి "పేర్లు మారు పేర్లు" చాలా తమాషాగావుంది. ప్రతి శీర్షికా నాకెంతో బావుంది. యువతీలోకం శీర్షికలో కుట్లూ, వంటలూకూడా ప్రచురిస్తే బావుంటుందని నా సలహా.

శ్రీమతి శిరివేలు లక్ష్మీరమణమూర్తి
చిత్తూరు

శాయన్నగారి ప్రేమోపహతులు బాగున్నది. ఈ "విషయాన్నే" తీసుకుని యింతకు ముందుగూడ వారు వ్రాసియున్నారు. హైదరాబాదులో యీ రకం దంపతులు ఎక్కువగా వున్నటులున్నది. గోపీచంద్ గారి, చీకటిగదులు చాల బాగుంది.

ఆంధ్ర పారిశ్రామికంగా అభివృద్ధి కావాలంటే యువలోని, సంపాదకీయాలు పనిలేని మంగలి శీర్షికలులో కావలసిన వివరాలు ఎత్తి చెప్పడం బాగున్నది. ముఖ్యంగా మద్రాసు రాష్ట్రంలో జరిగే అలజడి కనీసం పార్టీ మూలకంగా కాకుండ ఆంధ్రయువజనం నుండి ముఖ్యంగా రావాలి.

"యువ" అభివృద్ధికి రావాలని ఆశిస్తాం.

సోసు సుబ్రహ్మణ్యంశెట్టి

అర్యా,

ఈనెల 'యువ' చాలా ఆకర్షణీయంగా ఉంది. వ.పా గారి ముఖచిత్రం ముద్దులు మూటకట్టుకొని మరులు కొల్పింది. శాయన్నగారి 'ప్రేమోపహతులు', గోపీచంద్‌గారి 'చీకటిగదులు' చక్కగా సాగుతున్నాయి. పోలవరపు శ్రీ హరిరావుగారి 'శుభలేక' సీటుగా, గోటుగా ఉంది. 'పనిలేనిమంగలి' రెడ్ టేపిజాన్ని గూర్చి తప్పకఎత్తుకుంటాడని ఎప్పుడో భావించాం. ఆయనకు ప్రత్యేక అభివందనాలు. కార్టూనులు మాత్రం చాలా తక్కువగా ఉంటున్నాయి. వీటి సంఖ్యనూ, స్థాయినీ పెంచడం అవసరం. అట్టచివరి పేజీలో ప్రకటనలకంటే చక్కటి కార్టూను రంగుల్లో వేస్తే 'యువ' శోభాయమానంగా వెలుగుతుందనడానికి సందేహంలేదు. సంపాదకులకు నా అభివందనాలు.

కొన్నెగంటి వెంకటేశ్వరరావు

పిఠాపురం




సంపాలకుడు : చక్రపాణి

సంపుటి 6 | అక్టోబరు 1962 | సంచిక 4

గుల్లాతి కమిషన్ రిపోర్టులోని అంశాలు కొద్దికొద్దిగా బయటికి వస్తున్నాయి.

కృష్ణ గోదావరినదుల నీటిని, ఆంధ్ర, మైసూరు, మహారాష్ట్ర, మధ్యప్రదేశ్ రాష్ట్రాలమధ్య, ఏ ఏ వంతులలో పంచాలో నిర్దేశించటానికి ఈ కమిషన్ ఏర్పాటు చేయబడింది. 1951 లో యీ నీటి పంపకంలో ఒక నిర్ణయం జరిగింది. కాని, ఆంధ్రప్రదేశ్‌లో పెద్ద ప్రాజెక్టులు కట్టడానికి ఏర్పాట్లు జరగడంచూసి, తక్కిన మూడురాష్ట్రాలూ పేచీపెట్టి, 1951 నాటి ఒడంబడికను తిరగతోడి, కొత్తగా పంపకం జరగాలని ఆందోళన చేశాయి. కిమ్మనకుండా, కేంద్ర ప్రభుత్వం ఆ రాష్ట్రాల కోరిక ప్రకారం, 1851 నాటి ఒడంబడికను సవరించడానికి అంగీకరిస్తూ, నీటి పంపకం విషయమై సూచనలను చెయ్యడానికి గుల్హాతికమిషన్‌ను నియమించింది. గుల్హాతికమిషన్ అంటే, శ్రీ గుల్హాతి అధ్యక్షులుగా, కొంతమంది సభ్యులుగల కమిషన్.

1951 నాటి ఒడంబడికకు సంబంధించిన రాష్ట్రాలు నాలుగు: ఆంధ్రప్రదేశ్, మధ్యప్రదేశ్, మహారాష్ట్ర, మైసూరు. కృష్ణ, గోదావరి నదులు ప్రవహించేది యీ నాలుగు రాష్ట్రాలగుండానే. అంచేత, 1951 ఒడంబడికను సవరించే ప్రయత్నం ఏమైనా జరిగితే, యీ నాలుగు రాష్ట్రాలతోనే సంప్రతించవలసినది. కాని కృష్ణా నదికి 250 మైళ్ళ దూరంలోనూ, గోదావరికి మూడువందలయాభై మైళ్ళదూరంలోనూ

వున్న మదరాసు రాష్ట్రంకూడా, యీ నదులలో తనకు వాటాకావాలని అడిగింది. అలా అడగడంలో, మదరాసు చెప్పినవాదం ఏమిటంటే, ఆంధ్రదేశం మదరాసులో నుంచి విడిపోకుండా వుంటే, ఆంధ్రదేశపు నదుల జలాలమీద మదరాసుకు హక్కు వుండేదికదా, ఆంధ్రదేశం విడిపోతేమాత్రం ఏం, ఆ హక్కుమాత్రం వుంటుందని. ఇలాటి అసందర్భపు వాదం గుల్హాతి కమిషన్ కు నచ్చింది. దానినిబట్టే, యీ కమిషన్ సభ్యుల మనఃప్రవృత్తి ఎలాటిదో స్పష్టమవుతున్నది.

ఆంధ్రదేశం, మదరాసులో ఒకభాగంగా వున్నప్పటికీ, ఆ ప్రాంతంలోని నదుల జలాలపై హక్కు, ఆ ప్రాంతపు ప్రజలదేగాని, నాలుగువందలమైళ్ళ దూరానవున్న తమిళలకు ఏమీ హక్కు వుండదని వూహించేపాటి జ్ఞానంకూడా గుల్హాతి కమిషన్ కు లేకపోయింది. మదరాసు రాష్ట్రంలో కలిసివున్నందున అనేకవిధాలుగా నష్టపడుతున్నామని గ్రహించేకదా ఆంధ్రులు ప్రత్యేకరాష్ట్రం కోరినది!

ఏమయితేనేం, వడ్డించేవాడు మనవాడయితే కడపంక్తిలోకూచున్నా ఫరవాలేదు, మీరు చెప్పదలచుకున్నదేమిటో చెప్పండి, అని మదరాసు ప్రతినిధులనుగూడా గుల్హాతి కమిషన్ ఆహ్వానించింది. షడ్రసోపేతంగా వారికి వడ్డించింది. గుల్హాతి కమిషన్ రిపోర్టును గురించి తెలియవస్తున్నవార్తలు నిజమయితే, కృష్ణానది నీటిని మదరాసు నగరానికి సప్లయి చెయ్యాలి. ఈ ఏర్పాటుకుగాను, నాగార్జునసాగర్ డాం ఎత్తు తగ్గించాలి. అంటే అక్కడ నిలవచేసే నీరు తగ్గిపోతుంది. దానిఫలితం, కృష్ణ, నల్లగొండ, గుంటూరు, నెల్లూరు జిల్లాలకు ఇక్కడనుంచి, ఇదివరకటి ప్లానుప్రకారం నీరు సప్లయికాదు. ఈ జిల్లాలలో పంటలకు సప్లయి చేదామనుకున్న నీరు సున్న అవుతుంది. పైగా, ఇక్కడ కట్టదలచుకున్న విద్యుదుత్పాదక కేంద్రం దెబ్బతింటుంది.

అంతేకాదు; శ్రీశైలంలో కట్టదలచుకున్న విద్యుదుత్పాదక కేంద్రం, కాగితంమీదే నిలబడిపోతుంది. ఆంధ్రదేశంలో ఎలక్ట్రిసిటీ కొరవ అలాగే శాశ్వతంగా వుండిపోతుంది. అక్కడ కొత్త పరిశ్రమలను స్థాపించడానికి అవకాశం లేకపోగా, యిప్పుడున్న ఒకటిన్నర పరిశ్రమలుకూడా దిగజారిపోతాయి. ఎక్కువపంటలు పండించడానికిగాని, పరిశ్రమలను స్థాపించడానికిగాని అవకాశంలేక, ఆంధ్రప్రదేశ్ అయ్యవార్లంగారి నట్టిల్లులాగ శోభిస్తూ వుంటుంది.

ఆంధ్రప్రదేశ్ కు ఇరుగునా పొరుగునావున్న రాష్ట్రాలు కోరేది ఇదేనా? కేంద్ర ప్రభుత్వం, సహించవలసినది ఇదేనా?

ఇంకా, గుల్హాతికమిషన్ సూచనలోని అసందర్భపు అందం ఏమిటంటే, వాt సూచనలప్రకారం నీటిని మదరాసుకు సప్లయి చెయ్యడానికి వీలు ఇరవై సంవత్సరాలవరకు మాత్రమే వుంటుందట. కృష్ణానదిమీద మైసూరులోను, మహారాష్ట్ర లోను కట్టబోయే ప్రాజెక్టులవల్లనూ, ఆంధ్రదేశంలోనుంచి కాలువలద్వారా పంపడం వల్ల ఇగిరిపోయేనీరూ, ఇంకిపోయేనీరూ పోగా, ఇరవై సంవత్సరాల తరువాత, మదరాసుకు పంపడానికి నీరు ఏమీ మిగలదు. కాని, ఇరవై ఏళ్ళలో మదరాసు పట్టణపు జనాభా, ఇప్పటికి రెండింతలు అవుతుంది. ఆ పట్టణపు నీటిదాహం ఇనుమడిస్తుంది. ఆ దాహాన్ని ఎవరు తీర్చేటట్టు!

మరొకసంగతి: మదరాసుకు నీటిని ఇవ్వడానికి యీనాడు ఒప్పందం చేసుకుంటే. ఇరవై సంవత్సరాల తరువాత ఆఒప్పందాన్ని మనంరద్దు చేసుకోవడానికి వీలు అవుతుందా! ఒప్పందం ఏమీలేనప్పుడే, తమకు వాటా కావాలంటున్న మదరాసు ప్రభుత్వం, ఒక ఒప్పందంలో మనం ఇరుక్కున్న తరువాత, మనకు వున్నా లేకపోయినా కృష్ణనీరు తమకు ఇచ్చి తీరాల్సిందే అని పట్టుపడితే, మనం ఏ గంగంలో దిగవలసి వచ్చేటట్టు?

ఇలాంటి సమస్యలు ఎన్నోవున్న, యీ విషయంలో, నెల్లూరునుంచి ముగ్గురు పెద్దలు మదరాసుకు నీరు ఇవ్వడంచాలా అవసరమని ఒక ప్రకటన చెయ్యడంకూడా, మనం బ్రహ్మానందం పొందవలసిన సంగతే. నెల్లూరు జిల్లాకు నీరుకావాలి అని అడగడం నెల్లూలుజిల్లావాసులధర్మం. నెల్లూరుజిల్లా మొత్తంలో నీటివసతివున్న ప్రాంతం, కడప, చిత్తూరు జిల్లాలలో నీటివసతివున్న ప్రాంతాలకంటే ఎక్కువ. ఆంధ్రప్రదేశ్‌లో ప్రతి జిల్లాలోనువున్న భూమిమొత్తం వైశాల్యం, దానిలో వ్యవసాయం జరుగుతున్నభూమి మొత్తం వైశాల్యం, దానిలో వ్యవసాయం జరుగుతున్న భూమి ఎంతఅనే విషయాన్ని పరిశీలిద్దాం:

| జిల్లా | మొత్తం వైశాల్యం | వ్యవసాయం జరుగుతున్న భూమి |
|---|---|---|
| | (ఎకరాలలో) | |
| అనంతపురం | 42,92,129 | 24,84,404 |
| ఆదిలాబాద్ | 45,39,717 | 14,68,175 |
| కడప | 37,94,524 | 10,65,400 |
| కరీంనగర్ | 30,29,151 | 12,59,713 |
| కర్నూలు | 58,94,616 | 29,17,050 |

| | | |
|---|---|---|
| కృష్ణ | 22,39,187 | 13,18,948 |
| ఖమ్మంమెట్ | 27,15,796 | 7,93,245 |
| గుంటూరు | 36,93,743 | 21,17,052 |
| చిత్తూరు | 37,69,290 | 9,54,388 |
| తూర్పుగోదావరి | 36,36,573 | 10,66,462 |
| నల్లగొండ | 34,60,884 | 17,66,987 |
| నిజామాబాద్ | 18,81,757 | 6,64,052 |
| నెల్లూరు | 50,94,191 | 15,41,030 |
| పడమటి గోదావరి | 19,29,460 | 9,54,875 |
| మహబూబ్‌నగర్ | 38,46,774 | 18,19,220 |
| మెదకు | 22,73,206 | 10,32,095 |
| వరంగల్ | 35,91,493 | 10,77,913 |
| విశాఖపట్టణం | 33,14,434 | 7,77,690 |
| శ్రీకాకుళం | 24,88,931 | 8,73,022 |
| హైదరాబాద్ | 10,23,177 | 3,74,862 |

పై అంకెలనుబట్టి, వ్యవసాయం బాగా జరుగుతున్న జిల్లాలలో నెల్లూరు ఒకటి అని స్పష్టపడుతున్నది. గోదావరిఒడ్డునవున్న ఉభయగోదావరి జిల్లాలు, వరంగల్, కరీంనగర్, ఆదిలాబాద్, నిజామాబాద్, ఖమ్మంమెట్టు జిల్లాలకు, ఆ మహానది నీటిని బాగా వుపయోగించుకునే వసతి ఏర్పడనేలేదు. కృష్ణానదినుంచి నీటిని తీసుకొనివెళ్ళి, మదరాసు దాహాన్ని తీర్చడానికి ప్రయత్నించేముందు, కడప, చిత్తూరు జిల్లాల అవసరాన్ని తీర్చడం ముఖ్యం. ఇరుగు పొరుగు తెలుగు జిల్లాల అవసరాలను ఆలోచించకుండా, మదరాసుకు నీటిని సప్లయి చెయ్యవలసిందని, నెల్లూరునుంచి ముగ్గురు పెద్దలు ప్రకటనచెయ్యడం, ఆంధ్రప్రజల దౌర్భాగ్యమే.

కడప, చిత్తూరుజిల్లాల అవసరాలను తీర్చకుండా కృష్ణనీరు మదరాసుకు పోవలసిందేనా ! కృష్ణనీరు మదరాసుకు అందకపోతే, ఆదిలాబాద్, కరీంనగర్, వరంగల్, ఖమ్మం, తూర్పుగోదావరి, పడమటి గోదావరి, నిజామాబాద్ మెదకుజిల్లాలకు పంచవలసిన గోదావరినీటిని కృష్ణలోకలిపి, మదరాసుకు పంపవలసినదేనా ?

ఆంధ్ర నాయకులారా, ఆలోచించండి ! ఆంధ్ర ప్రజలారా, కళ్ళు తెరవండి !




స్వరాజ్యం రాకముందు మనమందరం ప్రజల హక్కులను గురించి మాట్లాడాం. తిలక్ మహాశయుడు 'స్వాతంత్ర్యం నా జన్మహక్కు' అన్నాడని చెప్పుకొని ఆనందించాం. మానవుడు పరిపూర్ణ వికాసం పొందాలంటే సంపూర్ణ స్వాతంత్ర్యం కావాలని వాదించాం. కాని స్వరాజ్య మొచ్చింతర్వాత ఈ భావం తల్లకిందులైనట్లు కనిపిస్తుంది. అలా తల్లకిందులు చేయటానికి స్వాతంత్ర్యం కోసం పోరాడిన నాయకులే ప్రయత్నిస్తున్నారు.

ఇప్పుడు ప్రతివానినోటవిన్నా ప్రజాస్వామిక విధానంలో మానవుడు హక్కులకంటే బాధ్యతలను ఎక్కువగా గుర్తించాలనేమాట వినిపిస్తూవుంది. ఈ బాధ్యతల నిర్వచన రకరకాలుగా వుంటూవుంది.

ప్రజాస్వామిక విధానంలో బాధ్యతలను నిర్వచించే దెవరు? ప్రభుత్వం. ప్రభుత్వం ఎంత విశాల దృక్పథం కలిగిందైనా ఆ నిర్వచనం తన కనుకూలంగానే చేసుకుంటుంది. తనపరిపాలనకుప్రతికూలంగా వున్న చర్యలను బాధ్యతారహిత చర్యలు అని వర్ణిస్తుంది. దండిస్తుంది. మానవుడు తన విధానాలకు అనుకూలంగా వుండటం బాధ్యతను గుర్తించటం అని. ప్రతికూలంగా వుండటం గుర్తించకపోవటం అని ఘంటాపథంగా చెప్తుంది.

ఇదే సూత్రాన్ని క్రమశిక్షణ అనే నెపంతో ప్రభుత్వాలు ప్రచారం చెయ్యటం మనం చూస్తూనే వున్నాం. ప్రజలు క్రమశిక్షణను నేర్చుకోవాలంటుంది ప్రభుత్వం. క్రమశిక్షణ అంటే ఏమిటంటే తమ కోర్కెలను ప్రభుత్వం నిర్దేశించిన చట్టాలద్వారా తీర్చుకోవటం అని సమాధానం చెప్తుంది. యే ప్రభుత్వమైనా చట్టాలను తన అధికారాన్ని సుస్థిరం చెయ్యటానికి చేస్తుందికాని, వ్యతిరేకుల భావాలను ప్రతిబింబించటానికి చెయ్యదు. అంతేకాకుండా తన అధికారానికి ముప్పు వచ్చినపుడు పోలీసు డిపార్టుమెంటుమీద, మిలిటరీ సహాయం

మీదా ఆధారపడుతుంది. అలా ఆధార పడని ప్రభుత్వం ప్రపంచంలో ఇంతవరకు ఎక్కడా వున్నట్టు కనపడదు. ఇప్పుడు తృటికాలంలో దేశంనలుమూలలకుమిలిట రీని పంపే అవకాశం ఏర్పడింది. నిజం చెప్పాలంటే ఈ నాటి మిలటరీ శక్తి పూర్వంలాగు సైనికులలో లేదు. ఆటం బాంబులోవుంది. ఇటువంటి పరిస్థితుల్లో మార్పును కోరే యే వ్యక్తీ ప్రజల బాధ్యతలను గురించి, క్రమశిక్షణను గురించి పదేపదే చెప్పటం సహించడు.

క్రమశిక్షణ ముదిరితే మనిషిలోవున్న సృజనశక్తి నశిస్తుంది. బాధ్యతలు పెరిగితే నిరంకుశత్వం నెలకొల్పబడుతుంది.

ప్రజల హక్కులూ వున్నాయి, బాధ్యతలూ వున్నాయి. ఒకొక్క పరిస్థితిలో హక్కులను, ఒకొక్క పరిస్థితిలో బాధ్యతలను మరిచిపోవలసి ఒస్తుం దనే అభిప్రాయాన్ని మరుగుపడకుండా చేసే ప్రచారం ఉత్తమమైంది. వినోబా భావే అంతటి అహింసావాది, "భూస్వాములు ప్రేమపూర్వకంగా తమ భూములను బీదవాళ్ళకు పంచిపెట్టకపోతే కత్తి పట్టే వాళ్ళలో నేనే ప్రథముడనవుతాను," అన్నాడు. అంటే మన సంఘంలో దేని అవసరం దానికుంది. అవసరాన్ని తెలుసుకొని మెలిగిన మానవుడూ, ప్రజలను కూడగట్టుకున్న నాయకుడూ ఘనులు. అంతేగాని తమకు అనుకూలంగా వుంటుందనే వుద్దేశంతో వొక భావంలోని వొకే గుణాన్ని పట్టుకొని ప్రజలను రెచ్చగొట్టటంగాని, ప్రజలను నిర్వీర్యులను చేయటంగాని దేశానికి శ్రేయస్సూ కాదు; ధర్మమూ కాదు.

ఈనాడు బాధ్యతలకన్న ప్రజల దృష్టి హక్కులమీద, క్రమశిక్షణకన్న అరాజకత్వంమీద వుండటం నిజమే కావచ్చు. అంతమాత్రాన హక్కుల సంగతీ, మానసిక విజృంభణ సంగతీ ప్రజలు మరచి పోయేటట్లుగా చెయ్యటం ప్రభుత్వానికి మంచిదైతే కావచ్చుగాని, ప్రజలకు మంచిది కాదు. ప్రత్యర్థి విశాల దృష్టితో వున్నంతకాలం, వ్యతిరేకులను తనలో యిముడ్చుకో గలిగినంత కాలం క్రమశిక్షణ, బాధ్యత నెరిగి ప్రవర్తించటం మంచిదే కావచ్చు. ఆ పరిస్థితి లేనప్పుడు యేమాత్రం మంచిది కాదు. మానవుని విశృంఖల స్వభావం అరాచకానికి, నాశనానికి దారి తీయవచ్చు. క్రమశిక్షణ, హక్కుల సంగతి జ్ఞాపకంలేని బాధ్యతా వ్యాసంగం అంతకంటే ప్రమాదమైంది. అది మనిషిలోని మార్పునుకోరే స్వభావాన్నే చిదిమి అతని సృజనశక్తిని అదిమి బానిసను చేస్తుంది. ఈ బానిసల సమూహంవల్ల దేశం చివరకు క్షోభపడటంకంటే జరిగేదేమీ లేదు.

ప్రజాస్వామికంలోని బాధ్యతలను, ప్రజల కుండవలసిన క్రమశిక్షణను పదే పదే జ్ఞాపకం చేసే మన నాయకులు, నిజంగా వారు దేశ శ్రేయస్సును కాంక్షించినవారైతే ఈ విషయం కూడా కొద్దిగా జ్ఞాపకం వుంచుకుంటారని ఆశిస్తున్నాను.

# అయిదు పైసలు లేక—

స్వామి వివేకానంద శ్రీరామకృష్ణ పరమహంస ముఖ్య శిష్యుడు. ఆ మహనీయునివద్ద ఆరుసంవత్సరములు శుశ్రూష చేసిన తరువాత స్వామివివేకానంద ఆధ్యాత్మికంగా ఎంతోపురోగమించారు. రామకృష్ణుని అనంతరం యోగాభ్యాసంచేసి ఆత్మసాక్షాత్కారమును అవలీలగాపొంది ఉండెడివారు. కాని స్వామీజీకి ఒక తీవ్రమైన ఆకాంక్ష ఉండేది. దివ్యదృష్టిని పొందడానికి సమాధివంటి యోగాభ్యాసాలకు ఉపక్రమించడానికి ముందు మాతృదేశ సందర్శనంతో ఈశ్వర సందర్శనం చేయాలని ఆయన కోరిక. అందుచేత అఖిలభారత పర్యటన ప్రారంభించారు. నవప్రవక్తగా ప్రపంచ మత సమావేశంలో ప్రఖ్యాతి గడించిన అమెరికా పర్యటనకు సంవత్సరంముందుగా ఈ అఖిల భారత పర్యటన జరగడం గమనించ దగినది.

అమెరికాలో ఆయన ఎక్కడికివెళ్ళినా ఇంగ్లీషులోనూ, సంస్కృతంలోనూ పాండిత్యగరిమతో ధారా ప్రవాహముగ చేసిన మతప్రసంగములు ప్రజలను మంత్రముగ్ధులను చేశాయి. రాజాధిరాజులు తమ ప్రాసాదములలో అయనను అతిథిగా నుంచుకొనుట తమకు గౌరవముగా నెంచుకొనిరి.

మహారాజుల ఆతిథ్యము స్వామి అవసరమైనంత కాలము కంటె ఎక్కువగా స్వీకరించెడివారుకాదు. రాజులయొక్కయు, నవాబులయొక్కయు ఆతిథ్యము ఒకటి రెండు రోజులుమాత్రము స్వీకరించి తిరిగి పర్యటన సాగించి మరునాడు ఏ కుటీరమునందో, ఏ బీదకర్షకుని పంచ యందో లేక దారిప్రక్క ఏ చెట్టునీడనో ఉండెడివారు.

తనజేబులో పైసకూడ లేకుండ స్వామి యాత్ర సాగించెను. ఏ భక్తుడైనా ఒక మూడవ తరగతి టిక్కెట్టుకొని ఇస్తేనో, లేక స్వల్పమైన ధనం ఇస్తేనో స్వీకరించేవారు. ఆయనకు కావలసిన కనీసపు ఖర్చులకుగాని, అత్యావసరములకుగాని మించిన ధనాన్ని ఆయన స్వీకరించే వారుకాదు.

'శ్రీ సుఖ్యాంకర్'

అందుచేత వారు పర్యటనలో చాలా కష్టాలకు లోనయ్యేవారు. ఒక్కొక్క ప్పుడు పస్తుపడేవారుకూడ. ఒకసారి స్వామి అయిదురోజులు ఆహారము లేకుండ యాత్రసాగించవలసి వచ్చినది. యాత్రవలన దిన దినమూ శక్తివంతము గానూ సమృద్ధమైనదిగానూ ఆత్మశక్తి పెరిగినంతవరకు జీవితయాత్ర సాగించ డానికి తిండిలేమిని ఆయన లక్ష్యము చేయలేదు.

చివరకు హిందూదేశపు దక్షిణపుకొన, కన్యాకుమారిని చేరుకున్నారు. ఆనందం చేత మెరిసే కన్నులతో, సముద్రతీరాన్ని నిలబడి ఎదుట విస్తరించిన మహాసము ద్రముపై దృష్టినిలిపారు. తనలోని మహా వాంఛ – మాతృదేశ సందర్శనాకాంక్ష – ఫలించినందుకు సంతోషంతో ఒకసారి నిట్టూర్చారు.

కొన్ని నిముషముల తరువాత ఒక నావ తీరానికి వచ్చినది. తీరాన ఉన్న ప్రజలు ఒక్కరొక్కరుగా నావలో ప్రవే శించారు. సముద్రంలో ఒకమైలుదూరంలో ఉన్న ఒక ద్వీపానికి ఈ నావ వెళ్ళుచున్న దని తెలుసుకున్నారు వివేకానంద:

"అయితే నా యాత్ర పూర్తికాలేదు. ఈ ద్వీపం కూడా నేను సందర్శించవలసి ఉన్నది" అని ఆయన తలంచారు. అంతకుముందు రెండురోజులనుంచి ఆయనకు పస్తు. నావకేవు అయిదుపైసలు కూడా ఆయనవద్ద లేవంటే ఆశ్చర్యం లేదు. యాత్రికులతో నావబయలుదేరింది.

స్వామీజీ ఒక్కక్షణం ఆలోచించారు. నీటిలోకి దుమికి ఈదడం మొదలు పెట్టారు. వేగంగా ఒక్కగంట సేపు ఈది, వగర్చుచూ నావకంటె ముందుగా ద్వీపాన్ని చేరుకున్నారు. స్వదేశంలో ఒక మైలు దూరానఉన్న ద్వీపాన్ని చూడలేక పోయానే అన్న చింతలేకుండా తన మనో రథము సిద్ధించినందుకు సంతోషపూరిత హృదయంతో ద్వీపంమీద కాలు మోపారు.

* * *

"ది మాస్టర్ ఐ సా" అనే గ్రంథంలో సిస్టర్ నివేదిత ఈ సంఘటనను వ్రాశారు. "నీ దేశాన్ని ప్రేమించాలంటే ముందు దేశాన్ని తెలుసుకో" అనే ఆమె సుపరి చిత ప్రవచనం ఆమె గురువుయొక్క మార్గదర్శకత్వమేనని అనుకొనుటలో తప్పులేదు.



# అక్కయ్యపెళ్ళి

నెల్లూరి కేశవ స్వామి.

## 1

విజయపురి నార్త్
1 ఏ జనవరి 1961

ప్రియమైన విశాల అక్కయ్యకు,

సమస్కారములు చేసి వ్రాయునది ఏమనగా ఇక్కడ అంతా క్షేమము. మీ క్షేమ సమాచారములు తెలియజేయగలవు. ఇదివరలో రెండు మూడు ఉత్తరములు వ్రాసియుంటిని, కాని వాటికి ఇంతవరకు జవాబు రాలేదు. నిజముగానే నీకు బొత్తిగా తీరుటలేదా, లేక మమ్ములను మరచిపోయితివా? నాన్నగారికి కూడా ఒక లేఖ వ్రాసితిని. కాని దానిని వారు చించి చదువుకొనిరో లేదో తెలియదు. ఇప్పుడు వారిస్థితి ఎట్లావున్నది? మునుపటివలెనే మౌనముగా కూర్చుని వుందురా? నాన్నగారిని తలచుకున్నప్పుడల్లా నాగుండె తరుక్కుపోవుచుండును. అమ్మపోవటము నిజముగా మన దురదృష్టమే. మొన్న మీ మరిదిగారు చెప్పినారు ఇంగ్లీషు వైద్యులలో మనస్సుకు సంబంధించిన రోగాల వైద్యులుకూడా వుందురట. నాన్నగారిని వారికి చూపించిన



యడల బాగుపడవచ్చునని అన్నారు.. ఈ విషయము నీకు తెలిసియే యుండును. మన ఎదురింటి డాక్టరుమావయ్యగారి సలహా కూడా తీసుకొని ఎదో ఒకటి త్వరలో చేయుద్ధువని నమ్ముచున్నాను.

ఈ దినము మేము క్రొత్తసంవత్స రము పండుగ చేసుకున్నాము. మీ మరిది గారు ఇంటిలోనే వున్నారు. వారు ఎప్పటి వలెనే తమపనిలో మునిగితేలుతూ వుందురు. ఇతర ప్రపంచముతో పనియే లేదు. అయినా అప్పుడప్పుడు నీ గురించీ, నాన్నగారి గురించీ తలచుచుందురు. బాబు కులాసాగానే వున్నాడు. వచ్చే ఆదివారము, అనగా 8 వ జనవరినాడు వాడి పుట్టిన దినము. మూడు సంవత్స రములు నిండుతవి. పూరికే పెద్దమ్మ దగ్గరికీ, తాతయ్య దగ్గరికీ వెళ్ళుతానంటూ మారాము చేస్తూవుంటాడు.

తమ్ముడు రామం దగ్గరనుంచి ఉత్త రములు వస్తున్నవా ? వాడు పైచదువు లకు అమెరికా వెళ్ళినప్పటినుంచీ నాకు ఒక్క కార్డుముక్క అయినను వ్రాయ లేదు. అక్కడ ఎట్లా ఉన్నాడో ఏమో నాకు బెంగగానున్నది. దయచేసి వాని అడ్రసు తెలుపగలవు.

నీ గురించి నా మనస్సులో ఎంత దిగులుగా నున్నదో నీవు వూహించలేవు. నీ కంటే నేను చిన్నదాననైనప్పటికీ నేనేమో పెళ్ళిచేసుకొని సుఖముగా సంసారము చేయుచుంటే నీవేమో ఇంకా అవివాహితగా నుండుట ఎంతవరకు సమంజసముగా నున్నదో నీవే యోచించ గలవు. ఇంకా ఎన్నాళ్ళీ వొంటరిపాటి జీవితము ? అమ్మ · బ్రతికివున్నన్నాళ్ళూ చదువు మిషపైన పెళ్ళిచేసికోనని మొండి పట్టు పట్టితివి. ఇప్పుడిక చదువు అయి పోయినవెంటనే ఉద్యోగములో చేరితివి. నిజముగా నీకు ఉద్యోగము ఎందుకో చెప్పు ? నాన్నగారు అమ్మపోయినప్పటి నుంచీ అట్లా అయిపోయిరి. తమ్ముడు పరదేశములకు వెళ్ళిపోయెను. నేనేమో దూరమై పోతిని. ఇక నీ విషయము చూచేదెవరు ? ఇకనైనను నీ మనస్సు మార్చుకొని త్వరలోనే ఒక ఇంటిదానివి కాగలవని నేను వేయిదేవుళ్ళకు మ్రొక్కని దినములేదు. నేను చిన్నదానిని, ఇంత కంటే ఎక్కువచెప్పే అధికారము నాకు లేదు.

క్రిందటి దీపావళి పండుగకు నేను మన ఇంటికి వచ్చినప్పుడు, నీ కొరకు ఒకతను వచ్చినాడు. నీ స్నేహితుడని పరిచయము చేసినావు. పేరు మరచినాను. అతను మంచివాడివలెనే తోచినది. ఒక వేళ నీవు అతనిని వివాహము చేసికొన దలచిన మాకు అభ్యంతరము వుండదు, ఆలోచించుకొనుము.

ఇంతే సంగతులు. ఈ వుత్తరమున కైనను బదులు వ్రాయుదువో లేదో నీ దయ.

మీ మరిదిగారు తమమావగారికి, వదినెగారికీ నమస్కారములు అంద జేయమని చెప్పినారు. బాబుకూడ తీపి తీపి ముద్దులు పంపించుచున్నాడు.

ఇట్లు
నీ చెల్లెలు
విజయ

2

హైదరాబాద్
10-1-1961

చెల్లాయి విజయా :

Wish you a Happy New year ! ఈ కొత్త సంవత్సరంలోగా ఓ కొత్త కొడుకునో కూతుర్నో కనేస్తావుకదూ ? కాదు, కాదు... 'ఈ క్రొత్త సంవత్స రంబునందు కొంగ్రొత్త తనయుడినో, తనయనో కనెదవని ఆశించుచున్నాను..' అవునా ? నువ్వైతే అలాగే రాసేదానివి కదూ ? ఏఁవిటే ఆ కలగాపులగంభాష ? ఎవరే నీకలా వుత్తరాలు రాయటం నేర్పింది ? అమ్మే కదూ ? అవును, ఇంగ్లీషురాని అమ్మకూడా అలాగేరాసేది. మరి నువు స్కూలుఫైనలు పాసయావు కదా, నువ్వూఅంతేనా ? అవున్లే, ఆ నాడు కాలేజీలోచేరమని నేను ఎంతచెప్పినా విన్నావూ ? అమ్మమాటే వేదవాక్యం లాగా, అమ్మతెచ్చిన మొగుణ్ణి కట్టు కుందుకు వెళ్ళి పెళ్ళిపీటలమీద కూచు న్నావు.... పోన్లే, నేనిలా రాస్తున్నానని నొచ్చుకోకేం ?



"ఏనుగుకూ దోమకూ ఉండే తేడా ఏమిటిరా?"
"ఏనుగుల్ని దోమలు కుట్టగలవు, ఏనుగులు దోమల్ని కుట్టలేవు."

విజ్జీ : నిజంగా నీ మనస్సు వెన్న పూసలాంటిది సుమా. బాధలన్నీ తెచ్చి పెట్టుకొని కరిగిపోతుంటావు. నాన్నారి గురించి నీ కెందుకంత బాధ? అసలు వారి కేమైందనీ ? వేళకు భోజనమూ, నిద్రా, పత్రికా పఠనమూ అన్నీ సవ్యంగానే సాగుతున్నాయి. నెల నెలా పెన్‌షన్ కాగితాలమీద కూడా సరిగ్గానే సంత కాలు చేస్తారు. ఎటొచ్చీ ఎవరితోనూ మాట్లాడరు. ఏ విషయంలోనూ జోక్యం కలిగించుకోరు. అంతేనా ? అంతమాత్రా నికే ఏమో అయిపోయిందని గగ్గోలుపడి పోవాలా ? సైక్యాట్రిస్టుకు చూపించమని చెప్పారా మరిదిగారు ? ఆయనగారి సలహాకు థ్యాంక్సు. అసలు సైక్యాట్రిస్టు అంటూ ఒకడు మన దేశంలో వున్నా డటనా ? అవన్నీ పాశ్చాత్యులకు

మనకెందుకూ ? చూడుచెల్లాయ్ : నాన్నారికేమీ కాలేదు, నిక్షేపంలా వున్నారు. అప్పుడప్పుడు డాక్టరు మా(వయ్యచేత పరీక్ష చేయిస్తూనే వున్నాను. వారి ఆరోగ్యం చెక్కుచెదరకుండా వుంది. నేనంతా చూసుకుంటూనే వున్నాగాని నువ్వేమీ అనవసరంగా దిగులుపడకు.

పోతే, రామం విషయం. వాడేం చిన్నపిల్లవాడా ? ఇరవై ఏళ్ళు వచ్చాయి. వాడి సంగతి వాడు చూసుకోలేడూ ? నామల్లేనే వుత్తరాలు రాయటమంటే వాడికీ బద్ధకమే. అంతమాత్రానికే ఇదై పోవాలా ? అడ్రసు ఇప్పుడు కనిపించటం లేదు. మళ్ళీ రాస్తాలే.

ఇహపోతే, నేను. నిజంగా చెల్లాయ్! నా పెళ్ళి గురించి నువ్వింతగా బాధపడుతున్నావని నే నెన్నడూ అనుకోలేదు సుమా. అసలు నాకు పెళ్ళికాకపోవటం మరొకరికి బాధాకరంగా వుంటుందన్న వూహేరాలేదు నాకు. అయితే ఒక్క సంగతి. అప్పుడు చదువుకోసం నేను పెళ్ళిచేసికోనన్న మాట నిజమే, కాని ఎప్పటికీ పెళ్ళిచేసుకోక బ్రహ్మచారిణిగానే వుండిపోతానేమోనని నువ్వనుకుంటున్నట్టున్నావు. అలా కాదు. నేను పెళ్ళి చేసుకుంటాను, తప్పకుండా చేసుకుంటాను. సమయం రావాలి, అంతే. ఇప్పుడేనా నీకు మనశ్శాంతి కలిగిందా?... ఆఁ, అప్పుడు దీపావళికి మన ఇంటికెవరో వచ్చారని రాశావు. ఎంత జ్ఞాపకం చేసుకున్నా ఎవరో అంతు దొరకటంలేదు. కాని అతణ్ణి నేను పెళ్ళి చేసుకుంటానన్న భావన నీ కెందుకు కలిగిందో నాకు అర్థంకాకుండా వుంది. చూడు విజీ ! నేను కాలేజిలో చదువుకున్నాను, వుద్యోగం చేస్తున్నాను. కొంతమంది మగస్నేహితులు కూడా అప్పుడప్పుడు ఇంటికి వస్తూనే వుంటారు. అంత మాత్రాన ఆ వచ్చిన వాడినల్లా పెళ్ళి చేసుకుంటానేమో అనుకుంటే ఎట్లా?... ఇప్పుడుగనక నువ్విక్కడుంటే సుందరావుని చూసి నువ్వేమనుకునే దానివో. సుందరావు అంటే బియ్యేలో నా క్లాసుమేటు. ధనవంతుల బిడ్డ. ఎమ్మే పాసయ్యాడు. ఉబుసుపోక పి. హెచ్. డీ. కూడా చేస్తున్నాడు. కాలేజీలో నా స్నేహం కోసం ఎంతో తాపత్రయపడేవాడట. కాని నేనే వీలుపడనీయలేదట. అతనిప్పుడు చెప్పిందాకా తెలీదు. ఇప్పుడు మనింటికి తరచూ వస్తున్నాడు. మనిషి బాగానే వుంటాడు. ఇంకా పెళ్ళికాలేదు. నేను 'ఊఁ' అంటే నా మెళ్ళో మంగళ సూత్రం కట్టేలాగున్నాడు...

ఈ గొడవంతా ఎందుకుగాని బాబు సంగతి చెప్పు. మొన్న వాడి పుట్టినరోజు పండుగ జరిపించావా ? నేను పంపించిన ప్రెజెంట్ అందిందా ? మన శాయన్న చేత పార్సిలు చేయించాను. బాబును చూడాలని వుంది. సంక్రాంతికి రారాదూ? వీలైతే మీఆయన్ని కూడా రమ్మను.

మూడు రోజులు శలవులిస్తారుగా. కనీసం నువ్వొ జాబైనా రండి. పండు గవగానే నువ్వెళ్ళిపోవొచ్చు. బాబును ఇక్కడే వుంచేసెయ్. వాడికి మూడేళ్లు నిండినైగా. ఏదైనా Kindergarten లో చేర్పిద్దాం. నేను చూసుకుంటాలే, ఏమంటావ్?

ఇక ఆపుతాను. ఇలా రాసుకుంటూ పోతే ఎంతకూ తెమిలేట్టు లేదు. మరది గారికి ప్రతినమస్కారాలు. బాబుకు ముద్దులు. నీకు...? నీకేం రాయనూ? నిన్ను దీవించేంత పెద్దదాన్ని కానే? పోనీ, మరోసారి, ఈ కొత్త సంవత్సరంలో నీ కొక కొత్త కొడుకు కలగాలని కోరుకుంటాను. ఎందుకో తెలుసా? అప్పుడు బాబును నాకిచ్చేస్తావేమోనని ఆశ! ఏం, ఇస్తావా?...

ప్రియమైన అక్కయ్య
విశాల

3

విజయపురి నార్త్
13 వ జనవరి 1961

ప్రియమైన విశాల అక్కయ్యకు,

నీవు 8 వ తారీకున వ్రాసిన ఉత్తరము నిన్ననే అందినది. సంగతులు తెలిసినవి.

నీవలె నేను వ్రాయలేను ఎల్లీ! నాకు వచ్చిన రీతిగనే నన్ను వ్రాయనియ్యి. నా వ్రాతమూలముగనైనా నీకు అమ్మ జ్ఞాపకము వచ్చుచున్నది. నాకదే సంతోషము.

నీ ఉత్తరాన్ని పదే పదే చదువుకున్నాను. ఎన్నిసార్లు చదివినా తనివి తీరలేదు. నా మనస్సు ఎంత ఉప్పొంగిపోయినదో నేను వర్ణించలేను. వెంటనే రెక్కలు కట్టుకుని నీ దగ్గర వాలాలనీ, ఒకసారి శ్రీ సుందరరావుగారిని చూడాలనీ వున్నది. కాని ఏమి చెయ్యను? వీలుపడదు. ఇక్కడేవో లేబరు గొడవలు మొదలైనాయట. మీ మరదిగారు సరిగ్గా భోజనానికే రావటములేదు. ఇట్లాంటి పరిస్థితులలో నేను మాత్రము వారిని వదిలి ఎట్లా రాగలను, చెప్పు...?

నీవు తప్పకుండా పెళ్ళిచేసికుంటా వన్న నిశ్చయానికి వచ్చినావు. నాకు అదే పదివేలు. శ్రీ సుందరరావుగారి గురించి నీ అభిప్రాయము బాగానే ఉన్నట్టుగా నున్నది. ఇక ఆలస్యము దేనికి? నీ ఇష్టమే మా ఇష్టము. నీ తుది నిశ్చయము తెలియగానే నేను మా వారిని వెంటబెట్టుకొని అక్కడికి వచ్చెదను. తక్కిన విషయములన్నీ మేము చూచుకొనెదము.

బాబుకు నీవు పంపించిన రైలు బహుమతి సకాలముననే అందినది. దానిని వాడు వదలకుండా ఆడుకుంటూన్నాడు. అందులో కూచుని నీ దగ్గరికి వెళ్తానంటూంటాడు. అక్కయ్యా! బాబు నీవాడే.

బాబువి థాంక్స్, ముద్దులు. మీ మరదిగారికి నమస్కారములు. నాన్న

గారి సంగతి వ్రాస్తూ వుండుము రామం అడ్రసు దొరికితే తెలపగలవు ఇంతే సంగతులు

ఇట్లు
నీ చెల్లాయి
విజయ

**4**

విజయపురినార్త్
20 వ ఫిబ్రవరి 1961

ప్రియమైన విశాల అక్కయ్యకు

నీ జాబు కొరకు చూసి చూసి కళ్ళు కాయలు కాసినవి వెంటనే రాయగలవు ఇక్కడంతా క్షేమము

ఇట్లు
విజయ

**5**

హైదరాబాద్
2) 2 61

విజయా!

ఒక దుఃఖవార్త మన ఎదురింట అత్తయ్యలేదూ, డాక్టరు మావయ్యభార్య మొన్న అకస్మాత్తుగా గుండె ఆగి చని పోయింది అప్పుడు ఇంట్లో ఎవ్వరూ లెరు మావయ్య క్లబ్బుకెళ్ళాడు వాళ్ళ నౌకరు పరుగెత్తుకొచ్చి నాకు చెప్పాడు మావయ్య వచ్చేప్పటికే అంతా అయి పోయింది నేనె శ్యామలకూ వాళ్ళ అన్నయ్య మూర్తికీ, టెలిగ్రాంలిచ్చాను మూర్తి ఇప్పుడు బెంగుళూరులోని హిందుస్తాన్ ఏర్‌ఫ్యాక్టరీలో పనిచేస్తు న్నాడు, తెలుసుకదూ? రెండోరోజు ప్రొద్దునే ప్లేనులో వచ్చాడు శ్యామలా దానిభర్తా మధ్యాహ్నానికల్లా రాగలిగారు ఆతర్వాతే దహనసంస్కారాలు జరిగాయి ఈ మూడు రోజుల్నించీ వాళ్ళ ఆర్త నాదాలు వింటుంటే నేనూ దుఃఖం ఆపుకోలేకండా వున్నాను ముఖ్యంగా మావయ్యని చూస్తుంటే గుండెలు ద్రవించిపోతున్నాయి ఇంప్పుడు బంధువు లంటే ఎవరెవరో వున్నారు రేపు అంతా వెళ్ళిపోయాక వొంటరేగా? అమ్మ లాగే అత్తయ్యమీద కూడా నాకు కోపం వచ్చింది వృద్ధాప్యంలో మొగుళ్ళ నిలా వొంటరిగా వొదిలి ఎందుకు వెళ్తారు! చెల్లాయి! అంతా భగవదేచ్ఛ మన చేతిలో ఏముందీ? నువు మాత్రం ఈ విషయంలో ఏమీ బాధపడబోకు ఏం?

అం ఒక మంచివార్త కూడాను నీకు రాయాలి అనుకుంటూనె మరిచిపోతు న్నాను ఈ మధ్యే మా ఆఫీసరు మారి కొత్త ఆఫీసరు వచ్చాడు, పేరు కృష్ణమ్మ మగవాడేలే ఆ ఆడిపేరెందుకో 'కృష్ణ' అంటే సరిపోదూ? చిన్నవాడే ముప్పైకి లోపునే వుంటాయి అప్పుడే డాక్టరేట్ కూడా చేశాట్ట మనిషి ఎంత అందంగా హుందాగా వుంటాడనుకున్నావ్? ఎంత చెప్పుమాసినా తనివితీరదు నిన్న ఆయన నాకి స్టెనోగా వేశారు నాకు ఒక్కటే భయం ఆయనముందు కూచుని డిక్టేషన్ తీసికుంటూన్నప్పుడు ఆయన చెప్పేది

బుర్రకెక్కక ఏం తప్పులు చేస్తానో, నన్నెక్కడ ఆ పోస్టునించి తొలిగిస్తారో నని, ఎంత జాగ్రత్త పడుతున్నా అప్పు డప్పుడు చిన్నచిన్న పొరపాట్లు జరుగు తూనే వున్నాయి. అయినా ఆయన ఏమీ అనరు. మందహాసంతో మంద లిస్తారు. అంతే...ఉంటాను.

బాబుకు ముద్దులు

నీ

విశాల

6

విజయపురినార్త్

2 వ మార్చి 1961

అక్కయ్యా!

నీ జాబు నన్నెంతగా ఆందోళనపరిచి నదో చెప్పలేను. అత్తయ్యపోయినదంటే నమ్మలేకుండా వున్నాను. డాక్టరు మామయ్యకూడా నాన్నగారివలెనే అయి పోతాడేమోనని నాకు భయముగా నున్నది. శ్యామలని ఓదార్చడానికైనను రావలెనని ఉన్నది. కాని ప్రస్తుతము దానికి వేరే ఒక జాబు వ్రాస్తున్నాను.

నీ ఉత్తరములో నీ పెళ్ళిగురించిగాని, సుందర్రావుగారి గురించిగానీ లేకపోవ డము ఆశ్చర్యకరముగా వున్నది. నీ క్రొత్త ఆఫీసరు గురించి నీవు అట్లా వ్రాయుటకూడా భావ్యముగా లేదు. నిర్మొగమాటముగా చెప్పవలెనంటే నీవు అసలు ఉద్యోగము చేయుటయే మాకు ఇష్టములేదు. అక్కయ్యా నీ మాటనుంచి



"నీ జీవితంలో ఈ రోజులాంటి రోజు మళ్ళీ రాదోయ్."

"నా పెళ్ళి ఈ రోజు కాదోయ్. రేపు."

"కనుకనే."

నీవు తిరిగిబోక. వెంటనే పెళ్ళిచేసుకో వలెనని నాకూ మీ మరిదిగారికీ ఎంత ఆదుర్దాగా నున్నదో నీకెట్లా తెలియ జెయ్యవలెనో తోచడములేదు. మన్నించె దవుకదూ ›

ఇట్లు

నీ శ్రేయోభిలాషి చెల్లాయి

విజయ

7

హైద్రాబాద్

10-3-61

విజ్జీ!

నా పెళ్ళిగురించి మీ ఆదుర్దాచూస్తే నాపైన నాకే జాలి వేస్తోంది సుమా. నేనో నేరస్తురాలికి మల్లే, ఫీలవుతూ న్నాను. మీ వుద్దేశంలో కేవలం నాకు

పెళ్ళికావటమే ప్రధానంగా వున్నట్టున్నది, ఎవరితోనైనా సరే, ఆఖరికి మన నౌకరు శాయన్నతోనైనా సరే: ఆ మాటకొస్తే, ఒక్క స్టేటస్ మినహా శాయన్నకేఁవిటి లోటు? వాడిలోవున్న దయా, ఆత్మ విశ్వాసం ఆ సుందర్రావులో ఏదీ? వుత్త వ్యక్తిత్వం లేనిమనిషి. ఆడదాని కొంగుచాటున బ్రతికే అర్భకుడు. నా వెంట తిరుగుతూ నా నోటిమాట పూర్తవకుండానే అవునంటూ తలూపి తాళం వేసేవాడు. అలాంటి పెంపుడు కుక్కను పెళ్ళి చేసికోవటం 'నాకు అసహ్యం. అందుకని ఆ ప్రసక్తే మాను కున్నాను. అసలు అతనితో స్నేహితమే వదులుకున్నాను.

మరదిగారు కూడా నా పెళ్ళికోసం తాపత్రయపడిపోతున్నారా? ఆయన కోర్కె ఎలాతీర్చనూ? పోనీ నువ్వు నాకంటే పెద్దదానివేనా అయివుంటే, ఏదిక్కూలేక ఆఖరికి అక్కమొగుడే దిక్కు అన్నట్లు మీ ఆయన్నేకట్టుకునేదాన్ని. అయినా ఇప్పుడు 'లా' దానికి వొప్పు కోదేమోలే.

చూడు చెల్లాయి! ఈ వేళాకోళపు మాటలకేఁగాని, పెళ్ళంటే పిల్లలాట కాదు. ముందూ వెనకా ఆలోచించి మరీ చేసికోవాలి. తొందరపడితే ఎలా? నేనేమీ మాట తప్పించటంలేదు. తప్ప కండా చేసికుంటాను. కాని తగినవరుడు కనిపించొద్దూ?... ఆఁ, అలాంటివరుడు నా కళ్ళలో మెదులుతూనే వున్నాడు. ఎవ్వరో నువ్వేవూహించగలిగివుంటావు. మా కొత్త ఆఫీసరు. రోజు రోజుకూ ఆయనకు నాపైన ఆప్యాయత ఎక్కు వవుతూన్నట్లుగానేవుంది. తాను కాఫీతాగే సమయానికి డిక్టేషన్‌కని పిలిపించి నాకూ ఇస్తాడు. 'ఇలా ఎన్నాళ్ళు ఋణపడి పోతూవుండాలని' అడిగితే నవ్వివూర్కుం టాడు. మా ఇంటికి ఒకసారి టీకి రమ్మని ఆహ్వానించాను. సరేనన్నాడు. వచ్చే ఆది వారం వస్తాట్ట. చూడాలి ఏమవుతుందో ఆయన అవునంటే నా జన్మ తరించి పోతుంది. నీకు భగవంతునిపైన భక్తి వుందికదూ? నాకోసం ప్రార్థించు. ఉంటాను.

నీ ప్రియమైన అక్కయ్య

విశాల

P S — నేననుకున్నట్లుగానే డాక్టరు మాఁవయ్య వొంటరివాడైపోయాడు. అంతా వెళ్ళిపోయారు. కాని మూర్తి మళ్ళీ వస్తాడుట శలవుపెట్టి. వీలైతే సికింద్రా బాద్‌కే ట్రాన్స్‌ఫర్ చేయించుకుంటాట్ట. శ్యామల కూడా పిల్లలబళ్ళు మూయగానే వస్తానంది

విశాల

8

విజయపురి నార్త్
16 వ మార్చి 1961

అక్కయ్యా,

నీ మాటలకు నేను నొచ్చుకోవలెనో లేదో తెలియకుండావున్నది. నీ బాగోగులు

నీవే చూచుకునే సమర్థత నీకు ఉన్నదని నాకు తెలుసు. నీకు నచ్చిన వరుణ్ణి నీ ఇష్టము వచ్చినప్పుడే పెళ్ళిచేసుకోగలవు. నేనిక తొందరపెట్టను.

అప్పుడప్పుడు ఉత్తరములు వ్రాస్తూ వుండుము. అంతేచాలు

ఇట్లు
నీ చెల్లెలు
*విజయ*

**9**

విజయపురి నార్త్
10 వ మే 1961

ప్రియమైన అక్కయ్యకు,

దాదాపు రెండునెలల క్రితము నీ కొక ఉత్తరమువ్రాసి వుంటిని. అందులో అప్పుడప్పుడు అక్కడి సంగతులు తెలియజేయవలసినదిగా కోరివుంటిని. కాని నీ దగ్గరనుంచి ఒక్క ఉత్తరమూ రాలేదు. దయచేసి వెంటనే వ్రాయగలవు. నామీద కోపము రాలేదుకదా ?

ఇట్లు
నీ చెల్లాయి
*విజయ*

**10**

హైద్రాబాద్
14-5-61

మైడియర్ విజయా !

నీమీద నాకు కోపమా ? ఎంత మాటన్నావ్ ? అలా ఎన్నటికీ జరగదని నీకు నమ్మకంలేదా ? నువ్వు నాకంటే చిన్నదానివే అయినా బుద్ధిమంతురాలివి. నువ్వు చెప్పేదంతా నా శ్రేయస్సును కోరేనని నాకు తెలీదా ! నీ సలహాల్ని నే నెప్పుడూ గౌరవప్రదంగానే చూస్తాను. ఇదిగో, ఇప్పుడే నీ కోర్కెనొకదాన్ని తీర్చేశాను కూడాను. ఏఁవిటో చెప్పుకోగలవా ? నా వుద్యోగానికి రాజీనామా ఇచ్చేశాను. కారణాలు ఏవైతేనేఁ, నీ అభిలాష అదేకదూ ?

మూర్తి రెండునెలల శలవు మీద వచ్చి ఇక్కడే వున్నాడు. శ్యామలకూడా వుంది. వొచ్చేనెల్లో బళ్ళు తెరవగానే వెళ్ళిపోతుందట. అప్పటికి మూర్తి శలవుకూడా అయిపోవచ్చు. ఇంట్లో ఆడదిక్కు వుండదని ఎలాగైతే మూర్తికి త్వరలో పెళ్ళిచెయ్యాలని ఆరాటపడుతున్నాడు డాక్టరు మాఁవయ్య కాని మూర్తిమాత్రం ఇప్పుడప్పుడే పెళ్ళి చేసికో నంటున్నాట్ట. కాని సికింద్రాబాదుకు బదలీ ప్రయత్నాలు మాత్రం చేస్తూనేవున్నాట్ట. మూర్తిని నువ్వెప్పుడు చూశావో, ఇప్పుడు పూర్తిగా మారిపోయాడుసుమా. అప్పుడే అచ్చంగా పైలట్-ఆఫీసరులా తయారయాడు. మీసాలుకూడా పెంచాడు. ముందుముందు నిజంగానే పైలట్ అవొచ్చుట.

బాబుమా ఁటంచేశావ్ ? పోనీ, అంత పెద్ద ప్రాజెక్టేకదా, అక్కడ (Kinder-

garten) స్కూలులాంటిదేం లేదా? వుంటే వెంటనే చేర్పించెయ్యి.

ఉంటాను.

నీ ప్రియమైన అక్కయ్య
విశాల

## 11

విజయపురినార్త్
20 వ మే 61

అక్కయ్యా,

నీ వుత్తరములు ఒకదానికంటే మరొకటి అయోమయముగా ఉంటున్నవి. నాకెటూ పాలు పోవటము లేదు. మీ క్రొత్త ఆఫీసరు నీకు అన్నివిధాలా నచ్చినట్టున్నాడుకదా, ఇకనైనను శుభవార్త వినిపించెదవుకదా అని ఆశిస్తూవుంటే, ఆ ఉద్యోగానికే రాజీనామా ఇచ్చినట్టు వ్రాసినావు. ఆ పని కేవలము నా కోరికపైనే చేసినావంటే నమ్మలేకుండా వున్నాను. ఏదో జరిగి ఉంటుంది. నావద్ద దాస్తున్నావు. నేను పరాయిదాన్నా? ఉన్నది ఉన్నట్లుగా వెంటనే వివరాలు వ్రాయగలవని ప్రార్థన.

ఇట్లు
నీ చెల్లాయి
విజయ

## 12

హైద్రాబాద్
1-6-61

విజయా!

నీ 20 వ మే వుత్తరం రెండోరోజే చేరింది. కొన్ని కొన్ని కారణాల వల్ల వెంటనే జవాబు రాయలేక పోయాను.

నా వుద్యోగాన్ని గురించి వివరాలు రాయమన్నావు. ఏంరాయనూ? ఆ ఆఫీసరుపైన నేను పెట్టుకున్న ఆశలన్నీ అడియాసలైనాయి. నీకు రాశానో లేదో ఆయన్ని ఒకసారి మనింటికి టీకి ఆహ్వానించాను. రెండు వారాలు రలాయించి మూడోవారం వచ్చాడు. కాని వొంటరిగా రాలేదు. వెంట వొక అప్సరలాంటి స్త్రీ కూడా ఉంది. నా మనస్సు చివుక్కుమంది. ఆమెను తన భార్యగా పరిచయం చేసేసరికి నాకు మూర్ఛవచ్చినంతపనైంది ఇంక మిగిలిందే(విటీ? రెండోరోజే రాజీనామా పంపించేశాను. అదంతా ఒక పీడకలగా మరిచిపోదలచాను. మరిచిపోగలిగాను కూడాను. ఇప్పుడు నాకే బాధా లేదు.

అయితే చెల్లాయ్! ఇక నా పెళ్ళి విషయంలో నిన్నూ మీ ఆయన్నూ అట్టే విసిగించదలచుకోలేదు. మీరు ఆశిస్తూన్న శుభవార్త అందజేస్తూనే వున్నాను... నాకు పెళ్ళి స్థిరపడిపోయింది...అవును విజ్జీ! నిజమే. ఈసారికిక తిరుగులేదు. అతి త్వరలోనే వివాహం జరిగిపోవొచ్చు కూడాను. మూర్తి వొప్పుకున్నాడు. శ్యామలకు సమ్మతంగానేవుంది, డాక్టరు మా(వయ్య మొదట కాస్త మొరాయించినా, తర్వాత సరేనన్నాడు. నాన్నారితో చెప్పాను. ఆయన ఎప్పటిలాగే ఏమీ మాట్లాడలేదు. తమ్ముడికి రాసే

స్తున్నాను. మీకూ అభ్యంతరం వుండదనుకుంటాను. పెళ్ళికి వస్తారుకదూ ?

నీ ప్రియమైన
విశాల

## 13

విజయపురినార్త్
4 వ జూన్ 1961

అక్కయ్యా, అక్కయ్యా,

నేను సంతోషము పట్టలేకుండా ఉన్నాను అక్కయ్యా. నీ ఉత్తరములోని మూడవ ప్యారా ఇప్పటికి ఒక పది సార్లైనను చదివి ఉంటాను నా కళ్ళని నేనే నమ్మలేకుండా ఉన్నాను. నీ ప్రతి ఉత్తరములోనూ ఏదో ఒక మెలికపెట్టి నన్ను కలవరపెట్టే నీవు ఇంత త్వరలో ఈ నిశ్చయానికి వచ్చెదవని నాకు నమ్మకము లేకుండా వుండినది. నా ప్రియమైన అక్కయ్యను అమాంతముగా కౌగిలించుకొని ముద్దులవర్షము కురిపించవలెనని ఉన్నది. త్వరలోనే ఆ పని చేస్తానులే. కాని అక్కయ్యా, ఇదేమి ప్రశ్న? మేము పెళ్ళికి వస్తామా అని వ్రాసినావే? రాక? అసలు మేము రాకుండా పెళ్ళి ఎట్లా జరుగుతుంది? మావారిని శలవుపెట్టెయ్యమని చెప్పేసినాను. నేనుకూడా పెట్టె సర్దటము మొదలెట్టేసినాను అయినా అంత తొందరేమిటీ? బహుశా మూర్తి బావకు శలవులు అయిపోవచ్చినాయేమో. ఇంకొంచెము పొడిగించుకోమనరాదా ? కనీసము పదిహేను రోజుల గడువేనా కావద్దా ? పెళ్ళంటే మాటలా ?

మాకు అభ్యంతరము ఉంటుందేమో నన్న అనుమానము నీకెందుకు కలిగినదీ? నీకునచ్చినవరుడు ఎవరైననూసరే మాకు ఇష్టమేనని నేను ఇదివరకే వ్రాయలేదా? దీనితో ఇన్నాళ్ళూ స్నేహముగా నున్న మనరెండు కుటుంబాలు బంధుత్వములో ఏకమైపోవును కదా ? ఎటొచ్చీ మూర్తి బావ నీకంటే పెద్దవాడో చిన్నవాడో నాకు తెలియదు. అయినా అదంత ముఖ్యమైన విషయము కాదు. మీరుభయులూ ఇష్టపడినారు. అంతేచాలు తేదీ నిర్ణయము కాగానే వ్రాయగలవు. వెంటనే వచ్చేస్తాను.

ఇట్లు
నీ విజయ

## 14

హైద్రాబాద్
7-6-61

ప్రియమైన విజయకు,

క్షమించాలి చెల్లాయ్ ! సమయానికి మిమ్మల్ని పిలిపించుకోలేక పోయాను. మొన్న అయిదవ తారీకున ఆకస్మాత్తుగా మా పెళ్ళి జరిగిపోయింది. అయితే మీ రనుకున్నట్టు మంగళ వాద్యాలతో, బంధుమిత్రుల సమక్షాన, పెళ్ళి పందిట్లో జరుగలేదు. అసలు ఆ తతంగమంటే నాకు మొదట్నించీఇష్టంలేదు. అందులో ఈ పెళ్లి అలా వైభవంగా జరుపుకోటం భావ్యంగా తోచలేదు. అందుకని రిజిస్ట్రార్ ఆఫీసులో రిజిస్టర్ పెళ్ళి చేసేసుకున్నాం.

ఆ సాయంత్రం మాత్రం కొందరు పరిచయస్తుల్ని అల్పాహారానికి ఆహ్వానించాం. అప్పటికైనా మిమ్మల్ని పిలిపించుకునే వ్యవధి లేకపోయింది. అసలు ఆ నాటి ప్రొద్దుటివరకూ నిశ్చయమే కాలేదు. మూర్తి శలవుల extension కోసం దరఖాస్తు పంపించాడు. వస్తుందనే ధీమాతో వున్నాం. కాని ఆ రోజు ప్రొద్దున్నే టెలిగ్రాం వచ్చింది శలవు reject చేస్తూ. ఇక గత్యంతరం లేక ఆ రెండోరోజే వెళ్ళిపోతానన్నాడు. బళ్లు తెరుస్తారు, తానూ వెళ్తానంటూ శ్యామల కూడా గోలపెట్టింది. ఇద్దరు పిల్లలు వుండగానే ఈ పనిజరిగిపోవాలని పట్టు పట్టాడు డాక్టరు మామయ్య. దాంతో వెంటనే వెళ్ళి రిజిస్టరీ పెళ్ళి చేసేసుకున్నాం. రెండోరోజు, అంటే నిన్న సాయంత్రమే మూర్తీ, శ్యామలా ఇద్దరూ వెళ్ళిపోయారు. ఇవ్వాళ్ళ తీరిగ్గా నీకు వుత్తరం రాద్దామని కూచున్నాను. ఇంతలోకి నీ వుత్తరంకూడా అందింది.

మీకు అభ్యంతరం వుండదని నాకు తెలుసు, సంతోషం. కాని అదేమిటి? మూర్తి ప్రాయానికీ నాదానికీ పోల్చావేం? కొంపదీసి నేను మూర్తిని పెళ్ళిచేసికోబోతున్నా ననుకున్నావా? రామ రామ. అయితే నా వుత్తరంలో నేను స్పష్టంగా రాయనేలేదా? ఎంత పొరపాటు...... విజయా! నేను పెళ్ళిచేసుకుంది మూర్తిని కాదు, వాళ్ళనాన్న డాక్టరు మామయ్యని.

చూడు విజ్జీ! నిజంగా, నే నీవిషయం నా క్రిందటి వుత్తరంలో స్పష్టంగా రాయకపోతే అది పొరపాటే అందుకని నీకీ news షాక్ తగిలించొచ్చు. కాని కాస్త నిమ్మళంగా ఆలోచిస్తే నువ్వునాతో ఏకీభవిస్తావని నాకు నమ్మకంగావుంది. ఈ రెండు నెలల్లోనూ మామయ్యను చూస్తుంటే నాకు అదోలావుంటోంది. నాన్న ఇలాగే తయారవుతాడేమోనన్న భయం నన్నుపట్టుకుంది అటు మామయ్యనీ ఇటు నాన్నగారినీ శూన్యంలోకి జారి పోనీకుండా కాపాడే బాధ్యత నామీదే వున్నట్టుగా తోచింది. అందుకు ఇదొక్కటే మార్గం కనిపించింది. అవలంబించాను.

అయినా నేను పొరపాటే చేశానని మీరు భావిస్తే, నువ్వు సుహృదయురాలవి, నన్ను క్షమించు. వీలుంటే మీ ఆయన్నికూడా నన్ను క్షమించమని నా తరపున ప్రార్థించు.

నీ ప్రియమైన
విశాల

## 15

విజయపురి నార్త్
12 వ జూన్ 1961

విశాలా,

నీ జాలిగుండెకు జోహారులు! కాని నీ ఈ త్యాగానికి మేము ఎంత మాత్రము హర్షించలేము.

ఇట్లు
విజయ ★

# శాంతి నిడుము

బ్రతుకు నిరాశగా, బెదురు పాటుగ, శోకముగా, దరిద్ర తా యుతముగ, హేశనావిల తమోద్ధృతి భీకరరుద్ర భూమిగా, అతుకుల బొంతగా, క్షుభితయానముగా! చ్యుతిగా, కరం బసం గత మగు స్వప్నమై కరడు గట్టిన కారణమేమిటో, ప్రభూ!

మునుపు నీ పదధ్యాన సంపూర్ణ లగ్న
మానసుండను, స్మృతి చాలలేని నాకు
నాటి యనుభూతి పూర్తిగా నాదు హృదయ
కోటరంబున క్రొత్తగా గోచరించు.

నా హృదయ కోటరంబున నాగుబాము
లుజ్వల విషాగ్ని కీలల నుమియుచుండె,
తోకపై లేచి నాట్యాలు ద్రొక్కుచుండె
దేవ! అవి నిన్ను దర్శించనీవు నన్ను.

ఈ అసత్య బాంధవ్యము లీ యనిత్య
సౌఖ్యములు, లౌకికమ్ములు, చపలచిత్తు

గా నొనర్చెడి నన్ను, విజ్ఞాన రూప!
సత్యమై, నిత్యమైనట్టి శాంతి నిడుము

ఈ అసత్య తమోధృతి, యీ అనిత్య
కాల పన్నగ దంష్ట్రి కరాళ వహ్ని,
చుట్టు ముట్టిన వో ప్రభూ! చూడనీవు
నిత్య సత్య స్వరూపిని నిన్ను - నన్ను -

ఓ ప్రభూ! సంజవేళల నీ ప్రశాంత
మందహాసాంకి తాధర సుందర రుచి
ప్రతి దినంబును నా మనఃస్థితి సుషుప్తి
వీడునట్లుగ జేయు, కాపాడు మిట్లె

నిన్నటి మాదిరే బ్రతుకునిండను కార్తిక సాంద్ర చంద్రికల్
మొన్నటి మాదిరే కనులు మోడ్చిన భక్తి వినమ్ర భావనల్
కొన్నిట కొన్నియైన సమకూరిన జన్మతరించినట్లు, నా
పున్నెము పండినట్లు తలపోయుదు, దేవ! అనుగ్రహింపవె!





చిత్ర పరిచయ పోటీకి

# నీ కన్నీటితో నన్ను బంధించకు

-అందే భాగ్యలక్ష్మి

రాత్రి పన్నెండు గంటల ప్రాంతం... అమావాశ్య మరుసటి రోజు శ్మశానవాటిక. ఓ మూలగా పార్వతి సమాధి ప్రక్కన మోకాళ్ళమీద తల పెట్టుకుని విచారిస్తూ కూర్చున్నాడు సుబ్బారావు...అతనికి పూర్వం 'శ్మశాన' మంటే ఎంత భయమో! కాని,...... ఇప్పుడు?...ఇప్పటికి మూడు రోజుల నుండీ నిద్రాహారాలు మాని, వాతావరణ మార్పులను గమనించకుండా, పరిసరాల ప్రభావానికి లొంగిపోకుండా అదే శ్మశానంలో...పార్వతి సమాధి ప్రక్కనే కూర్చుని ఉన్నాడు. పార్వతిని అతను ప్రేమించి పెళ్ళి చేసుకున్నాడు ఆమె వొక పసిపిల్లవాణ్ణి ప్రసాదించి మరణించింది.

పూర్వం పార్వతితో కలసి పార్కుల్లో తిరుగుతూ గంటలు గంటలే గడిపేవాడు సుబ్బారావు' ఈనాడు పార్వతి సమాధితో శ్మశానంలో రోజులు రోజులే గడుపుతున్నాడు' ఓ నాడు పార్వతి కాటుక కళ్ళల్లో తన చిరునవ్వు మోము ప్రతిబింబాన్ని చూసుకొని ఆనందించాడు . ఈనాడు పార్వతి సమాధిని తన కన్నీటితో కడిగి, అందులో కృంగి కృశించి పోయిన తన వికార వదనపు ప్రతిబింబం చూసుకుని విచారిస్తున్నాడు

నిద్రాహారాలు లేనందువల్ల శుష్కించి పోయిన అతని ముఖం, మాసిన గెడ్డంతో వికృతంగా తయారైంది...తైల సంస్కారం లేని ఆతని గిరజాల జుట్టు రేగిపోయి గాలికి చిందరవందరగా ఎగురుతూంది ఏడ్చి ఏడ్చి, అతని కళ్ళు ఎర్రగా ఉబికి, నిప్పుకణాల్లా మారిపోయినయ్ .గాలికి రివ్వుమని గట్టిగా ఊగుతున్న జువ్విచెట్టు కొమ్మల మధ్యనుంచి, ఆగి ఆగి వస్తున్న మెరపుల కాంతిలో భయంకరంగా కన్పడుతున్నాడు సుబ్బారావు

వికృత ధ్వని చేస్తూ సుబ్బారావు మీదుగా ఎగిరిపోయిందొక గుడ్లగూబ... నిశ్చలంగా కూర్చున్న సుబ్బారావు తల పైకెత్తాడు ..

"ఏయ్ సుబ్బారావ్ !"

ఉలిక్కిపడ్డాడు సుబ్బారావు అటూ ఇటూ కలయజూసాడు...చుట్టుప్రక్కల ఎవరూ కన్పించకపోయేసరికి అదిరిపోయాడు...'భ్రమ' అనుకుని తనను తాను సంబాళించుకోబోయాడు

మళ్ళీ అదే పిలుపు..."ఏయ్ సుబ్బారావ్ '" ఆకలిబాధ, నీరసం కలిసి కోపంగా మారినయ్ అతనిలో. ధైర్యంగా అన్నాడు — "ఎవరు నువ్వు '"

"పిచ్చివాడా.. ఆమాత్రం నువ్వు నన్ను గుర్తించలేకపోయావా ?"

"ఎవరు నువ్వు ? ఎక్కడి నుంచి మాట్లాడుతున్నావ్ ? ఎందుకలా నన్ను భయపెడ్తావ్ ? నిన్నేం చేసేను ' నీకేం .." నీరసంగా గర్జించాడు సుబ్బారావు

"సుబ్బారావ్ ' నిన్నేం భయపెట్టడం లేదే !...అయినా నిన్ను నేనా భయపెడతాను ? సుబ్బారావ్, అప్పుడే నన్నంతగా మరచిపోయావా ?''

"ఇంతకీ ఎవరు నువ్వు ?..... . ఎందు..." ఉద్రేకంగా ఇంకా ఏదో అనబోయి, అనలేక ఆగిపోయాడు సుబ్బారావు

"ఉహ్...నేనా ? . నీ పార్వతి 'ఆత్మ'ని సుబ్బారావ్ '"

"ఆఁ !"

"కంగారుపడకు సుబ్బారావ్ ' నే నింకో శరీరంలో ప్రవేశించే నిమిత్తం బయలుదేరాను...కాని, నీ కన్నీరు నన్ను బంధించింది "

"పార్వతీ. !"

"పొరబడుతున్నావ్ సుబ్బారావ్ ఇక నీ పార్వతి దేహానికీ, నాకూ సంబంధం లేదు...ఇప్పటివరకూ నీ పార్వతిలాంటి దేహాల్లో ఎన్నింటిలోనో ప్రవేశించాను .. ఇప్పుడింకో దేహంలో ప్రవేశించబోతున్నా కానీ, మూడు రోజులనుండీ అదేరీతిగా కూర్చుని విచారిస్తున్న నిన్ను పలుకరించకుండా వెళ్ళిపోవటం నా ధర్మంకాదని .."

"ఏం ? నన్ను పలకరించి ఏం చేస్తావ్ ?"

"ఉద్రేకపడకు సుబ్బారావ్ ! .. ఇదిగో చూడు, నీకు శ్మశానమంటే భయం లేదూ ?"

"నా ప్రియ పార్వతిని పొట్టను బెట్టుకున్న దీ పాడు శ్మశానమేగా! అమ్మో! .. అదంటే. ." వణికిపోతూ అన్నాడు సుబ్బారావ్

"మరయితే ఈ శ్మశానంలో ఒంటరిగా అలా విచారిస్తూ కూర్చున్నావేం ?"

"నా పార్వతికోసం నా పార్వతి లేని జీవితం నాకు విచారం కాక మరేమిటి ?.. " బాధగా తల అటూ ఇటూ త్రిప్పుతూ, కన్నీరుకూడా లేని కళ్ళను మూసుకుంటూ అన్నాడు సుబ్బారావు

"పిచ్చివాడా ! . శ్మశానమంతటి సుందరమైన స్థలంలో పార్వతి కలిసిపోతే అలా విచారిస్తావెందుకు ?"

"ఏయ్ ! .. ఏమంటున్నావ్ ? శ్మశానం సుందరమైన స్థలమా ? ఈ



''నన్ను కోతిని చేద్దామని ప్రయత్నిస్తున్నావా?"
"దానికి ప్రయత్నం దేనికి ?"

గాడాంధకారం, ఈ అస్థిపంజరాలు, బొమికలు, ఎముకలు...పుర్రెలు... దుర్గంధం ... పక్షుల కళేబరాలు... ఛాఛాఛా .."

''అవన్నీ అశాశ్వతాలు సుబ్బారావ్! రెండుమూడు రోజులకి అవికూడా రూపుమాసి పోతాయ్ 'శ్మశానం సుందరమైన స్థలమా' అంటున్నావా ? మరికాదూ... చూడు ..ఆ ప్రకృతి ఎంత గగుర్పాటును కల్గిస్తుందో ! . ఆ మెరపుల మధ్య ఆ జువ్విచెట్లు, వాటి కాంతిలో ఆ బిళ్ళగన్నేరు పూలు...ఆహా! ..సుబ్బారావ్! 'సౌందర్యం, ఆనందం, అనుభూతి' అనే మాటలని ఎప్పుడైనా విన్నావా ?"

"ఏమో ....."

"అయితే విను ..'సౌందర్యం' అనేది గలగలపారే సెలయేటిలోనేకాదు, నిశ్చలంగా నిలుచున్న పర్వతంలో కూడా గోచరిస్తున్నది కిలకిలలాడే పక్షుల్లోనే కాదు, మౌనంగా నిలుచున్న గోమాతలో కూడా కన్పిస్తుంది ..ప్రకృతిలో ప్రతి

నిత్యమూ ప్రతిధ్వనించే భయంకర సింహ గర్జనలోనే కాదు, 'ఉష్' అంటే పారి పోయే చిట్టెలుక పరుగు 'సవ్వడి' లో కూడా అగుపడుతుంది. . సుబ్బారావ్! ప్రవహించే నది దారిలోఉండే కొండ రాళ్ళు విరహగీతాల్ని వినిపించి తన హృదయ భారాన్ని దూరం చేసుకునేం దుకు ప్రయత్నిస్తుంది ... కాని అవి ఆ గీతాల్ని లక్ష్యపెట్టవుగా...నీ పార్వతి సమాధికూడా నీ కన్నీటి వెచ్చదనాన్ని లెక్కచేయదు సుబ్బారావ్ '...చూడు ఈ మెరపుల కాంతిలో నీ పార్వతి సమాధి ఎంత అందంగా కన్పడుతుందో' ఈ ప్రకృతిని చూస్తుంటే నీకు 'ఆనందం' కల్గటంలేదూ? 'సౌందర్యం' 'ఆనందం' కలిస్తే 'ఓ అనుభూతి' కల్గుతుంది...అది ప్రస్థుతం నీకు కలుగకపోవచ్చు... కారణం — పవిత్రమైన ఈ శ్మశానంలో నీ పార్వతి కలిసిపోయిందనే విచారం"

"ఏమంటున్నావ్? ... 'శ్మశానం' పవిత్రమైనదా '...నీవు 'ఆత్మ'వి...ఓ దెయ్యానివి..." కోపంగా, ఉద్రేకంగా అన్నాడు సుబ్బారావు

"పొరబడుతున్నావ్ సుబ్బారావ్! శ్మశానం, 'సమానత' అనే సందేశాన్ని మౌనంగానే ఉండి సంసారానికి అంద జేస్తుంది ... నోళ్ళు పెగలదీసుకుని ఏ నాయకుడు ఏ ప్రజాస్వామ్య పరిపా లనలో ప్రతివాడికీ సమాన హక్కులిస్తు న్నాడు? .. ఈ శ్మశానవాటిక నోరు మెదపకుండా, మూగగా కూర్చుని ప్రతి వ్యక్తికీ, కులమత భేదాలు పాటింప కుండా, గొప్ప, బీద తారతమ్యం చూప కుండా, ఆబాల గోపాలానికి సమానమైన ఆదరాన్ని చూపెడుతుంది. 'సమానత' అనేపదానికి అర్ధమే 'శ్మశానం'! కష్ట సుఖాలతో నిండిన జీవితమనే బాటమీద ప్రయాణంచేసే ప్రతి ప్రాణికీ గమ్య స్ధానం శ్మశానమే' సాంసారిక వాంఛ లకు లోబడి, పాపాలు చేసి, కలుషితం చేసిన శరీరాన్ని ఈ శ్మశానంలోనే ప్రతి ప్రాణీ భస్మం చేస్తుంది సుబ్బారావ్' ఒక్క 'కపాలపు ప్రేలుడు' తో మోక్షం ప్రసాదించే దీ శ్మశానమేగదా' వింటు న్నావా సుబ్బారావ్?"

"ఆఁ..."

"ఇయితే ఇంకా విను ..శ్మశానం పవిత్రమైన స్థలమని ఎందుకు అనబడు తుందో చెబుతా..., ఓపిగ్గావిను సుబ్బా రావ్...నాలాంటి 'ఆత్మలు' తమ తమ వికాసానికై అనేక శరీరాల్లో ప్రవే శిస్తుంటయ్...అన్నట్టు సుబ్బారావ్, ఎప్పుడైనా 'జీవాత్మ', 'పరమాత్మ'అనే పదాల్ని విన్నావా?"

"లేదు..."

"జీవాత్మఅంటే భగవంతుని సృష్టి లోని ప్రతి జీవిలోను ఉన్న 'ఆత్మ'. 'పరమాత్మ' అంటే ఆ 'భగవత్ శక్తి'. ఆ భగవంతుడే 'పరమాత్మ'. సృష్టిలో చలనమున్నవీ, లేనివీ, ప్రతి వస్తువూ

ఆ పరమాత్మనిచేత సృష్టింపబడినవే .. చూడు ... సూర్యభగవానుని స్పర్శతో కమలాలు వికసిస్తుంటయ్...అంటే... సూర్యభగవానుడు 'పరమాత్మ' అన్న మాట. 'కమలం' అతని సృష్టి...అంటే 'జీవాత్మ'. ఆ రెండిటిమధ్య ఎంత దూర ముంటుందో తెలుసుగదూ ? అయినా మరి సూర్యుని కిరణాలకు కమలం వికసించ టానికి గల కారణం ? ఆ రెండిటిమధ్య గల సంబంధం అవిచ్ఛిన్నమైనది... 'జీవాత్మ' తన వికాసంకోసం అనేక శరీరాలలో ప్రవేశిస్తుంటుంది ఒక శరీరంనుండి వేరొక శరీరంలోకి ప్రవే శించటం మూలంగా తన పరిపూర్ణ ఔచిత్యాన్ని, వికాసాన్ని పొందగల్గు తుంది, తన జీవిత లక్ష్యాన్ని సాధించ గల్గుతుంది అట్టి జీవాత్మ వికాసానికి అను కూల ప్రదేశం ఈ శ్మ...శా.. నమే! అంటే ఈ 'శ్మశానం' మూలంగానే 'పరమాత్మ' కూడ 'జీవాత్మ' సహా యంతో వికాసాన్ని పొందగల్గుతున్న దన్నమాట సృష్టికి మూలమైన పర మాత్మ వికాసానికి పాటుపడే ఈ 'శ్మశానం' పవిత్రమైనదికాదూ ?



"చూడు, ఆ చివర నక్కలెలా కూస్తున్నవో . భయపడిపోయిన ఆత్మలని ఆ కుక్కలెలా వెంబడిస్తూ శ్మశానంలోకి తోలుతున్నవో! ఆహా! 'శ్మశానం' ఎంత భారాన్ని సహించి, త్యాగం చేస్తూ ప్రాణులకు సాయపడుతుందో! అటువంటి 'శ్మశానం' సుందరమైనది కాక, పవిత్రమైనదికాక మరేమిటి? చెప్పు సుబ్బారావ్. ?''

"నన్నేం చెప్పమంటావ్?.. నన్నేం చేయమంటావ్. .ఈ శ్మశానమంటే. అమ్మో! ."వణికిపోయాడు సుబ్బారావ్

"శ్మశానమంటే భయపడేది సామాన్య ప్రజానీకం . . శ్మశానంలో పిశాచాల వికటాట్టహాసాలు వినిపిస్తా యనుకుంటారు.. పుర్రెలు గాలిలో తేలియాడుత వనుకుంటారు ... కొరివి దెయ్యాల వికృతరూపాలు కనిపిస్తా యనుకుంటారు ... అంతా భ్రమ '.. అవన్నీ సంసార బాధలచేత వేధించబడి వేడెక్కిపోయిన మెదడుయొక్క అభూత కల్పనలు ... సుబ్బారావ్ ' నీ కర్తవ్యాన్ని గురించి ఆలోచించుకో.. ' రేపు నువ్వూ ఇలా శ్మశానంలోనే కలసిపోతావ్ ' నీ పార్వతి ప్రక్కనే నువ్వూ మట్టి అయిపోతావ్ '' లే గతాన్ని మరచిపో...నీ పార్వతిలాంటి వాళ్లెందరో ఈ శ్మశానాన్ని కౌగలించుకున్నారు...లే సుబ్బారావ్ ' నేను పోతున్నా...నాకింకో శరీరంలో ప్రవేశించే సమయమొచ్చింది...లే...నాకు సెలవియ్ ... నా కోర్కె తీర్చు ... నీ కన్నీటితో నన్ను బంధించకు పవిత్రమైన శ్మశానంలో నీకంటె ముందుగా కలసిపోయిన నీ 'పార్వతి' అదృష్టవంతురాలు . శ్మశానంలో కలసిపోయినవార్ని గురించి ఏమాత్రం చింతించకు వెళ్లు "

రివ్వుమని గాలి వీచింది ..మేఘాలొక్కసారి గర్జించినయ్.

సుబ్బారావులేచాడు ... ఒంటి మీద నుంచి గంపెడు దుమ్ము క్రిందపడింది ధీర్ఘంగా నిట్టూర్చాడు . . తూలుతూ ముందుకుసాగాడు...పట్టుతప్పిన నడక దుమ్ము గొట్టుకుపోయిన వస్త్రాలు. నిజంగా పిశాచంలా ఉన్నాడు సుబ్బారావ్ ఆ శ్మశానంలో

చేతులతో నొసలు పట్టుకుని భారంగా అడుగులు వేస్తున్నాడు మబ్బులు దిట్టంగా క్రమ్మినయ్ మెరపులను అనుసరిస్తున్న ఉరుములు గగుర్పాటును కల్గిస్తున్నయ్ శ్మశానంలో అక్కడక్కడ మండుతున్న చితులు గాలికి ఇంకా వేగంగా రగులుకొంటున్నయ్... ప్రక్కనే ఉన్న జువ్వి చెట్టుమీదనుంచి గుడ్లగూబ అదేపనిగా కూస్తున్నది సన్నగా తుంపర ప్రారంభమైనది . ఒక పెద్దమెరపు . దాని ననుసరించిన భయంకరమైన ఉరుము . 'ఫెళఫెళ' మంటూ విరిగి పడిందొక జువ్వి చెట్టుకొమ్మ.

★



# పిచ్చివాడి స్వగతంలో గతం

'కొలకలూరి'

(వాల్తేరులో వున్న పిచ్చి ఆసుపత్రి దగ్గరగా ఘోషపెడుతూ సముద్రం వుంది. విశాఖపట్టణం పోయే సిటీ బస్‌స్టాప్ దగ్గర జనం నిలబడి వున్నారు ఒక పిచ్చివాడు తప్పించుకొని ఆ జనాన్ని చూచి ఏమేమో మాట్లాడ్డం ప్రారంభిస్తాడు)

ఆకాశం అంగుళమయినా కదలకుండా వుండాలిట సముద్రం మాత్రం చచ్చినట్లు మూలుగుతూ నేలమీదపడి ఏడవాలిట. అలాగే ఆడదీ,మగాడూ ఎందుకుదూరంగా వుండకూడదో ? ఛీ ' ఛీ ' ఈ దేవుడు మరీ పిచ్చాడయిపోతున్నాడు రోజు రోజుకీ

మగాడు బ్రహ్మచారిగా వుంటే ప్రభుత్వం పన్ను వేస్తుంది అంటే అర్థం పెళ్ళిచేసుకోమనేగా ' దిలాసాగా పెళ్ళి చేసుకొని హాయిగా పిల్లల్ని కంటూవుంటే భర్త కంట్రోల్ భార్య కంట్రోల్ అంటూ రేషన్ ఇవ్వటం ఏమిటో ?

గులాబిపూవుకి ముళ్ళుఎందుకుండాలీ? అదిసరే మరి బంగారానికి వాసన ఎందుకు

లేదూ ? పోనీ నా చేతులకి సంకెళ్ళు ఎందుకు? కారణం నాకు తెలీదనుకొంటు న్నాడు మీ దేవుడు. నా చేతులే కాళీగా వుంటే మరోసృష్టి చేస్తానని పాపం భయం!

నేనంటే ఈ దేవుడికి యమా దిగులు. నా నీడ కూడా భరించలేడు నేను గది లోంచి వెలుపలకి వచ్చేనంటే దేవుడ్ని డొక్క చింపేస్తానని తెలుసు అందుకే నన్ను కదలనివ్వకుండా కటకటాలమధ్య బంధించాడు చూడండి సభికులారా! అన్నట్లు చెప్పటం మరిచాను, సభికులంటే జూదగాళ్ళని కదూ అర్థం? వెదకండి డిక్షనరీలు వాడి రహస్యాలకు నా గుండె ఒక డిక్షనరీ. అవన్నీ మీకు ఎక్కడ చెబుతానో అని లేనిపోని దిగులుతో కుమిలి పోతున్నాడు.

చూడండి ఆడవాళ్ళని. వట్టి అబలలు, నడవటం కూడా చేత కాదు, అసలు మాట్లాడేందుకు నోరు లేదు అదంతా నటనతంత్రీ,నటన కాని నాలాంటి భర్తని మాత్రం అప్పుడప్పుడూ అడపా తడపా హాస్పటల్‌కి పంపుతూ వుంటారు,— పాపం మగవాళ్ళు అబలాబలలు.

మీదేవుడు దెయ్యం వుందని మిమ్మల్ని మభ్యపెట్టేవుంటాడు మీరు నమ్మే వుంటారు అదే మీపిచ్చి. అంటే ఆపిచ్చి వాడి మాటలు విని మీరంతా పిచ్చివాళ్ళు కావటం ఏమీబాగాలేదు నామాట వినండి మీ స్నేహితుడ్ని. నన్ను నమ్మండి దెయ్యంలేదు అదంతా నాటకం దెయ్యం గియ్యం జాన్తానై.

నరకం అనేది తెలుసుకదూ! తెలి యదూ? తెలియక పోవటం ఏమిటి? నరకాన్ని గూర్చి ఎలక్షన్లకంటే ఎక్కువగా ప్రచారం జరుగుతూవుంటే! ఈ లోకంలో తప్పుచేసిన వాడు తప్పనిసరిగా చచ్చి, హాయిగా నరకంలో బాధలు అనుభవి స్తాడట. మీ దేవుడు నరకం వుందని గేస్ కొడుతున్నాడు కదూ! అదంతా చెత్త. నమ్మకండి, చెడిపోతారు

మునిసిపాలిటీ అంటే ఏమిటను కొన్నారు మనుష్యుల పాలిటి రాక్షసి ఇప్పుడు ఈ మురుగుకాలవల్లో ఈగలూ దోమలూ లక్షలాదిగా కాపురం వుంటు న్నాయి కదా! రేపు చూడండి, కోట్లకొలది ఏనుగులూ, సింహాలూ నివాసం ఏర్పరచు కొంటాయి భారీఎత్తున వన్యమృగ సంరక్షణ.

మొన్న రోడ్డు రిపేరుచేస్తూ రోడ్ క్లోజ్‌డ్, టేక్ డైవర్షన్ (Road closed Take diversion) అని బోర్డు పెట్టారు కదా! ఎందుకో ఎడ్వర్‌టైజ్ మెంట్ ఒక ప్రేమకథ విఫలమయితే మరొక ప్రేమకథ ప్రారంభించమనేనా? అయితే అమోఘంగా బాగావుంది

మనిషికి హృదయం ఒకటి తగలడిం దటగా? అదెక్కడుందో చెప్పండి చూద్దాం. హృదయపూర్వకంగా ప్రేమిం చిన వనిత గతిస్తే కొంతమందికి పిచ్చి

ఎక్కుతుందట అసలు పిచ్చెక్కటమేమిటి ? పిచ్చీలేదు గిచ్చీలేదు పిచ్చి ఎక్కటం అనేమాట వట్టి పిచ్చిమాట పిచ్చి ఎక్కడమేమిటీ తాడిచెట్లు ఎక్కటం లాగా !

మొన్న రైలులో వస్తూవుంటే లెస్ లగేజ్-మోర్ కంఫర్ట్ మేక్ ట్రావెల్ ఎ ప్లెజర్ (Less luggage more comfort Make travel a pleasure) అని వుందికదా అంటే తెలుగు ఏమిటి ? తక్కువ బరువు, ఎక్కువ హాయి ప్రయాణాన్ని ఆనందదాయకం చేసుకో, అనేనా ? అంటే పెళ్ళాం పిల్లలు బాదరబందీ తగ్గించుకో జీవితం హాయిగా వుంటుదనేనా ? ఆహా ! రైల్వేవాళ్ళు కవిత్వం కూడా వ్రాస్తున్నారే !

కోర్టులు న్యాయాలయాలు అట అక్కడ న్యాయం అన్యాయం విడదీసి చెబుతారట అందుకే కాబోలు నన్నూ రాజీనీ విడదీశారు ఆపైన రాజీని చంపిన నేను, చంపానని చెబితే పిచ్చాడని తీర్పు ఇచ్చిన కోర్టులో ఏం న్యాయం జరుగుతుందో చెప్పండి ! కాగా నల్ల కోటుల్లో వుండే కోర్టు మనుష్యులు నల్ల మార్కెట్టు మనుష్యుల్లాగా ఏం న్యాయం చెబుతారూ ?

రైలుపెట్టెల్లో 'దొంగలున్నారు జాగ్రత్త' అని వున్న బోర్డు చూచి మీలో ఎవడయినా జాగ్రత్త పడుతున్నాడూ ! అహా ! మనలో మనమాట చెప్పండి



పిచ్చాసుపత్రిలో

"అయితే నీవు గాంధీవని ఎవరన్నారూ ?"
"స్వయంగా దేవుడే అన్నాడు."
"ఛత్, నేనామాట అననేలేదు."

ఎవడయినా, ఒక్కడయినా లేడే ! ఎందువల్ల ? ప్రతివాడూ ఏదోవిధంగా దొంగ కాకపోతేగా !

స్త్రీ పురుషులు సమానమట. బలేగా వుంది వరస ! అదెలా కుదురుతుంది చెప్పండి ఏడ్చి ముఖం కడుక్కున్నట్లు లేదూ ! వీళ్లు ఇవాళ ఇలా అన్నారు రేపు ఒకస్త్రీని మరొక స్త్రీకిచ్చి పెళ్ళిచేసి చోద్యం చూస్తూ వుంటారు

భారతదేశంలో మత ప్రసక్తి లేదుట అబ్బా, బ్రహ్మాండమైన ఆలోచన అలా అని ప్రత్యేక సదుపాయాలు ఏమిటో ! అంతామనమంచికే ! గొర్రె కావ్వింది అంతా గొల్లాడికే లాభం.

నేనేమో హరిజనుడ్నికదా ! రేపు ఏదయినా ఉద్యోగానికి దరఖాస్తు పెడితే అందులోవున్న కులం ఏమిటి అనేదానికి ఏంకులం వ్రాయాలి మతప్రసక్తి లేక

పోతే ! సెక్యులర్ స్టేటూవద్దు గీటూవద్దు చక్కగా కులాలూ మతాలూ వ్రాసు కుంటూ వుండవచ్చు ఉద్యోగాలు వస్తూ వుంటాయి

గాంధీ పున్నాడు తెలుసుకిదూ! ఆస్వామి మాటలు వినే నేను ఇలా తయారయ్యాను వద్దయ్యాబాబూ అన్నా వినకుండా మతాంతర వివాహం చేసుకోవాలని దుంపతెంచాడు మొన్న కనబడి పోనీకదా పెద్దాడు చెప్పాడు అని రాజీని పెళ్ళి చేసుకొంటే అదేమో అలా తయారయ్యే

చెట్లు భూమిలోంచి ఎందుకు పుట్టాయి? ఆకాశంలోంచి ఎందుకు పుట్ట లేదు? రాజీకి అంతఅందం ఎందుకుందీ? దేవుడు కనబడితే నేను ఇలా అన్నానని నిలబెట్టి అడగండి ముఖం తేలేస్తాడు.

సాయంకాలం మీ దేవుడు అలా బీచ్ లోకి షికారుకి రావచ్చు కారు చెడిపోయిందని చెప్పినట్లు గుర్తు పోనీ నడిచే వస్తాడు ఈ మధ్య నాతో ఎందుకు స్నేహం మరీ ఎక్కువ చేస్తున్నాడు! ఏమిటో గిరాకీ! ఇందులో ఏదో మోసం వుంది మసిదగ్గర మోసాలూ గీసాలూ మీసాలూ పనికిరావని ఆ పిచ్చాడికి తెలిసినట్లు లేదే!

ఈ లోకంలో ప్రయాణాలు మరీ ప్రమాదకరంగా తయారయ్యాయి ఎక్కడ ఏ రైలు పడుతుందో, ఇంకెక్కడ ఏబస్సు బోల్తాకొడుతుందో, మరెక్కడ ఏ విమానం కూలుతుందో, ఏమీ తెలియకుండా వుంది అయితే ఆ పరలోకానికి చేసే ప్రయాణంలో ఏ ప్రమాదమూలేదు అయితే రాజీకి మంచి ప్రయాణమే చిక్కింది

ఈ మధ్య జనానికి మతిమరుపు ఎక్కువయిపోతూవుంది హోటల్లో బిల్లు చెల్లించటం మరిచిపోయి వెళ్ళిపోయే మహానుభావులు ఎక్కువవుతున్నారు మొన్న రాజీ రైలులో హృదయం పారేసుకొంది అదేమో ఒకడు జేబులో దాచుకొని హాయిగా వెళ్ళిపోయాడు

విడాకులిచ్చి వెళ్ళిపోయిన రాజీ ఆ రోజు నా యింటికి వచ్చి వరండాలో నిలబడి, రైలులో మాట్లాడిన కుర్రాడితో నవ్వుకుంటూవుంది ఎందుకొచ్చావ్ అని నేను రాజీనడిగితే ఆమె మాట్లాడలేదు, సరికదా వాడు బ్లేడుతీసి చూపించాడు పిచ్చివాడినని చెప్పి, కోర్కెలు త్యజించిపోయిన రాజీని చంపటానికి దగ్గర ఎనిమిది అంగుళాల పదునైన కత్తితో నేను తిరుగుతున్నానని వాడికి తెలీదు పాపం

'అదేమిటి' అన్నాను నేను బ్లేడు చూస్తూ 'మొన్న రైల్లో ఆమె తనహృదయం నాకు ఇచ్చింది నువ్వు నిద్రపోయేటప్పుడు ఇవాళ నేను నా హృదయం ఇవ్వటానికి వచ్చాను' అన్నాడు ఆ బ్లేడుతో వాడు తన హృదయం కోసుకొని అది ఆమెకిచ్చే

లేకపోతే వరండాలో పడేసో వెళ్ళేటట్లు న్నాడు తీరా, ఆతీరు చూస్తే

అంతే అక్కడ క్షణంకూడా ఆగ కుండా వెళ్ళిపోయి రిక్షా ఎక్కాడు రాజీ వాడివైపు చూస్తూనే వుంది వాడు ఆ చూపుల్ని కౌగిలించుకొని, రిక్షాలో పడేసుకొని వెళ్ళిపోయాడు

ఆరోజు ఎంతో మంచిరోజు అప్పుడు ఆమె హృదయంలో వెచ్చటి రక్తంలో కత్తి ఎనిమిది అంగుళాలు దిగి హాయిగా పన్నీటి తీర్థం ఆడింది

(వెర్రిగా చూస్తూ) నరకంలోంచి ఊడిపడిన దెయ్యమా ఎవరునువ్వు? చెప్పు ఎందుకొచ్చావిక్కడికి? నువ్వు రాజీవా? బ్రతికేవున్నావా? చనిపోలేదూ? మాట్లాడవేం?

ఎలా మాట్లాడతావూ? చనిపోయావు కదా! నా హృదయంలో నిద్రపోతున్న అగ్నిపర్వతాలు కదిలించి పగలగొట్టి ప్రవహించిన కవోష్ణ రక్తపు లావాలో పడి, మాడి, బూడిద అయిపోయావుకదా! పలకవేం?

మగవాడి మనస్సులో మరమేకుల కరుకు స్పర్శ కలిగించి, లోకంలోని కాకులు వాడినిచూచి అరిచేట్టుగా చేసి, తలెత్తుకు తిరగకుండా ముళ్ళకంపలు కంచె వేసిన నీకేకాదు, నీలాంటి అందరికీ ఇలాంటి పీడచావు తప్పదు

నువ్వు దెయ్యానివి కాదుగదా! ఏమి టలా గాలిలో లీలగా తేలి తేలివచ్చి




"ఈ గుడ్డివాడు పాడితే పెద్ద పెద్ద బండలు కూడా కరిగి పోతాయటండీ"
"అలాగా అయితే త్వరగా క్రిందకు దిగుదాం పద"

తూలుతూ, సోలుతూ వ్రాలిపోతున్నావు! ఇదంతా నటనలో ఏచాతుర్యమో ప్రకటించడంకాదు కదా! నువ్వు దెయ్యానివే అయితే కాళ్ళు వెనక్కు తిరిగి లేవే!!

అయితే నువ్వు బ్రతికే వున్నావా? ఉండేవుంటావు లేకపోతే ఎలా రాగలవూ? వాడినికూడా ఇక్కడికి తీసుకు రాక పోయావూ! చాలా బాగా వుండేది

పోనీలే రా! ఇలా దగ్గరగా రా! నా చేతులకూ కాళ్ళకు సంకెళ్ళు వున్నాయి చూడు రా! ఇంకా! ఏమిటిలా దగ్గర కొస్తున్నావ్? నేనంటే నీకు భయంలేదూ! అదేమిటో నిన్ను చూస్తుంటే నాకు భయంగా వుంది

నువ్వు నామాట వినవుకదూ! ఎప్ప టికీ వినవా? ఇలాదగ్గరగా, నీకు ఇష్ట మయినట్టే, ఏ అభ్యంతరమూ లేకుండా స్వర్గానికి పోదువుగాని చచ్చినట్లు బాధ పడుదువుగాని రా!

అదేమిటి ? ఆ తళతళలేమిటి ? అది కత్తి కదూ ! నా కత్తిలాగావుంది ! నీ చేతిలోకి ఎలావచ్చింది.? ఆ కత్తితో ఏం చేస్తావు? నిజంగానా ? అయినా అంతదాకా నిన్ను బ్రతకనిస్తానా ?

(మెడ పట్టుకొని) చావు. మళ్ళీ జన్మంటూ లేకుండా చావు లోకంలో వున్న స్త్రీ జాతికంతటికీ కళ్ళుకనిపించేట్టుగా, హృదయంలో పరివర్తన వచ్చేట్లుగా చావు. యుగయుగాల నరకయాతన భరిస్తూ చావు.

ఓ స్త్రీ ! ఏ అమృత భాండంలోనూ ఎప్పుడూ విషంబొట్టు చిలకకు ఏ మంచు శిఖరం మీద అగ్నిశిఖలు ప్రాకించకు హృదయంఅర్పించిన వ్యక్తిని అవమాన పరచకు. ఏపసిహృదయంలోనూ ప్రళయ కాల ప్రభంజనంలాగా, సుడులు తిరిగిన వడగాలి దుమారంలాగా ప్రవహించకు తెలిసిందా? ఇంకేం తెలుస్తుంది !

నీ ప్రాణవాయువు ఏ అనంతవాయువుల్లో విలీనమయిందో, ఆ అనంతశక్తి మలినమయింది తన్నుకులాడుతున్నావా? నా హృదయం ఎంత తన్నుకు లాడిందో ఏమయినా గమనించావా ? అదేమిటి లేస్తున్నావు ఆదిశక్తి అవతారంలాగా. కత్తి ఇంకా నీ చేతిలోనే వుందా. అబ్బా! పొడిచావా!

నిన్ను నేను అనవసరంగా హత్య చేశాననీ, అది తప్పు అనీ, ధర్మం చనిపోలేదనీ, చెప్పటంకోసం వచ్చావా ? నేనే పిచ్చివాడినయి, హృదయం అర్పించిన భార్యని తూలనాడి హంతకుడి నయ్యానంటావా? నిజమేనా? అయితే – అయితే, క్షమించు రాజీ నువ్వు హాయిగా జీవించు

నీ ప్రేమ వ్యవహారం శంకించిన బాధ కంటే ఈ కత్తి గుండెలో గుచ్చుకొంటేనే హాయిగావుంది నువ్వుచచ్చిపోయి కూడా నన్ను చంపుతున్నావుకదూ ! బ్రతుకు. బ్రతికి ఈ పాపపంకిల ప్రపంచంలో భర్తను చంపిన హంతకురాలిగా బ్రతికిపో ! నేనేమిటి తూలిపోతున్నాను చచ్చిపోతున్నాను చచ్చిపోతున్నాను అబ్బా! (పడిపోయాడు)

(నెమ్మదిగాలేచి) నేను చనిపోలేదా ఎందువల్ల ? ఇదంతా మాయగావుందే ఆ దేవుడు ఈ మోసం చేశాడన్నమాట హోరి ! ఈ సంగతి గమనించక పిచ్చాడినయిపోయానే !

(తెర)






పంపగిరి ఇందిరాదేవి

'ఏమండీ! ఎప్పుడన్నా విషం పుచ్చుకోవచ్చునా?' అని అడిగినట్టుగాఉంది_ తాహతుకు మించిన అప్పు చేయవచ్చునా? అన్నపశ్న ఆ మాటకొస్తే విషం పుచ్చుకుంటే ఆ ప్రాణానికే ముప్పు' కాని అప్పులు మాత్రం సంతానాన్నికూడా సంకటంలోదించుతాయి అక్కరలేకుంటే ఆస్తి వారసత్వాన్ని వొదులుకోవచ్చు కాని అప్పుల వారసత్వాన్ని వొదలనియ్యవు సంఘనియమాలు

తాహతుకు మించిన అప్పు అనటంతోటే తీర్చలేని అప్పు అని స్పష్టంగా తెలుస్తూనే ఉంది మరి తీర్చలేని అప్పు చేస్తే దావాలు_డిక్రీలు_పరువునష్టం_పరపతి పోవటం_ఆ తరువాత జైలుప్రాప్తం. ఇవన్నీ తెలియక కాదు ఈ ప్రశ్న.'ప్రాణ విత్తమానభంగమందు బొంకవచ్చు' నన్నట్లు చేయకూడని పనికి ఏమన్నా Exceptions ఉంటాయేమోనన్న ఆశ అసలు మనబోటి వాళ్ళను వొదిలిపెట్టండి. 'అప్పుచేయ రోత హరిహరాదులకైన' అంటాడు వేమన. అంతకరినంగా చెప్పినా కొన్నిపరిస్థితుల్లో చేయవచ్చునుఅంటారు కొందరు ఆపరిస్థితులేమిటి? అన్నదే చర్చనీయాంశం

సాధారణంగాచూశారూ_వ్యాపారంలో దిగేవాళ్ళు, వ్యవసాయం మొదలుపెట్టే వాళ్ళు తప్పనిసరిగా అప్పు చేయాల్సి వస్తుంది, తాహతులేకపోయినా తరువాత వస్తుంది అన్న ఆశతో పంటలు పండి, వ్యాపారం పైకి వస్తే అప్పులుతీర్చేస్తారు. దివాలాతీస్తే ఇచ్చినవాళ్ళు మునగటమో, లేక ఉన్న సంతానంమీద ఆ తీర్చేభారం పడటమో జరుగుతుంది. అది కేవలం అదృష్టంమీద ఆధారపడి ఉంటుంది. అట్లాంటి పరిస్థితుల్లో అప్పుచేయవచ్చును అని ధైర్యంగా చెప్పటం సాహసమనిపించుకుంటుంది

కాని యింట్లోకొన్ని యిరుకుపరిస్థితులు వస్తాయి. నిజంగా తల్చుకుంటే ఒక్కొక్కసారి రక్తం మసిలిపోతుంది. ఇస్తానన్న కట్నానికి ఒప్పుకొని పెళ్ళికి తర్లివచ్చిన తరువాత ఇంకో రెండో నాలుగో వేలు ఇస్తే తప్ప వీల్లేదంటారు పెళ్ళి చెడి



పోయే పరిస్థితి - భార్య కళ్ళనీళ్ళ - వచ్చినచుట్టాలు తిరిగి పోతారన్న భయం కంటే ఆ పిల్లను మళ్లా ఎవరు చేసుకుంటారు అన్న దిగులుతో ఎంతపని చేయటానికైనాకూడా వెనుదీయడుతండ్రి అట్లా కట్నం అడిగిన తాహతు సంగతి తరువాత తొలిగండం తప్పితే తొంబయ్యేళ్ళ ఆయుస్సని ఎక్కడో తలతాకట్టు పెట్టి కార్యం గట్టెక్కిస్తారు అట్లాపెళ్ళిళ్లు చేసి తరువాత చిప్పలు చేతికొచ్చిన తండ్రులు ఎందరో ఉన్నా ఆ పరిస్థితిలో తాహతుకు మించిన అప్పుచేయక తప్పుతుందా అంటారు

'చేయవచ్చును'అని అనేవాళ్ళకు ఇంకో ప్రబలకారణం పిల్లవాడికి ప్రాణంమీదికి వస్తుంది చేతిలో కాని డబ్బుండదు అప్పుచేయకూడదని ఒరవడి దిద్దుకుంటూ వుంటే ఆ పిల్లవాడి ప్రాణం కాస్తా పోయాక చేసేదేముంది' ఇంతకంటె ఎక్కువ అవసరమయిన కారణం ఏముంటుంది' కనుక అప్పుడు చేయవచ్చును అని వాదనకు ఒప్పుకుందాం 'మీరంతా తాహతుకుమించిన అప్పులు చేయండి, ఏం ఫరవాలేదు' అని అన్నా ఎవరూ చేయరు నిప్పులో వేలుపెడితే కాలుతుందని అందరికీ తెలుసు సరే ఆసంగతి అట్లావుంచి, పరువు ప్రతిష్ఠలకోసం - ప్రాణాలు కాపాడుకునే నిమిత్తం అని టూకీగా తాహతుకు మించిన అప్పులు చేయవచ్చును, అని అంటే అంతటితో ఆగదుమరి

ఎందుకంటే అవి ఒకరికి వర్తించి ఇంకొకరికి వర్తించకుండా ఉండవనడానికి వీల్లేదు చూడండి తాహతుకు మించి అప్పుచేసి ఆ పూట తాగకపోతే తాగుబోతు ప్రాణాలు నిలువవు మన పిల్లవాడి ప్రాణాలు మనకెంతతీపో తాగుబోతు అయినా వాడి ప్రాణాలు వాడికీ తీపే మరి ఇహ పరువు ప్రతిష్ఠలందామా' జూదంలో ఓడినవాడు అప్పుచేసి మళ్ళీ పందెం వేస్తేనేకాని అతని గౌరవ మర్యాదలు దక్కవు ప్రాణం మీదికి రావటం—జూదంలో ఓడటం ఒకటేనా అంటారేమో' కాని ఓడిపోయినా మన్న అప్రతిష్ట భరించలేక రాజ్యాలను ఓడిపోయిన పాండవుల నడగండి తెలుస్తుంది, జూదంలో ఉండే ప్రాముఖ్యం

ఏమిటో। కనుక ప్రాణాలకోసం పరువు ప్రతిష్టలనే తెరచాటుచేసికొని అప్పులు చేస్తే చేసినవాళ్ళే భరిస్తారు ఒక్కమా ఓమిటంటే ఏ పరిస్థితుల్లో కూడ అప్పు చేయకూడదు అని ఒకరు అనటం, మరొకరు వినటం కాదు కావల్సింది – అది ఎవరికి వారికే తోచాలి అట్లా Convince అవుతే ఎట్లాంటి గడ్డు పరిస్థితుల్లోంచి అయినా తప్పుకునే విధానాలుకూడా వారికే తట్టుతాయి

మనం ఇంకా నయం, చేయవచ్చునా లెదా అనే మీ మాంసంలోనే ఉన్నాము కాని చేసే దొడ్డమహానుభావు లెందరో ఉన్నారు అప్పులు చేయటం కళగా ఆరాధించేవాళ్ళు కొంతమంది, వ్యసనంగా అలవాటయినవాళ్ళు కొంతమంది బియ్యంఅప్పులు మొదలుకొని చీరలు, నగలవరకు అప్పులే అట్లా అడిగే వాళ్ళనుంచితప్పించుకోవటం కష్టం కాస్త మొహమాటస్థులయితే। ఇచ్చినవి మరచిపోకుండా అప్పులలిస్టు రాసి గోడకు తగిలించగా చూశాను ఎవరింట్లోనో। ఇక పదిసార్లుఇచ్చి ఒకసారి లేదన్నామా అప్పు పుట్టదు బాబూ ఈ కొంపలోనని తిట్టిపోస్తారు అట్లా తీసికెళ్ళేవాళ్ళకు . మళ్ళీ యిచ్చే వివేకజ్ఞానం చాల తక్కువగా ఉంటుంది మామూలు బదుళ్ళేకావు డబ్బు అయినా ఇచ్చేటప్పుడు ఇనుడు – అడిగేటప్పుడు యముడు ఋణదాత ఒకటికి రెండుసార్లు



అడిగితే 'ఆ, దావా వేసుకో వోయ్–మరీ, కొంపపీక్కుని పారిపోతున్నామా' అని ఉల్టా దబాయిస్తారు దావా వేస్తే ఆనోటు తాను వ్రాసిందికాదని, ఆ మనిషినే ఎరగనని ఆ తేదీలలో ఊళ్ళోనే లేనని గీత నెత్తినపెట్టుకొని Truth, whole truth-nothing but the truth చెప్పేస్తారు నదురు బెదురు లేకుండా కోర్టులో ఎందుకు చెప్పవచ్చానంటే తాహతుకు మించిన అప్పులుచేయటం–ఎగ్గొట్టాలని చూడటం–ఇదీ వాళ్ళ మనస్తత్వం సరే ఎగకొట్టాలని చూసినా చూడకపోయినా తాహతుకుమించి అప్పులుచేసే వాళ్ళందరూ మాత్రం కోర్టు కళ్ళల్లో కారం

కొట్టలేరు ఇంకో పాయింటేమిటంటే అప్పు అడిగినంతమాత్రాన ఇవ్వాలని ఉందా, కనుక ఇచ్చినవాళ్ళదే తప్పుఅని. అవునుమరి. మంటలో కాలిపోతున్నప్పుడు పైకిలాగిన పాము కాటువేస్తే పాముది తప్పని ఎవరంటారు?

ఇహ అవసరాలకోసం తీసుకుంటారు. పాపం, తీర్చలేకపోతారు. పరిణామం అనుభవిస్తారు. కాని అప్పు చేయటం కళగా ఆరాధించటం ఏమిటీ అంటే అసలు అప్పు మళ్ళీ తీర్చాలి అనే దృష్టి ఉండదు వాళ్ళకు. కనుక తాహతు అన్న ప్రశ్నే లేదు. 'అన్నమయితేనేమిరా — మరి సున్నమయితే నేమిరా, ఈ పాడుపొట్టకు అన్నమే వేతామురా' అనే వేదాంతంతో 'ఈ తుచ్ఛమయిన డబ్బు మీ దగ్గరుంటేనేం, నా దగ్గరుంటేనేం. అందుకని నాదగ్గరే ఉండనీ' అన్న బాపతుక్రింద తీర్చేదిగులు పెట్టుకోక లక్షణంగా, కులాసాగా, వేసిన వేషం వేయకుండా, చెప్పినమాట చెప్పకుండా, వెళ్ళిన మనిషిదగ్గరకు వెళ్ళకుండా, కాలం గడిపివేస్తారు. ఈరకంవాళ్ళు ఉపయోగించే టెక్నిక్ చెపితే ఆశ్చర్యమేస్తుంది. మీకెందుకు, మా స్నేహితుల్లో జరిగిన అనుభవం ఒకటి చెబుతా వినండి. మా స్నేహితుల యింటిపక్కనఉన్న కాళీ యింట్లో ఒక నూతన దంపతులు దిగారు. నాలుగురోజుల్లో చక్కని కార్పెట్లు—కర్టెనులు — ఫర్నిచరు — చెట్ల



తొట్లు — నౌకర్లు — చాకర్లు — ఒక కారు డ్రైవరు, అంతా అట్టహాసంగా తయారయింది సంసారం. పార్టీలు, జనం రావటం పోవటం — ఆయనగారికి ఏదో బిజినెసు అన్నారు. మొత్తంమీద వారం రోజుల్లో వాళ్ళంత మర్యాదస్తులు స్నేహపాత్రులు లేరనిపించింది మా స్నేహితులకు. ఒక్కకుటుంబంలో వాళ్ళకు మల్లే ఇమిడిపోయారు.

కొన్నాళ్ళు గడిచాక మా స్నేహితురాలి రవ్వల అడ్డిగ నమూనాకోసం తీసికెళ్ళింది ఆవిడ. ఆ తరువాత ఓ రెండు వందలు చేబదులు ఆయనగారు పుచ్చుకున్నారు. రెండు మూడు నెలలయినా ఇవ్వాలని వాళ్ళకు కాని, అడగాలని వీళ్ళకు గాని తోచలేదు. స్నేహ బంధం అట్లాం

టిది. ఒకరోజు ఆవిడగారి తల్లికి సుస్తీగా ఉందని టెలిగ్రాం వచ్చిందని సాయంకాలం బండిలో బొంబాయి వెడుతున్నామని చెప్పింది ఆవిడ. వెళ్ళేటప్పుడు ఆ నెక్లెసు కంసాలి దగ్గరేఉందని— తయారయ్యాక దగ్గరే ఉంచుకోమని కూడా చెప్పింది. ఆమెకు ఎట్లాంటిఅనుమానమూ కలుగలేదు. మర్నాడుదయం — తాళాలు పగలకొట్టడాలు — పెద్దగుంపు ఇంటి ముందర — తేలిందేమిటంటే, ఇంట్లో వున్న సామాను కారుతో కూడా అంతా అద్దెవేనని! ఉన్న ఆరు నెలల్లో ఇందరినీ ముంచి ఉడాయించారు దంపతులు. ఇహ కంసాలి దగ్గరకువెడితే ఆమె చేయించుకో దలుచుకోలేదని, అప్పుడే వాపసు తీసికెళ్ళిందన్న జవాబు విని గుండె ఆగినంతపని అయింది మా స్నేహితురాలికి. ఇచ్చిన అడ్రెసుకు ఉత్తరాలు వ్రాస్తే ఆ పేరుగలమనిషి ఎవరూలేరని తిరిగి వొచ్చాయి. ఒక్క నాలుగణాలు చిల్లరలేక బదులు అడగాలంటే నాలుక పిడచకట్టుకపోయి, నరాల బలహీనం వచ్చేస్తుందే! ఈ రకం వాళ్ళకు ఎంత ధైర్యం, ఎంత నేర్పరితనమో చూడండి! ఆ టెక్నిక్ అమోఘం అన్నది అందుకే.

అప్పులు ఎందుకు చేస్తారు, చేసే వాళ్ళు ఎన్నిరకాలు అని చర్చించాక చేయవచ్చునా లేదా అన్న ప్రశ్నకు జవాబిచ్చేముందు అప్పులు ఇచ్చేవాళ్ళకు ఒక సలహా — అది నిష్ఠూరంగా ఇవ్వకుండాఉంటే అడుసుతొక్కి కాలుకడిగే అవస్థ తప్పుతుంది.

జైలుకు వెళ్ళదలుచుకుంటే మానాభిమానాలు అక్కర్లేదనుకుంటే — ఇతరులతో తన్నులు తినదలుచుకుంటే లక్షణంగా చేయవచ్చునని నా జవాబు—తాహతుకు మించిన అప్పు చేయవచ్చునా అన్న ప్రశ్నకు.






అలిగి వెన్నెల మలిగి పోయెను
చుక్కలన్నీ తొలగి పోయెను
రెప్ప వాల్చక ఎదిరి చూడగ
రేయి రేయీ కరిగి పోయెను

నీవు రాలేదూ
నీ జాడ తెలియలేదు

నవ వసంతము గడచిపోయెను
మనల కోయిల మరచిపోయెను
చింత కొమ్మల మీద తీతువు
కినుకతో వలపించ సాగెను

నీవు రాలేదూ
నీ జాడ తెలియరేదు

తలను చుక్కలపూలు పెట్టుక
వలువలా వెన్నెలను కట్టుక
చందమామను చంకబెట్టుక
ఎపుడు వస్తావో - నీ వెపుడు వస్తావో ?

నీవు కలుగని లోకమేలా
నీవు లేనిది నాకిమేలా
ఇంక నాకీ నరకమేనా ?
కినులలో కిదిలాడుదానా !
ఎపుడు వస్తావో - నీ వెపుడు వస్తావో




అసలు వాడు పుట్టటమే అంగవైకల్యంతో పుట్టాడు..అష్టవంకరలు తిరిగిన పొట్టిశరీరం.... ముఖం నిండా కందిగింజలంతేసి పులిపిరి కాయలూ, తప్పేలా లాంటి పెద్ద తలకాయ, వెనక మట్టిపిడచలాంటి చిన్నగూని, ఒకదానికొకటి ఎదురుతిరిగి త్వరగా నడవనీయని దొడ్డికాళ్ళు ఇత్యాదులు వాడి వికారరూపానికి ప్రధానలక్షణాలు.

వాడు నడుస్తుంటే యేదో జంతువు నడుస్తున్నట్టుంటుంది. కాని, మాటతీరు మాత్రం, మధురంగా మర్యాదగా వుంటుంది. వీధిలోని వాళ్ళకు వినోదం కల్పించడానికి, సర్కస్ కంపెనీలవాళ్ళు సాధించే మరుగుజ్జు మనిషిలా చిత్రంగా వున్నప్పటికీ, పుట్టిందగ్గరనుంచీ చూస్తున్న ఆవూళ్ళోవాళ్ళకు అతను సర్వసాధారణంగానే కనిపిస్తాడు.

అతను శరీరం వంచి కష్టంచేస్తాడు.. అరకదున్నటంలాంటి వ్యవసాయ పనులు తప్పించితే, మిగతా గట్లుపొయ్యడం, కలుపు తీయడం, యెడ్లని మేపటం పంటకోతలు కోయడంలాంటి పొలం పనులు అవలీలగా చేసేస్తాడు...యిండ్లూ వాకిండ్లూ ఊడ్చిచల్లి, అంట్లు తోమటం లాంటి యింటిపనుల్లో కూడా అతను చురుకుగానే వుంటాడు.... అన్నిటికన్నా ముఖ్యంగా, వాడికి అప్పజెప్పిన ప్రతి పనీ నమ్మకంగా, క్రమశిక్షణతో చేస్తాడన్న మంచిపేరు ఆవూళ్ళో వుండటంతో, అతనికి పనిదొరక్క పోవటం అంటూ యెన్నడూ వుండేదికాదు... యెప్పుడేపని లభిస్తే అప్పుడు ఆపని చేస్తూ, పొట్టకూటికి కరువులేకుండా కాలం గడుపుతున్నాడు వాడు.

వాడికి ముగ్గురు మగతోబుట్టువులున్నారు. మంచి ఆరోగ్యంగా బలిష్ఠమైన పందెపు గుర్రాలవలె వుంటారు వాళ్ళు. పనిలోకి వెళ్ళడానికి వాళ్లకు బద్ధకం... వెళ్ళినా, పావలా అర్ధాకంటే అధికం తెచ్చుకోలేరు... కాని, వీడు మాత్రం యేపనిలో పెట్టినా రోజూ, ముప్పావలా రూపాయికి, తక్కువ కండ్ల చూడందే యింటికిరాడు ... యింటికి పెద్దవాడై

మోర్యాహీరాలాల్ రాయ్

పుట్టటంవల్ల, యింటిపట్ల తన బాధ్యత లను గుర్తించి, వద్దన్నా వినకుండా సహాయపడుతూనే వుంటాడు... పైగా, తనకన్నా ఆరోగ్యవంతంగా వున్న తమ్ముళ్ళని చూసి, 'యింత బద్ధకస్తులైన వీండ్లు బ్రతికేదెట్లానో' అని జాలిపడు తుంటాడు

వాడికి పాతికేండ్లు నిండినై... యెప్పుడూ రోజుకు రూపాయికన్నా యెక్కువరాని పల్లెటూరి బ్రతుకుమీద విరక్తి పుట్టిందొకనాడు. దినదినం పెరిగి పోతున్న కుటుంబం అవసరాలను, గొర్రె తోకవంటి సంపాదనతో సరిపెట్టుకోవడం తలకుమించిన పనిగా కనిపిస్తున్నది... తమ్ముళ్ళకు బట్టలదగ్గరనుంచి చుట్టల వరకూ, తల్లిదండ్రులకు, అన్నం పెట్టడం నుంచి ఆసరాగా వుండి నడిపించటం వరకూ అంతా చూసుకోవాలి. వాళ్లకిష్ట మైననాడే పనికి వెళతారు తమ్ముళ్ళు... వెళ్ళినా, వాళ్ళ డబ్బులు ఆ రోజు త్రాగు డుకేగాని యింటికిరావు ... వాళ్లని అనటానికి వాడికి నోరురాదు ... తనకు సుఖంలేదు ... వయస్సులో వున్నారు వాళ్ళైనా సుఖపడకుండా యెందు కుండాలి? అని అనుకుంటాడు... కాని, రాను రాను, యీ సంసార నిర్వహణ, సూదిబెజ్జంలోంచి యేనుగును లాగి నట్టుగానే వుంటున్నది. వ్యవసాయం రోజులు వెనకపడిరే, పెద్దపనులు దొరకవు యీవుళ్లో...చిల్లర పనులతో ఘడపటం కష్టం అవుతున్నది...చిల్లర పనులకైనా పల్లెటూళ్లో అంత అవసరం వుండదు...అంతా యెవళ్ళపనులు వాళ్లు చూసుకునేవారే...యేనాలుగైదో వున్న ధనవంతుల కుటుంబాల యిండ్లలోనే ఆ పనైనా దొరుకుతుంది... నిర్వహణ యెలా మరి? అనుకున్నాడు

ఒకరి కొకరు బరువుగా, పెండ్లీ పేరంటాలు లేకుండా ఒకేచోట యిరుకుగా జీవించటంకన్నా, ఏదన్నా పట్నంవెళ్ళి యెవరింట్లోనన్నా పనికికుదిరితే, బావుం టుందనీ, ఆర్జన పెంచుకోవచ్చుననీ, చేతనైతే యింటికికూడా యింత పంపే మార్గం చూసుకోవచ్చుననీ ఒక అభి ప్రాయం వాడికి గట్టిగా తట్టింది...

మనస్సుకి తట్టింది మాటలోచెప్పటం, చెప్పింది కచ్చితంగా చేసి కూర్చోవటం అతనికి సహజ స్వభావం ... అవసర మైన సరంజామా సిద్ధంచేసుకుని, దారి బత్తెం మూట కట్టుకుని, అందరి చూపు లనీ తప్పించుకుంటూ, అనుకున్న పట్నా నికి ఆయాస పడకుండానే చేరుకున్నాడు వాడు.

పల్లెలో పుట్టిన దగ్గరనుంచీ వాణ్ణి అంతా 'గూనయ్యా' అని పిలవటమేకాని, వాడికి తల్లీదండ్రీ పెట్టిన స్వంత పేరంటూ ఒకటుందని అందరికీ తెలి యదు... ఏ కొందరికో పెద్దవాళ్ళకే తెలుసు... తనను అలాపిలుస్తున్నందుకు వాడికెన్నడూ కోపంరాలేదు... పసి

తనం నుంచీ వింటున్న పేరుకు అవమానం అనిపించలేదు... రాను రాను వాడే తన పేరు 'రాముడు' అన్న సంగతి మరచి పోయే స్థితికివచ్చాడు. పట్నం చేరుకున్నాకనే వాడికి తన పేరు చెప్పుకునే అవసరం కలుగుతుందని తెలిసి, లీలగా గుర్తుతెచ్చుకున్నాడు 'రాముడు' అని

జన్మతోచే వచ్చిన అవిటితనానికి వాడెన్నడూ కించిత్తు బాధపడలేదు... పుటకతో వచ్చిందానికి తనేంచేయగలడు? పట్నంలో కొత్తవాండ్లకు పనిదొరకటం కష్టం. అయినా పనిగట్టుకుని పదిరోజులు పదివీధులూ తిరిగాడు... అందరికీ వాడు చాలా చిత్రంగా కనిపించాడు. కాని, వాడికేదన్నా పనియిద్దామని మాత్రం యెవడూ అనుకోలేదు... తెచ్చుకొన్న డబ్బుతో పదిరోజులు కాలక్షేపం జరిగింది. రేపటి సంగతి యేమిటా అని ఒకమాపటి పూట, ఒక వీధిలో ఒక యింటిబయట చెట్టుకింద నిలబడి దీర్ఘంగా ఆలోచిస్తు న్నాడు రాముడు...

ఆదో ప్లీడర్ గారిల్లు..ఆయనెందుకో బైటికివచ్చి వీడిని చూశాడు... కాస్త చిత్రం అనిపించింది

"ఎవరోయ్ నువ్వు?" అన్నాడు.

"నేను పల్లెటూరినుంచి బతకడానికి వచ్చానండి?" అన్నాడు.

"యేం పని చేస్తావ్?"

"యేదైనా చేస్తానండీ! బస్తాలు మోయటంతప్ప..."



"మా అక్కయ్యకు మొగపిల్లవాడు పుడితే వంద రూపాయలిస్తావా?"
'ఆడపిల్ల పుడితే?'
"దాన్ని నీ కిచ్చేస్తాం."

---

"యింట్లో చాకిరి చేస్తావా?"....

"చేస్తానండీ!"...

ప్లీడర్ అతన్ని ఎగాదిగా చూశాడు.. "అలాగైతే ఒకవారం మా యింట్లో వుండు... మంచిగాచేస్తే ఎన్నాళ్లైనా వుండవచ్చు" అన్నాడు...

రాముడు సంతోషంతో ఒప్పుకున్నాడు..

ప్లీడరుగారికి ఒక రెండేండ్లక్రితం మొదటిభార్య పోయింది... సంతానం యిద్దరు మగపిల్లలు, ఒక ఆడపిల్ల... అంతా ఎదిగి, చదువుతున్నవాళ్ళే... ఆయన హృదయవాంఛలు తీరకనో, గృహనిర్వహణకోసమో, ఇటీవలే రెండోభార్యని పెళ్ళిచేసుకున్నాడు. రెండోభార్య మంచి సుందరరూపిణి... ప్లీడర్ మనస్సులో యేముందో తెలియదు కాని, యింట్లో పనిమనుషుల్ని పెట్టుకునేప్పుడు యెంచిగాని పెట్టుకోరాదను

కున్నాడు ... భార్యనిమిత్తం, పనికత్తె లున్నారు కాని, తనకోసం మరో నౌకరు కావాలి ... అవసరమే ... అందుకోసం అని చూస్తుంటే అనుకున్న పద్ధతి మనిషి నేటికి కనిపించా డాయనకు...

బలిష్ఠంగా, ఆరోగ్యంగా వున్న వయసు మగాళ్ళకు, బస్తీల్లో యింటి పనులు దొరకడం అనేది అసంభవం... అందులో ప్లీడర్‌గారిలాంటి ధనవంతుల యిండ్లలో, ద్వితీయులున్నచోట, దొరకడం మరీ అసంభవం... ఇలాంటివాళ్ళ వల్ల యేర్పడే ప్రమాదాలను తరవాత ఊహించటమే కష్టం అవుతుంది...ఇది చాలామంది గృహస్థుల అనుభవం రాముడిలాంటి జన్మ వికలాంగుడికి, ప్లీడర్‌గారిలాంటి అరవయ్యోపడి వాళ్ళిళ్ళల్లో అతి తేలిగ్గానే పని దొరుకుతుంది .

రాముడు ప్లీడర్‌గారి ఆంతరంగిక గృహభృత్యుడుగా నియమితుడైనాడు అయ్యగారు కోర్టు కచేరీలకు వెళ్ళే సమయం వరకూ, ఆయనకు స్నానపానాదులు సిద్ధం చేయటం, బూట్లు తొడగటం, చొక్కాగుండీలు విప్పడం, వెతికి పెట్టడం లాంటి చిల్లర పనులన్నీ చేయటం ... ఆయన మళ్ళీ వచ్చేదాకా, యింటి తోటలో పనిచేయటం, సాయంత్రం ఐదింటినుంచీ మళ్ళీ అయ్యగారి సేవ ... రాత్రి తొమ్మిదింటికి బయట వరండాలో ఒకవైపున పడక... యింటి కాపలా...యిదీ రాముడి నిత్యకృత్యం. ప్రస్తుతం ఉచిత భోజనం... రాముడిప్రాణం అనుకున్నంత కాకున్నా కొంతహాయిగా, తృప్తిగా వుంది

ఇంటి యజమానురాలు, ప్లీడరుగారి భార్య. ప్లీడరుగారు అనుకునేటంత పిచ్చి మనస్సున్న మనిషైతేకాదు ... మొదట్లో ఆవిడ రాముణ్ణిచూసి ఆశ్చర్య పడ్డది ... తనభర్త వెదకి వెదికీ, ఇలాంటివాణ్ణి నౌకరీకి పెట్టుకున్నాడేమా అనుకుంది... ఎవర్ని పెట్టుకుంటే తనకెందుకని తనే అనుకుంది రాముడికి పనిపాటల్లోవున్న శ్రద్ధాసక్తులూ, యజమానురాలిపట్ల వున్న భయభక్తులూ, ఒక్కవారం రోజులలోనే అభినందించబడ్డాయి ... మనిషి అయోమయంగా అందవికారంగా వున్నా, మాట, పని, పరిశుభ్రంగానూ మప్పితంగానూ వుండటంచూసి, యజమానురాలికి రాముడిపట్ల అమితవాత్సల్యం కుదిరింది వాడి వికారాకారం ఆమెకి జాలి అనిపించి నకొద్దీ, అతనిమీద అభిమానం జాస్తి అవుతూవుండేది ... మిగతా చిల్లర పని మనుషులు వాడిని చూసి నవ్వుతూ విచిత్రంగా ప్రవర్తిస్తుంటే, వాళ్ళని సున్నితంగా మందలిస్తూండేది ..

యజమానికికూడా రాముడి భయభక్తులూ, సేవా శుశ్రూషలూ మంచిగా నచ్చినై . వారంరోజుల తరవాత, వాడు 'పర్మనెంటు' అయిపోయాడు . యింట్లో ఉచిత భోజనంతోపాటు నెలకు ముప్పై

రూపాయల వేతనం ... రాముడికిక తన క్కావలసిందేమీ లేదనిపించింది.

కాలచక్రంలో ఆరు సంవత్సరాలు ఆకులు తిరిగినవి...రాముడిప్పుడు ప్లీడర్ గారింట్లో ప్రధానపాత్ర...యజమానిపట్ల వినయ విధేయతలూ, యింట్లో విశ్వాస పాత్రమైన ప్రవర్తన, పనిలోవున్న చురుకుతనం క్రమంగా రాముడు లేనిదే గడవటం కష్టం అన్న స్థితికి వచ్చింది..

అయ్యగారికి యెప్పుడేది కావాలో రాముడికేతెలుసు .అమ్మగారికి యెప్పుడు హాజరుపలకాలో, యెప్పుడు కూడదో తెలుసు...యింట్లో యిష్టంగాతినే కూర లేవో వాడే నిర్ణయించి తెప్పించాలి... వంట మనుష్యులకి పని పురమాయించాలి ... తోటలో పని జరిపించాలి ... ఇటీవల పుట్టిన పసి పిల్లల అజమాయిషీ చూడాలి...యిండ్లూ వాకిండ్లూ సర్వదా నీటుగా వుంచే ఏర్పాట్లు చూసుకోవాలి . యిప్పుడు రాముడు ప్లీడరుగారింట్లో నౌకరుగా లేడు ... పని వాళ్లందరితో సక్రమంగా పనిజరిపించే మేస్త్రీ...ప్లీడర్ గారి కుటుంబానికి విశ్వాసపాత్రుడైన ఆప్తుడు ప్రతిదానికీ రాముడే కావాలి . బట్టల బీరువాతాళం చెవులగుత్తి కనిపించకపోతే రాముడే యిల్లంతా వెతికి తేవాలి...దరవాజాల తెరలు మాసిపోతే రాముడే గమనించాలి ... ఇళ్లకి వెల్ల వేయించడానికి రాముడే సూచించాలి... పని మనుష్యులను నిర్ణయించి పెట్టుకునేబాధ్యత రాముడిదే...ప్లీడర్‌గారి కుటుంబం యెటన్నా పర్యటనలకు వెడితే లంకంత కొంపలో రాముడొక్కడే వుండాలి..తాళాలుకూడా వేసుకునిపోరు.. రాముడి కాళ్ళముందు బంగారం వేసినా పోదు .రాముడి పర్యవేక్షణలో తోటలో గులాబిపువ్వుకూడా మొరికిపడదు ... రాముడు లేకుంటే యీ యింట్లో పనులు యింత నమ్మకంగా, చురుకుగా జరగటం అసాధ్యం అనుకుంటుంది యజమానురాలు ... రాముడుంటే, యింటి అవసరాలను మరొకరు కనుక్కోవలసిన పనేలేదు అనుకుంటాడు యజమాని,...

ఒక రకంగా రాముడు ప్లీడర్ కుటుంబంలో సభ్యుడు...కాని, వాడు మాత్రం తను యిక్కడ సేవకుడుగానే భావిస్తూ, తనమీద వుంచుతున్న యింత విశ్వాసం దుర్వినియోగం అవుతూందేమోనని యెంతో భయంతోనే ప్రవర్తిస్తుంటాడు.. వాడు తన జీతంలో నెలకు ఒక్క అయిదు రూపాయలు మాత్రం చిల్లర ఖర్చుల నిమిత్తం పుచ్చుకొనేవాడు... మిగతా డబ్బును లెక్కప్రకారం, ప్లీడరుగారే వాడిపేరుతో బ్యాంకులో ఖాతా పెట్టించారు ఒక్క సంవత్సరన్నర నించీ వాడికి జీతం పెరిగింది...రాజ భోజనం... నెలకు యాభై రూపాయలు.

నౌకరీలో రాముడు ప్రవేశించిన మరునాడే ప్లీడర్‌గారికో మంచి ఛాన్సుతగిలింది...రెండులక్షల రూపాయల విలువ




గల ఆస్తికి సంబంధించిన ఒక దావాలో తను వాదించిన తరపు విజయం లభించింది అనుకోకుండా ... ఒక ఖూనీకేసులో, ఆశలు వదులుకున్న నిందితులకు అయాచితంగా విముక్తి లభించింది... యీ రెండు కేసులలోనూ ఆ మరునాడు ప్లీడర్ గారికి వచ్చిన రాబడి మొత్తం, అన్ని ఖర్చులుపోను ఆ రోజు నగదుగా చేతిలో పడింది... పన్నెండువేల రూపాయలు . రెండులక్షల రూపాయల ఆస్తికి పాపర్ దావా నెగ్గినపార్టీ, ప్లీడర్ కి ఫీజుఘనంగా ముట్టచెప్పడంతోపాటు ఆయన్ని బుజాల మీద యెక్కించుకుని ఊరేగించారు... ఖూనీ కేసులో విడుదలైన ముద్దాయీలు తమ అభిమాన గౌరవాలు పరిరక్షింపబడ్డందుకు, తమ యావదాస్తినీ కూడా ప్లీడర్ గారికి యివ్వడానికి అభ్యంతరం లేదనీ, యిచ్చినా ఋణం తీరదనీ అభినందించారు.

ఆశలు వదులుకున్న యీ రెండు కేసులలోనూ అత్యంత విజయాన్ని అనుకోకుండానే పొందగలగడం ప్లీడర్ గారికే ఆశ్చర్యం అనిపించింది ... తను సాయశక్తులా వాదించాడు ... కాని యెక్కడో కన్విన్సింగ్ పాయింటు వుంది అది ఆయనకూ తెలియలేదు ... జడ్జిగారి బుర్రలో దేవుడుదూరి న్యాయాన్ని గెలిపించడమో, లేక, రాముడి పాదంలో వున్న మహాత్మ్యమో అనుకున్నాడు ప్లీడర్...రాముడంటే ఆయనకో మూఢ విశ్వాసం యేర్పడ్డది ... కాని, యిది యెన్నడూ యెవరిముందూ వెల్లడించడు.. రాముడిని వదులుకొనటానికి యిష్టపడడు ...

ఈ రెండు కేసుల విజయంతో ప్లీడర్ కు మునుపెన్నడూలేని ప్రఖ్యాతి అమాంతం వచ్చింది ... ఫలానా ప్లీడర్, సివిల్, క్రిమినల్ వ్యవహారాలలో దక్ష

డన్న ప్రతీతి చెలరేగింది. సవ్యసాచి లాంటి వాడనీ, ఉరిశిక్షపడే కేసైనా వాదించి గెలుస్తాడనీ జనంలో నమ్మకం ప్రచారం అయింది ... ఐదేండ్లలో అది వరకు ఆర్డినరీ ప్లీడరు, అడ్వకేట్ అయి లక్షాధికారి అయాడు. రాముడికి నెలకు యాభై రూపాయ లివ్వటం దండగేమీ లేదని ఆయన నిర్ధారణ.. వాడు అడగటం లేదుకాని, అడిగితే వందరూపాయలైనా యివ్వడానికి ఆయన సిద్ధమయేంత మూఢ విశ్వాసిగా మారిపోయాడు...యీ సంగతి యెవరికీ తెలియదు ... తనొక సేవకుడి ననే నిత్యభావన రాముడిది

యజమానురాలికి రాముడంటే విశ్వాసంతోపాటు దయ, జాలి వుండేవి... వాడి అంగవైకల్యానికి నొచ్చుకుని జాలి పడుతూ, కష్టపు పనులకి యెన్నడూ నియోగించేదికాదు ... వాడికి కొంచెం పడిశంపడితే ఆవిడ వాడు విశ్రాంతి తీసుకునే వరకూ వూరుకునేదికాదు ... యేదన్నా ప్రస్తావన వచ్చినప్పుడు అంటుండేది_

"యే వూరో, యే పల్లో తెలీదు పాపం '...యేతల్లి కన్నబిడ్డడో...వాడి దురదృష్టవశాత్తు ఇట్లా పుట్టాడు ... భగవంతుడు వాడి హృదయానికి యిచ్చిన సౌకుమార్యాన్ని శరీరానికి యివ్వక నిర్దయగా చూశాడు ... అయితేనేం ... వాడంత విశ్వాసపాత్రుడు లేడమ్మా! వాడిఋణం తీర్చుకోలేము" . అంటుంది.

'అవిటితనమే లేకుంటే, పొద్దస్తమానం నడుం విరిగేలా చాకిరిచేసినా యింకా పనిమిగిలిపోయే యీ రాక్షసి కొంపలో వాడెందుకుంటాడు...! అవిటితనమే లేకుంటే యెక్కడో యింతకన్నా మంచి నౌకిరీకే కుదిరి, హాయిగా పెళ్ళి చేసుకుని సంపాదించుకుని తృప్తిగా బ్రతికేవాడే' అనుకుంటుంది తన మనస్సులో ...

పెండ్లి చేసుకొమ్మనీ, భార్యను తెచ్చుకుని సుఖపడమనీ, ఒకటి రెండుసార్లు భర్తముందు రాముణ్ణి హెచ్చరించింది కూడా ... "నిజం, నిజమే... రాముడు పెళ్ళి చేసుకోవలసిందే..." అనేవాడు ప్లీడర్ ... మళ్ళీ మరచిపోయేవాడు ...

ముప్ఫయ్యేళ్ళ పైవున్న రాముడికి పెళ్ళిసంగతి యిదివరకు మనస్సులోకే రాలేదు...కాని,యిటీవల యజమానురాలి హెచ్చరికలతో, పెళ్ళి, అనే పదాన్ని గురించి ఆలోచించవలసిన అవసరం కలిగింది వాడికి...వాడిలా ఆలోచిస్తుండగానే మూడు నాలుగు పెండ్లి వూరేగింపులు ఝుంఝూమారుతంగా సాగిపోవటం వాడు కండ్లారా చూశాడు ... ఆలోచించినకొద్దీ పెండ్లి అనేదేమిటో వాడికి అర్థం అవుతూ వచ్చింది. కాని, వాడి శరీరం చూసుకున్నప్పుడల్లా యేడుపు వచ్చేది ...

మాటల సందర్భంలో ఒకనాడు యజమానురాలు రాముణ్ణి పెండ్లి చేసు

కోమంది. రాముడు తన వైకల్యం గురించి కన్నీళ్ళతో మొరపెట్టుకున్నాడు. యజమానురాలు ఓదార్చింది... "నీకేం తక్కువ రాముడూ! భగవంతుడి లోపం అది...యింతకన్నా పుట్టుగుడ్డివాళ్ళకూ, పూర్తి కుంటివాళ్ళకూ పెండ్లిండ్లు కావటంలేదూ...నీవు ఒప్పుకుంటే నీకు పెండ్లి చేయించే బాధ్యత నాది..."అంది రాముడికి నిశ్చింత అనిపించింది.

యజమానురాలి మాటలు రాముడికి బాగా నాటుకపోయాయి. ఈ వికారాకారానికి పెళ్ళేమిటని యిదివరకెవరన్నా హేళన చేస్తారని లోపల్లోపలే బాధపడ్డాడు కాని, యింటివాళ్ళే కాకుండా యిరుగుపొరుగువాళ్లుకూడా తన పెళ్ళిని సమర్థించటంతో నిజంగా వివాహం చేసుకోవడం అవసరమే ననిపించింది

రాముడికి సంబంధాలు వెతకడం మొదలైంది. . వాడిపేర బ్యాంకులో ఐదారు వేల రూపాయలు నిలువ వున్నాయనీ, ప్లీడరుగారి కొలువు శాశ్వతమైనదనీ తెలిశాక, రాముడి ఆకారం యెవరికీ పట్టింపుగా కనపళ్ళేదు ... చాలామంది తమ పిల్లలనిస్తామని వచ్చారు ... కాని యజమానురాలికి నచ్చలేదు ... చిట్టచివరికి దగ్గరనే వున్న ఒకవూళ్ళో సంబంధాన్ని ఖాయపర్చుకున్నారు ...

పిల్ల తల్లిదండ్రులు పేదవాండ్లు... కష్టపడితేనే భుక్తి సాధించుకోగలిగే శ్రమజీవులు...పిల్ల పెద్దదే...కొంచెం చామనచాయ అనేకాని, మంచి మరుకైందీ, తెలివైందీకూడా...రాముడి పరిస్థితినీ, ఆకారాన్నీ అన్నిటినీ చూసే వాళ్లు తమ అంగీకారం తెలిపారు. పెళ్లైతే సుఖసౌఖ్యాలకు లోటుండదనుకుంది పెండ్లికూతురు ... బ్యాంకులోంచి డబ్బు తీయనక్కర్లేకుండా, అప్పుడప్పుడు చిల్లర ఖర్చులకోసం అని తీసుకుని పొదుపు చేసుకున్న రూపాయలు రెండువందల దాకా వున్నై రాముడిదగ్గర పిల్ల తల్లిదండ్రుల సంసారపరిస్థితి చూస్తే వాడికి సానుభూతి కలిగింది ... యజమానికీ, యజమానురాలికీ తెలియకుండానే, ఆ రెండొందలూ మూటగట్టుకుని వెళ్ళి, ఖర్చులకోసం వుంచుకోండని, వాళ్లు అడగకపోయినా యిచ్చివచ్చాడు రాముడు. రాముడిది చాలా ఉదారగుణం కూడానని కనిపెట్టేశారు పిల్లయింటివాళ్ళు.

పెండ్లికి బ్యాంకులోంచి డబ్బు తీయించాలనీ, తన డబ్బుతోనే పెండ్లి చేసుకోవాలనీ రాముడు యజమానురాలికి చెప్పాడు ... కాని, అతని మాటను యెవరూ వినిపించుకోలేదు ప్లీడరుగారే స్వయంగా ఖర్చుపెట్టుకుని వివాహం జరిపించారు. .పెండ్లికి, రాముడు యింటివాళ్లుకూడా వచ్చారు...పెండ్లి కూతురికి అంతోయింతో డబ్బుపెట్టి నగానాట్రా కూడా అమర్చే యేర్పాట్లు జరిగినవి. అంతా ఘనంగానే జరిగింది.. ఆ వీధి మొత్తంలోఉన్న పనిమనుషులూ,నౌకర్లం

దరికీ సుష్ఠుగా భోజనాలు దొరికినవి... అంతా రాముడి పెండ్లి బాగుందన్నారు లక్షాధికార్ల యిండ్లలో పెండ్లికన్నా యిదే మంచిగా వుందన్నారు రాముడి సంసారానికి యింటివెనక తోటలోవున్న చిన్న యిల్లును కేటాయించింది యజమానురాలు ... ఆ యింట్లో ప్రశాంతంగా, సంతృప్త హృదయంతో భార్యతోసహా ప్రవేశించి, వేరు కాపరం పెట్టేశాడు రాముడు

రాముడి పెళ్ళాంపేరు సీత దానికి పదిహేడేండ్ల వయస్సుంటుంది... దివ్యమైన ముఖవర్చస్సు...చిన్నప్పటినుంచీ కష్టపడి బ్రతుకుతున్నందువల్ల, శరీరం గట్టిపడి దృఢంగా వుంది అందులోనూ పసిమి యౌవనం దానికీ మరీ బిగువు చేకూర్చింది ... ముఖంలో, కండ్లలో అమితమైన ఆకర్షణ వుంది...సీత, తీర్చి దిద్దుకుని ముస్తాబవుతే, ధనవంతుల యిండ్లలోని అందకత్తెలతో పోటీ చేస్తుందని రాముడు అనుకుని సంతోష పడుతూండేవాడు తానెంత కురూపియైనా, తనభార్య మంచి అందెకత్తెఅనీ, అణకువగలదనీ, యిదంతా తన అదృష్టంతప్ప మరొకటి కాదనీ అనుకునేవాడు...చిన్నతనంనుంచీ యిప్పటివరకూ జీవితంలో సంభవించిన ఘటనలను నెమరువేసుకుంటూ, యిప్పుడు లంభించిన యీ అదృష్టదేవతను సంతృప్తిపరచి జీవితసౌఖ్యాన్ని శాశ్వతం చేసుకోవా



"మర్యాదగా చెపుతున్నా అనవసరంగా నా వెంటబడకు ?"

"అనవసరమని ఎవరన్నారూ ! అవసరముండే వెంటాడుతున్నా నిన్ను. నీకు నా హృదయాన్ని అర్పిస్తున్నా, స్వీకరించు."

లనుకుంటూ, ప్రతిరోజూ, దానికి అవసరమైన ముస్తాబు పరికరాలన్నీ తెచ్చి పడేస్తుండేవాడు. రోజూ అంతోయింతో మధుర పదార్థాలు, చిరుతిండీ, కూడా అమరుస్తుండేవాడు

రాముడికి సీతప్రాణం ... సీతకు రాముడు దైవం...రెండు నెలలకో ఖరీదైన చీరా, జాకెట్టూ, దానికి ఉపాయనం... అది కట్టుకుని నీటుగా ముస్తాబయితే, తనకండ్లతోచూసి, కౌగలించుకుని ముద్దాడటం రాముడికి అలవాటు ...... రాముడికి తనమీదున్న ప్రేమకు సీత విస్తుపోతుండేది రాణివాసస్త్రీవలె తనకన్నీ అమరుస్తున్న రాముడినిచూసి కృతజ్ఞతాభావం పెల్లుబికేది ... రాముడి సంసారం పచ్చపచ్చగా సాగిపోతుంది— రోజులు గడుస్తున్నాయి. గడిచినకొద్దీ

రాముడికి సీతమీద వ్యామోహం అధిక మవుతోంది .. ఆమె సౌందర్యాన్ని అనుభవించడంకన్నా, యిదంతా నాదే గదా అని సంతృప్తిపడే మనస్తత్వం రాముడికి అధికమైంది.

కురూపితో సంసారం గడుపుతూన్న సురూపలావణ్యవతిని చుట్టుపట్ల కుర్రాళ్ళంతా తృషిత నేత్రాలతో చూస్తున్నారు సీత తోటలోంచి బజారుకు యెప్పుడోగాని కనిపించదు రాముడు తోటలో లేనప్పుడల్లా, చుట్టుప్రక్కల యిండ్లలోని పడుచుకుర్రాళ్లు పనిలేని పని కల్పించుకొని, తోటలోకివచ్చి బాతాఖానీలు వేస్తూ సీతను ఊరించాలని తంటాలుపడేవాళ్లు యీ వరస కొత్తలో సీతకు కొద్దిగా కలవరం కలిగించింది కాని, రానురాను అలవాటై, తన అందాన్ని పొగిడే వాళ్లంటే ఆసక్తి అధికమైంది .అంతే కాని వాళ్లతో చెడుసావాసాలకు మాత్రం దిగలేదు .వాళ్లు తనను పొగడుతూంటే వినాలన్న కౌతుకం జాస్తి అయింది

అందరికన్నా ఎక్కువగా పక్కింటి వాళ్ళ తోటమాలి అప్పన్న, సమయం దొరికినప్పుడల్లా, గోడమీంచిదూకి, సీత యింటికివచ్చి, ఆమె అందాన్ని అతి చమత్కారంగా అతిశయోక్తులతో పొగడిపోయేవాడు

అప్పన్న పాతికేండ్ల పడుచువాడు కండలుతీరిన బలిష్ఠమైన శరీరం...పెళ్ళి కాలేదు ..పక్కింటి తోటలో సీత కాపురంపెట్టిన దగ్గరనుంచీ వాడిలో యేవో వికారాలు చెప్పలేనివి ఉప్పతిల్లినవి రాముడు, అప్పన్న ప్రాణస్నేహితులు. కాని సీతను పెండ్లిచేసుకున్నాక, రాముడంటే వాడికి తగని యీర్ష్యగా వుంటున్నది సీత మీద అంతరాంతరాలలో తగని సానుభూతి యేర్పడ్డది సీతతో మాట్లాడే అర్హత కూడా రాముడికి లేదని నిర్ణయించేశాడు అప్పన్న కుంటి, గూని, మరుగుజ్జు వాడికి యింత అందమైన పెళ్ళామా? అని తర్కించుకున్నకొద్దీ అప్పన్న యీర్ష్య ప్రజ్వలిస్తున్నదేకాని తగ్గటం లేదు "సీత వీడితో నిజంగా, సంతోషంగా సంసారం యెలా చేయగలుగుతూంది అబద్ధం దానికి వీడంటే ప్రేమ వుండదు," అనుకునేవాడు రోజుకోసారి సీతను చూడందే అప్పన్న ప్రాణం నిలవకపోయేది . రాముడున్నప్పుడు వస్తే, అవీ యివీ మాట్లాడి వెళ్ళిపోయేవాడు రాముడు లేని సమయాల్లో వస్తే అచ్చంగా సీత అందాన్ని ఆకాశానికెత్తేస్తూ, దాన్ని నమిలి మింగేసేట్టు చూసేవాడు .ఇలా నాలుగైదుమాసాలు జరిగినవి

అప్పన్న ప్రవర్తన సీతకు ప్రథమంలో కొద్దిగా భయం అనిపించింది కాని, రానురాను పరిచయం అయింది. తన అందాన్ని ఎలా మెచ్చుకోవాలో

అప్పన్నకు తెలిసినంతబాగా రాముడికి తెలియదన్న అభిప్రాయం దానికి కలిగింది సీత కొద్దిగా మెత్తపడుతున్నదని తెలిసినకొద్దీ అప్పన్న పొగడ్త మరీ అధికం అవుతూ, రాముడి కురూపాన్నీ, వికారాన్నీ అసహ్యంగా వర్ణించడం ప్రారంభమయేది రాముడి వికారాకారాన్ని గురించి ప్రస్తావిస్తున్నప్పుడల్లా, కండలు తేలిన తన శరీరాన్ని గర్వంతో చూసుకుంటూ మాట్లాడేవాడు అప్పన్న

'రాముడు, సీతకు తగిన భర్త కాడు' అని సీత అనుక్షణం అనుకునే విధంగా అప్పన్న ప్రవర్తించటం ప్రారంభించాడు అప్పన్నచేయి, మంచినీళ్ళం దించినప్పుడు తనకు తగులుతూవుంటే సీత శరీరం జలదరించేది అప్పన్న రానిరోజున సీతకు చీకటి పడ్డట్టుగా వుండేది

సీత సత్యకాలం మనిషి అని రాముడి విశ్వాసం అమాయకపు పిల్ల అనుకుంటాడు పొద్దస్తమానం యజమాని గృహకృత్యాలలో సతమతం కావటంలో వాడికివున్న ఆనందం చూస్తుంటే సీతకు చిరాకు అధికమైపోతూ, అప్పన్నవస్తే బాగుండు ననుకొనేది అప్పన్నతో పొద్దల్లా గడాపాలనిపించేది

"సీత సత్తెకాలప్పిల్ల కాకపోతే తన వంటి కురూపిని యెందుకు పెళ్ళాడుతుంది ? సీతకు తను తగినవాడు కాదేమో. " నని బాధపడే రాముడు సీతను అనుమానించడానికే ఆస్కారం లెకపోయింది ఎప్పుడూ తను అందవికారిని అనుకోవటమేగాని, సీతను గురించిన ఉద్దేశ్యం అతనికి లేనేలేదు

రాముడంటే సీతకు అభిమానం లేకపోలేదు కాని, అప్పన్నలోవున్న ఆకర్షణ, అప్పన్న ముట్టుకున్నప్పుడు కలిగేలాంటి హాయి రాముడిద్వారా లభించవు దీనికి కారణం దానికి అర్థం కాదు ఈ ఆకర్షణ అప్పన్ననూ, సీతనూ వాస్తవికత అడుగుమెట్టుకు లాగింది అనాయిచితంగా,సునాయాసంగా అప్పన్న సీతను తప్పుదారికి లాగేశాడు .యీ తెరచాటు రంగస్థలం గురించి రాముడికి తెలియనే తెలియదు యజమానురాలికి అసలె తెలియదు

ఎలాగైనా సితను నమ్మించి, రాముడి దగ్గరనుంచి లేపేస్తే స్వేచ్ఛగా ప్రణయం సాగించుకోవచ్చని అప్పన్నఊహ యిది సీతవిని, భయపడ్డది

"యిప్పుడేం తక్కువైంది? "అన్నది

"వాడూ వీడూ చూస్తాడనే భయంతో వుండి సుఖం అనుభవించలేము సీతా, మనం యిక్కణ్ణించి లేచి, కంటిక్కనిపించకుండా మరోపట్నానికి పారిపోదాం నే నక్కడ మంచి నౌకరీ చూసుకుని, రాముడికన్నా నిన్ను సుఖపెడతాను "అన్నాడు అప్పన్న ఎన్నో బులిపింత కబుర్లు చెప్పాడు

ఒకనాడు సినిమా కెళతానని బయలు దేరింది సీత . రామ్ముణ్ణి రమ్మంది వాడు రాడని దానికి తెలుసు తెలిసి కూడా మరీ బలవంతపెట్టింది దానికి నచ్చజెప్పి ఒక్కదాన్నీ సినిమాకు ంపించేవరకు రాముడికి తలప్రాణం తోకకు వచ్చింది అప్పన్న సినిమా హాలుదగ్గరే ప్రత్యక్షం అయినాడు నగలతో అందంగా ముస్తాబైన సీతను ఆనందంగా చూశాడు యిద్దరూ తృప్తిగా సినిమా చూశారు అనుకున్న ప్రకారం అంతర్థానం అయినారు

సినిమావదలి గంట అయింది సీత యింటికి రాలేదు తోటలో సీత కోసం యెదురుచూస్తున్న రాముడు తొందరపడుతున్నాడు 'సిత ఒంటిరిగా యెన్నడూ యింత సేపు వీధిలో వుండదే' అనుకున్నాడు మరికాస్సేపు చూశాడు పదిన్నర దాటవస్తోంది యేమీ అర్ధంకాక సీతను వెతకటానికి సినిమాహాలువైపు వెళ్ళాడు ఒక ఆట చూసి తృప్తితీరక, మరో ఆటచూస్తున్న దేమోనని రెండోఆట ఆఖరైందాకా నిల బడ్డాడు అదీ అయింది సీతమాత్రం లేదు మానవారణ్యంలాంటి పట్నంలో వున్న సినిమా హాళ్ళన్నింటినీ చూశాడు త్రోవలో యెక్కడన్నా యెదురవుతుం దేమోననుకున్నాడు బహుశా యీపా టికి ఇంటికి చేరిందేమో ననుకొని, ఒక సారి యింటికివచ్చి చూసుకున్నాడు



"రెండో ఏట మూడో అంతస్తు కిటికీలోనుంచి పడ్డాను."

"ఆశ్చర్యంగా ఉందే! అంత ఎత్తునుంచిపడి ఎలా బ్రతికావ్?"

'అదృష్టవశాత్తు బయటకు పడలేదు, లోపల పడ్డాను"

అంతటా నిరాశే సీతలేదు రాముడికి దుఃఖం పొంగుకొచ్చింది తెల్లవారు జాముదాకా వెదికి చూశాడు యింటికి వచ్చి తనలో తనే కుళ్ళిపోయాడు సీత కేదో అపాయం జరిగి వుంటుందని అతని ఊహ

పొద్దున్నే ఎక్కింట్లో వూడ్చిచల్లే 'సావిత్రి' ని అడిగాడు సావిత్రి చెప్పింది తనుకూడా సినిమాకు వెళ్ళా ననీ, సినిమా అయింతరవాత, అప్పన్న సీత, ఒకే రిక్షాలోయెక్కి బయలుదేరటం తను కండ్లారా చూశాననీ చెప్పింది

"అప్పన్న యింటిదగ్గరున్నాదేమో?" అన్నాడు రాముడు

"యేమో యెల్లి కనుక్కుంటే తెలుస్తది నీవు ఇంటో లేనప్పుడు అప్పన్న రోజూ మీ యింటికొచ్చి దాంతో యేమేమో మాట్టాట్టం నే నెన్నో

సార్లు చూశాను మావా! నీవే కనిపెట్ట లేకపోయావ్" అంది సావిత్రి...

అప్పన్నను గురించి వాకబు చేశాడు రాముడు రాత్రినుంచీ యింటికి రాలేదని తెలిసింది. సావిత్రి సమాచారం యదార్ధమేనని తేలింది ఆసాయంత్రం దాకా చూశాడు సీత రాలేదు అప్పన్న కనపళ్లేదు యిద్దరూ యెటో ఉడాయించారని పూర్తిగా రూఢి అయింది రాముడికి కోపం పెట్లిపోయి, చేసేదిలేక కన్నీళ్లు వచ్చినై

సావిత్రి అన్నట్టు తనే కనిపెట్టలేక పోయాడు ఎట్లా కనిపెట్టటం ? అప్పన్నకూ తనకూ వున్న స్నేహం సీతకన్నా ముందుదాయిరి. అందు లోనూ మొదటినుంచీ తన చెల్లెల్ని కట్ట బెట్టాలనే ఉద్దేశ్యంతో 'బావా!' అని పిలుస్తూండేవాడు అప్పన్న పెండ్లి సంబంధాలకోసం తిరిగేటప్పుడు తన చెల్లెల్ని చేసుకోమని చెప్పాడు కాని, యజమానురాలి హెచ్చరికతో అంగీ కారం యివ్వలేదు వాళ్ల కుటుంబం మంచి ప్రవర్తనగలది కాదన్నది యజమానురాలు యిందుకేనేమో

ఛ! దుర్మార్గుడు చెల్లెలినిచ్చి పెండ్లి చేస్తానన్న అప్పన్నే యివాళ, ఆస్థానంలో వున్న తన పెళ్లాన్ని లేవదీసుక పోయాడు కలియుగంలో కాలం ! అనుకున్నాడు రాముడు .ప్రపంచం, అందునా యీ కాలం చిత్రమైందనిపిం చింది వాడికి స్నేహితుడి కొంపను చెట్టుబొగ్గులు చేయటానికి సిద్ధపడేవాళ్లు యీ రోజుల్లోకూడా యింకా వున్నందుకు రాముడికి 'పాపం' అనిపించింది

"సీత పొరపాటేమీ వుండదు అది సత్తెకాలపు మనిషి. దాన్ని మాయచేసి బుట్టలో వేసుకున్నాడు వాడు రమ్మన్న చోటికి అది పోయింది దాని తప్పే ముంది ?" అనుకున్నాడు రాముడు

రాముడి భార్యావియోగం యజమాను రాలికి తెలిసింది దాచుకోకుండా అన్నీ పూసగుచ్చినట్లు చెప్పుకొని, బావురుమని యేడ్చాడు రాముడు ఆమెకూడా కళ్లనీళ్ల పర్యంతం అయింది

"పోనీలె రామూ! దాని సుఖపు కూట్లో దుమ్ముచల్లుకొని అదే పోయింది దాని కర్మ అనుభవిస్తుంది . నీకేం తక్కువని. మరో మంచి పిల్లనుచూసి పెళ్ళిచేసుకోవచ్చులే మధనపడి చేసే దేమీ లేదు" అంది ఓదారుస్తూ రాముడికిది నచ్చలేదు .

"సీతకు నేనంటే యెక్కడలేని ప్రేమ వుందండమ్మగారూ! నేను లేక పోతే అది బతకదు. అది వాడి మాయలోపడి దారితప్పిపోయింది అది పోయింతరవాత నా మనసుతిరిగి పోయింది అన్నం సయించడంలేదు ఇంకొకదాన్ని పెళ్ళిచెసుకుని నేను బతక లేను ." అని హృదయ విదారకంగా యేడ్చాడు రాముడు, వాడికి సీతమీద

వున్న మమకారం చూసి కించపడ్డది యజమానురాలు రాముడిప్రాణం సీతలో వుందనుకుంది

"ఇక చేయాల్సిందేముందిమరి? అన్నంతిను యేదెట్టావున్నా బతకడం ముఖ్యంగదా!" అంది ఆమె

"అది నన్ను వెతుక్కుంటూ మళ్ళీ వస్తుందని నా నమ్మకం అది నిజంగా సత్తెకాలంమనిషి అప్పన్నగాడు దాన్ని మోసంచేసి విషం పోశాడు దానంతట అది చచ్చినా యిల్లు కదలదు పీతైనంత వరకు దానిజాడ పసిగడతాను" అన్నాడు రాముడు రాముడి నిశ్చితాభిప్రాయం విని అమ్మగారి సందేహం తొలిగి పోయింది. ఒకడితో లేచిపోయిన పెళ్ళాంకోసం వెతుకులాడే మగవాళ్లింకా యీ రోజుల్లో వున్నందుకు ఆశ్చర్యపడ్డది

"సరే! నీయిష్టం రామూ! తొందర పడక్కర్లేదు సంసారాలు అన్న తర వాత యిటువంటివి సర్వ సాధారణంగా జరుగుతునే వుంటవి" అని రాముడి మనసు గాయం కాకుండా బలపరిచింది యజమానురాలు

నెల పదిహేను రోజులు గడిచినవి యజమానిగారి పెద్దబ్బాయి మదరాసులో చదువుకుంటూ సెలవుల్లో యింటికి వచ్చాడు. రాగానే అతనికి సీత లేచి పోయిందన్న సంగతి తెలిసింది పట్నంనుంచి తను వస్తుంటే రైల్లో సీత



"ఏరా, సంశా వాళ్ళ నాన్నతో చెప్పలేదటరా మీ అమ్మాయి ఏంచెయ్యమంటే అది చేస్తానని"

"చెప్పాను, కాని ఆయన, 'మా అమ్మాయిని ఏలుకునే వాడు కాని మాక్కావలసినది, నవుకరు కా' దన్నారు"

కలిసింది పట్నం చూసివస్తున్నానని చెప్పింది మధ్యలో యెక్కడదిగి పోయిందోమరి అబద్ధం చెప్పింది సీత అనుకున్నాడు పెద్దబ్బాయి

"రాముడూ! నీ సీత యెక్కడి కెళ్ళింది" అన్నాడు. "అదే తెలియటం లేదండి యెక్కడన్నా వుందని తెలిస్తే తెచ్చి యింటోపడేసేవాణ్ణే అన్నివూళ్లూ వెతికించాను యేదో దానిబుద్ధి ఆ నిమిషంలో అట్టామారింది కాని, అది నిజంగా మంచిమనసుగల పిల్లండీ!" అన్నాడు రాముడు

"నేను పట్నంనించి వస్తుంటే సీత కూడా అదేరైల్లో కలిసింది యెక్కడికి వచ్చావని అడిగాను. పట్నంచూద్దామని వచ్చానంది ఇంటికిపోతే యిప్పట్లో మళ్ళీ పుట్టింటికి రావటం పడదనీ.

పుట్టింటికి వెళ్ళి నాలుగురోజు లుండి వస్తా నని చెప్పింది " అన్నాడు పెద్దబ్బాయి రాముడి ప్రాణం లేచివచ్చినట్టయింది సీత బతికివున్నట్టు తెలుసుకొన్నాక వాడి ప్రాణం అలసటతీరింది .. ఆ రాత్రి సుఖంగా నిద్రపట్టింది

రాముడు పొద్దున్నే సీత పుట్టింటికి ప్రయాణం కట్టాడు అనుకున్నట్టుగా అక్కడేవుంది సీత అందరికన్నా ముందు అదే కనపడి, రాముడిని చూట్టం తోటే తలవంచుకుని లోపలికి వెళ్ళి పోయింది ..దానిముఖంలో వెనకవున్న కళలేదు ముఖంఅంతా పీక్కుపోయింది మెళ్ళో బంగారం గొలుసులేదు కట్టు కున్న చీరె చిరుగులతో మురికి తోలుగా వుంది . అట్టా చూట్టంతోనే అన్నీ ఆకళింపు చేసుకున్నాడు రాముడు .

రాముడి అత్తమామలు వాణ్ణిచూసి కావిలించుకుని భోరుమని యేడ్చారు రాముడిమామ ముఖంమీద కండువా వేసుకుని యేడ్చాడు వాళ్ళు యేడు స్తుంటే రాముడికూడా తెలియకుండానే యేడుపువచ్చి వాడూ యేడ్చాడు అంతా కలిసి అరగంటదాకా యేడ్చారు

"అదిచేసిన పని అంతా చెప్పింది నాయనా ! మేము తలెత్తుకుని తిరగలేక పోతున్నాం "అన్నాడు రాముడిమామ జానయ్య

"దుర్మార్గురాలు, మా పరువుతీసింది నీ పరువుకూడా తీసింది ." అంది రాముడి అత్త

రాముడి గుండెలో జాలి, దయ దుఃఖం ఒక్కసారే పొర్లుకొని వచ్చినవి "దాని తప్పులేదు మామా ' వాడి మాయ వేషాలకు లొంగిపోయింది . వాణ్ణి యింట్లో తిరగనీయటం నాదే తప్పు. దాన్నేమీ అనొద్దు" అన్నాడు రాముడి అత్తమామలు నిలువునా ఆశ్చర్య సంతో షాల్లో మునిగిపోయారు

"నీవు అందవికారివని అంటారు కాని, నీ మనస్సెటువంటిదో యెవరికీ తెలియదునాయనా ! కన్నూమిన్నూ కాన లేని మదంపట్టినవాళ్ళు కళ్ళకొట్టే అందమే చూస్తారుకాని మనసును నిదానంగా చూడరు నీవు నమ్ముతావో నమ్మవో కాని, యిది నాకూతురు అని చెప్పుకోవ టానికి సిగ్గుపడి చస్తున్నాము "అన్నాడు మామ

"దాన్నిచ్చి నీ పరువు తీసినందుకు బదులుగా, మా రెండోపిల్లనిచ్చి పెళ్ళి చేస్తాం నీకు భయం అక్కర్లేదు నాయనా ! " అంది అత్త..

"యెందుకత్తా రెండోపిల్ల ' యిదే నాక్కావాలి దానితప్పు లేదన్నానుగా, అది లోకం తెలియని పసికుంక మహా మహా పెద్దపెద్దవాళ్ళే కాళ్ళుజారి సర్దుకుంటూన్నప్పుడు మనం సర్దుకోలేక పోవటమేమిటి, ? సీతను పంపిస్తే యిప్పుడే తీసుకపోతాను'' అన్నాడు

రాముడు .. "రాముడికి రెండోపెళ్ళి యేమిటత్తా?,' అనికూడా మందలించాడు

రాముడేమన్నా చేస్తాడేమోనని అతన్ని చూసి భయపడుతూ లోపల్లో పలేవుండిపోయిన సీతకు రాముడి మాటలువిని చచ్చిపోవాలనిపించింది కిర్సనాయిలు పోసుకుని నిప్పంటించుకు చావాలనిపించింది ఇంతమంచివాడిని వదిలి, ఆ దుర్మార్గుడితో తనెట్టా లేచిపోయానా, అనుకుంది ఊరికే కంటికి కడివెడుగా యేడుస్తూ వెనకసందులో నిల్చుంది

సీత యెంతకూ రాకపోయేటప్పటికి రాముడే స్వయంగా లోపలికి వెళ్ళాడు సీత వున్నపళంగావచ్చి రాముడి రెండు కాళ్ళమీదాపడి, తలబాదుకుని యేడ్చింది– "నన్ను చంపు నేను బతకలేను" అంది పదిసార్లు రాముడిగుండె కన్నీటి చెరువైంది ఇద్దరూ అట్టా యెంతసేపు యేడ్చారో తెలియదు యింటివాళ్ళంతా బయటికి వచ్చేశారు యిద్దర్నీ సందులోవదిలి

రాముడు సీతను లేవనెత్తుతూ, "జరిగిందేదో జరిగిపోయింది సీతా' యేడవబోకు నేను నిన్ను తప్పుపట్టటం లేదుగా" అన్నాడు

"నన్ను కాపాడాలి పెద్ద తప్పు చేశాను నీవు అనకపోయినా తప్పు తప్పే మాయకబుర్లుచెప్పి మోసం చేశాడు దగాముండాకొడుకు నా కటువంటి బుద్ధిలేదు వాడే నా బుద్ధి చెడగొట్టాడు నేను కాలుజారి చెడిపోయాను" అంది సీత

"మరి నీ విట్లా అయిపోయినావేం సీతా' నీ మొఖం అంతా డోక్కుని పోయింది నీ నగలన్నీ యేవి? వాడిప్పుడెక్కడున్నాడు? నీ విక్కడి కెట్టా చేరావ్?" అంటూ సీత చెంపలు నిమురుతూ ప్రశ్నలమీద ప్రశ్నలు వేశాడు రాముడు

సీత యావత్ వృత్తాంతం చెప్పింది

"మాయచచ్చినముండాకొడుకు మనిద్దర్నీ చూసి కన్నెర్రపడ్డాడు...నన్ను మోసం చేసిందగ్గరనుంచీ యెటన్నా యెల్లిపోదామని రోజూ కబుర్లే యెల్లిపోకుండా యింకో వుపాయం లేదా అని నేనడిగితే, ఒక మందుసీసా చిన్నది తెచ్చి, దీంట్లోది పదిచుక్కలు గనక అన్నంలో యేసిపెడితే,మనిషి మంచంలో తీసుకొని నెలరోజులకు చచ్చిపోతాడనీ, నీకీ మందు వెయ్యమనీ చెప్పాడు.. నాకు చెడ్డబయమేసింది దీనికన్నా యెల్లిపోవటమే మంచిదనుకున్నా.. ఒక నాటికి వాడి పీడ వదిలేట్టులేదు ఇక్కడినుంచి యెకాయెకిన పట్నం యెల్లాం ఐదారోజులు బజార్లలో తిరిగాం జల్సాగా. పని దొరికిందాకా యిక్కడే వుండాలని ఒక చెట్టుకింద సంసారం పెట్టించాడు . పని దొరికిందాకా పొట్ట

గడవాలిగదా అని నా మెళ్ళో నగలు తీసుకున్నాడు తరవాత్తరవాత తాగటం మొదలుపెట్టాడు . నగలేవని అడిగితే అమ్మేశాననీ, మళ్ళీ అడిగితే చెర్లోతోసి పారిపోతాననీ యిష్టంవచ్చినట్టు తన్నాడు నాకు ఓపిక చచ్చింది... నా మొల్లోని ఆ మందుసీసా గుర్తుకు వచ్చింది ఒకనాడు చిన్నగాతీసి అన్నంలో పది చుక్కలు కలిపిపెట్టాను తిన్న మర్నాటి నుంచే వాంతులు మొదలైనై కదల కుండా పడిపోయాడు అట్టా మూడు రోజులు చూసి, యిక లేవలేడులే అను కొని, చెప్పకుండానే వాణ్ణి వదిలి, దొంగ తనంగా రైలెక్కి పడరాని పాట్లన్నీపడి మొన్నరేత్తిరే యిక్కడికి చేరా యిదీ నంగతి'' అంది

రాముడి మనస్సు బాధతో కరిగి పోయింది "అంత కష్టం యేమొచ్చింది సీతా ! బాగాలేదనుకున్నప్పుడు రాలేక పోయావా ?" అన్నాడు

"డబ్బులేవీ ' నా నగలియ్యమంటే తన్నేశాడు అందుక్కాదూ వఖ్ఖమండి మందుపెట్టింది ? మాయముండాకొడు కింక బతకడులే "

రాముడి గుండెలు కోసుకపోయినై "పాపంకాదూ సీతా ! వాడి పాపాన వాడే పోయేవాడుగద ' మళ్ళీ యీ పాపం కూడా మనకెందుకూ ' పోలీసోళ్ళు పసిగడితే యేంకాను ?" అన్నాడు రాముడు

"నీవు లేవూ ?" అంది సీత "అయినా యీ బాధంతా నీకెందుకులే నేనూ అట్టాగే చద్దామని యింకాస్త మందు మిగిల్చాను దాన్నిప్పుడే తాగే స్తాను నీదోవన నీవెల్లిపో" అంది సీత

రాముడు సీతను గట్టిగా కావిలించు కున్నాడు "అఘాయిత్యం చేసికోవలసి నంత తప్పు నీవు చేయలేదుసీతా ! నీకసి తీర్చుకున్నావు ఓ ఏమన్నా అయేనాటికి మన ప్లీడరుగారున్నాడులే నీవు మోసానికీ, అన్యాయానికీ లొంగి పోయినావేకాని, మనస్ఫూర్తిగా యిది చేయలేదని నా విశ్వాసం సీతకు పరీక్ష అక్కర్లేదు . చావాల్సిన పనిలేదు సీత యింకా రాముడి పెళ్ళామే . సీతచస్తే రాముడెట్టా బతుకుతాడే మన యిద్దరిదీ భగవంతుడు కలిపిన సావాసం "అంటూ గుండెలకు అదుముకున్నాడు సీతకు స్వర్గం కళ్ళ బడింది జరిగిందంతా మిధ్య, అనిపించింది

ఆ సాయంత్రమే సీతను తీసుకొని యింటికి బయల్దేరాడు . దానికన్నీళ్ళే దాని పరిశుద్ధ హృదయానికి సాక్ష్యం అనుకున్నాడు రాముడి మంచితనానికి వాడిమనస్సే నిదర్శనం అనుకుంది సీత ఇద్దరూ కలిసి బ్రతకాలనుకుంటే ఒకడు చెప్పేదేముందన్నారు వాడకట్టువాళ్లు ఇంటి యజమానురాలుకూడా సంతో

షమే కనపరచింది సీత లేచిపోయిం దన్నదంతా పాతకథ అయింది

"రాముడూ ! యిక దీన్ని యింట్లో కూర్చోపెట్టి మేపకు తిని సుఖంగా కూర్చుంటుంటే విపరీతపు బుద్ధులు పుడ తాయి... మనస్సూ, శరీరం మాటవినవు దాన్ని నాకు అప్పజెప్పు అయ్యగారి దగ్గర నీవెట్టా వుంటావో అదీ నాదగ్గర అలాగేవుండి, యింత, పనీపాటలో సహాయపడుతుంది . నౌకరీ అన్న ఉద్దేశ్యంతో నేను చెప్పటంలేదు . యేదో ఒక పనిచేస్తూంటే దాని బుర్ర సరిగావుండి నలుగురిలో తలెత్తుక తిరగ గలుగుతుంది . ఒంటరిగా వుంటే తక్కువై పోయాననుకుంటుంది .. ఎందుకైనా మంచిది .. దాన్ని పనిలో ప్రవేశపెట్టు" అంది

యజమానురాలు దూరదృష్టి కలదని రాముడి గట్టినమ్మకం సీతను అమ్మ గారికి చెలికత్తెగా వుంచాడు నెలకు మరో పదిహేను రూపాయలు అదనంగా రావటమేగాక, అడ్డమైనవాడల్లా వచ్చి బాతాఖానీ వేసే సమయం లేకుండా పోయింది. సీత మంచిగా చెప్పినపనల్లా చేసుకపోతున్నది . యింటివెనక తోటలో సంసారం, యింటిప్రక్క సావిట్లోకి చేరింది

నాలుగేండ్లు గడిచినై సీతకు బంగా రం లాంటి పిల్లలు యిద్దరు పుట్టారు "నీ పిల్లల్ని మాకివ్వరాదు రామూ !" అని యజమానురాలంటే "మేమంతా మీ పిల్లలమే గదమ్మా !" అనేవాడు రాముడు

ఇన్నేండ్లు గడిచి ఇద్దరుపిల్లల తల్లి అయినా యిప్పటికీ రాముణ్ణి ధైర్యంగా చూపులో చూపుకలిపి చూడదు సీత... "అలా కండ్లు వాల్చుకుంటావేం ?" అంటాడు రాముడు. కండ్లు పైకెత్త కుండానే కాపరం చేస్తున్నది సీత... దాని బ్రతుకు 'పరీక్ష' కానందుకు సంతోషపడుతుంటుంది



ఇంత పెద్ద మహానగరంలో బావ ఎలా కనిపిస్తాడు? ఎలా వెతికేదీ? ..

స్టేషన్‌కు రమ్మని వుత్తరం రాశా నన్నారు నాన్నగారు ఆ వుత్తరం బావకి అందిందో లేదోమరి !

పాపం, బావ స్టేషన్‌కి వచ్చి, మమ్మల్ని పోల్చుకోలేక పోయాడో ఏమో! . ఎందుకు పోల్చుకోలేడూ? . నాన్నగారు వుత్తరంలో రాశారుకూడా — నాకు ఇరవైయ్యేళ్ళనీ, అమ్మమ్మకి యాభైరెండు అని—అందుకనే స్టేషన్‌లో అమ్మమ్మ చెయ్యి వదలకుండా కూడా నించున్నాను—

కాస్త సూటూ బూటూ వేసుకున్న కుర్రాళ్లందరివైపూ ధైర్యంచేసి చూశాను కూడా — ఏం లాభం? బావ ఎలా వుంటాడో నాకు తెలీదు నేను ఎలా వుంటానో బావకి తెలీదు —

ఇలా జరుగుతుందని నేను ముందే అనుకున్నాను — అందుకనే స్టేషన్‌నుండి బావవుండే రూమ్‌కి వెళ్ళవలసిన గుర్తు లన్నీ అడిగి తెలుసుకొని రాసుకున్నాను— కానీ, ఇంత జనంలో, ఇన్ని కార్ల మధ్య ఇంతమంది మగాళ్ళ మధ్య బిక్కుబిక్కున నడుస్తూ — ఏ మగాడిని పిలిచి ఆ గుర్తులు చెప్పి అడిగేదీ? పైగా, దారినిపోయే పద్నాలుగేళ్ళ పిల్లాడు మొదలుకొని అరవయ్యేళ్ళ తాతయ్యవరకూ అందరూ గుచ్చిగుచ్చి చూసేవాళ్ళే!

పోనీ, రిక్షా పిలిచి మాట్లాడుద్దా మంటే — ఏమో వాడు ఎక్కడకు తీసుకు పోతాడోమరి ?...

అమ్మమ్మని వెంటబెట్టుకొని, లేచి ధైర్యం తెచ్చుకుంటూ .నడుస్తున్నాను

నేనే అంటే — నా కంటే కొత్త మా అమ్మమ్మకి — ఎక్కడో కారు హారన్ కొడితే ఇక్కడ కంగారయి పోయి; నా చెయ్యి పుచ్చుకు వెనక్కు లాగే స్తుంది నడుస్తున్నకొద్దీ రోడ్డు పెరుగు తోంది నాన్న చెప్పిన కొండగుర్తు — ఓ సినిమాహాలు పేరు ఆ సినిమాహాలు కనిపించలేదు

ఇక లాభంలేదు — మనం దారి తప్పేము—కాబట్టి రిక్షా పిలవ్వాల్సిందేనని నిశ్చయించుకున్నాను — పిలిచేను సినిమాహాలు పేరు, బావ అద్దెకుంటున్న మేడ పేరూ చెప్పేను రిక్షావాలా ముసలాడు మాటల్నిబట్టి మంచివాడి లాగనే కనిపించేడు

'ఇంతదూరం నడిచాకా రిక్షాఎందుకే?' అంటూ మూలిగింది అమ్మమ్మ —

'నా మొహం .ఇద్దరం దారి తప్పేం!' అని చెవిలో చెప్పేను —

'ఇద్దరం అంటావేం ? చదువుకొన్న దానివికదా, ఆ మాత్రం ఇల్లు కనుక్కో లేకపోతే, ఎందుకే నీ చదువు ? నేనె

ప్పుడో పది హే నేళ్ళప్పుడు చూశా నీ వూరు అప్పుడు ఇన్ని మేడ లెక్కడివి.. ఇంత మంది జనం ఎక్కడ . ' అంది —

ఈ మాట అక్కడ నాన్నతో చెప్పకపోయిందామరి ? ... అప్పుడేమో నాకు అన్నీ తెలుసు ? ఒక్కసారిచూస్తే మర్చిపోను అన్నది

సరే, రిక్షావాడు తిన్నగా తీసుకువచ్చి నాన్న చెప్పిన మేడ దగ్గర నించో బెట్టేడు వాడికి డబ్బులు యిచ్చి మేడ మీదికి బయలుదేరాము —

మేడమీద అన్నీ వరస రూమ్‌లు బావవుండే రూమ్ నంబర్ తొమ్మిది ఆ మేడమీదవున్న వాళ్ళంతా కుర్రాళ్ళే అనుకుంటాను —

హిందీ సినిమా పాటలు, ఆటలు, కబుర్లు గోల ' నాకు నిప్పుల మీద నడిచినట్టనిపించింది — అయినా తప్ప దుగా, తలెత్తి రూమ్ నంబర్లు చూస్తూనే వున్నాను —

తొమ్మిదో నంబర్ రూమ్ తలుపు మూసేసివుంది

'అమ్మమ్మా ' బావగది యిదే '' అని అమ్మమ్మకి మాత్రమే వినిపించేలాగ చెప్పాను —

'ఇంకేం — నేను వాణ్ని పోల్చుకో గలను పదేళ్ళప్పుడు చూసినా ఐదేళ్ళ ప్పుడుచూసినా నాకుగుర్తే ' ' అంటూ అమ్మమ్మ తలుపు దబదబా బాదింది —

కొంచెంసేపట్లోనే ఓ అబ్బాయి తలుపుతీసి, నిర్ఘాంతబోయి — 'ఎవరూ ?' అన్నాడు —

'నేనురా .. మీ అమ్మమ్మని ' ... హోరి భడవా నిన్ను చిన్నప్పుడు ఎత్తుకొని ఆడించేనురా .' అంటూ అమ్మమ్మ అతగాణ్ని తోసుకుంటూ లోపలికి వెళ్ళిపోయింది —

ఆ అబ్బాయి నన్నుచూసి తన పైమీది తువాలు సరిచేసుకుంటూ 'రండి' అంటూ పక్కకుజరిగేడు — చేతిలో సంచీ అందుకున్నాడు —

'ఎంతమారిపోయావ్‌రా ! .. చిన్న ప్పుడు నల్లగా వుండేవాడివి ! ఇప్పుడు తెల్లగా ఐపోయావు అప్పుడు దుండు ముక్కలాగా వుండేవాడివి ' . ఎంత సన్నంగా అయిపోయావు ? . ఔన్లే, ఈ రోజుల్లో సన్నంగా వుండడం పేషనుగా ' . ' అంటూ అమ్మమ్మ బావకి 'ఉఁ' అనడానికి కూడా అవకాశం యివ్వలేదు —

మంచంమీదవున్న చిత్తుకాయితాలూ, పుస్తకాలూ అన్నీ గుచ్చెత్తి పక్కన పడేసి 'రండి కూర్చోండి '' అన్నాడు బావ, నించున్న నన్నుచూసి

'అండీ ఏమిట్రా మరీ బడాయి ! అది నీ మేనత్త కూతురు సరళ అయి తేనూ ' అంటూ కూర్చున్నదల్లా లేచి నించుంది అమ్మమ్మ

'అలాగా ... క్షమించండి!' అన్నట్టు మొహం పెట్టేడు బావ —

అంతలో 'ఔనూ ... నువ్వు స్టేషనుకు రాకుండా ... యిక్కడ సింగారం చేసుకుంటూ వుండిపోయావుకదా మేం ఎలా వస్తాం అనుకున్నావురా అబ్బీ?. నేను ముసిలిముండనీ ... అది ఆడకూతురు...యింత పెద్ద పట్నంలో...ఎవడి బుద్ధులెలా వుంటాయో ... రోజులిలా వున్నాయికదా... ఇదేమన్నా ఆలోచించావానువ్వు?...' అంటూ నిలదీసిమరీ అడిగింది అమ్మమ్మ—

పాపం ... బావ బిత్తర చూపులు చూశాడు—

'అదిగాదు... మామయ్యవుత్తరంలో అన్నివిధాల రాశాడు కదా! పోనీ, మామయ్యమీద నీకు గౌరవం లేదనుకో— మీ నాన్నమీద గౌరవం వుందికదా!...'—

బావధైర్యం చేసుకొని 'ఉత్తరాలా?' అని ఆశ్చర్యబోయాడు, అమ్మమ్మ మాటలకి అడ్డుపడి—

'వుత్తరాలా అని బిత్తరపోతావేంరా? నీకు ఉత్తరాలు యేం రాలేదా? ..'

'ఉఁహుఁ...'

'నే నప్పుడే అన్నానురా ... అన్నివేల వుత్తరాలలో పోస్టుచేస్తే... మన వుత్తరం పోతుందని. మీ మామయ్య వింటేనా? ...' అని ఇటు తిరిగింది అమ్మమ్మ—



"అమ్మా, నువ్వుచెప్పినట్టు నేనెందుకు వినాలి?"
"ఎందు కేమిటి? నీ అంతప్పుడు మా అమ్మ చెప్పినట్టు నేను విన్నాను, మా అమ్మకూడా అదేవిధంగా వాళ్ళమ్మ చెప్పినట్టు విన్నది."
"అవును గాని అమ్మా, ఈ చాదస్తం అసలు మొదలు పెట్టింది ఎవరూ?"

---

'సరే, మీరు ముందు స్నానం అదీ చెయ్యండి. నేను భోజనాల ఏర్పాటు చూసి వస్తాను—' అంటూ బావ, బట్టలు వేసుకొని తలుపుదగ్గరగా వేసుకొని వెళ్లిపోయాడు—

* * *

నాకు బావ ప్రవర్తన యేం నచ్చలేదు అయినా, నాన్నగారి అమాయకత్వం కానీ—చక్కగా బియ్యేస్సీ చదువుకొని, నిక్షేపంలాంటి ఉద్యోగం చేసుకుంటూ, నెలకి నూటయాభై రూపాయలు ఆర్జించుకుంటున్నబావ యింతవరకు ఎవర్నీ ప్రేమించకుండా ఉంటాడా?...

అమ్మమాట కాదనలేక మామయ్య వేసిన ప్లానేయిది!...నిజంగా నన్ను తన యింటి కోడల్ని చేసుకోవాలని అను

కొన్నట్టయితే—బావకి వుత్తరం ఎందుకు రాయలేదు ?.

వాడు యిష్టపడాలిగానీ...నాదేముందీ అని అమ్మని మభ్యపెడతాడా ? ....

ఛీఛీ '...ఈ ఇరవయ్యో శతాబ్దంలో ఆడపిల్లగా పుట్టడమే మహాపాపం !...

ఈ బావ ప్రవర్తన చూస్తూవుంటే మమ్మల్ని వదిలించుకోవాలని చూస్తున్నా డల్లేవుంది !...నిజమే ' నాన్న రాసిన వుత్తరం అందకుండా వుంటుందా ?—

కానీ—

బావ రానేవచ్చాడు

ఒక కారియర్, ఓ డజను అరటి పళ్ళూ, రెండు యాపిలుపళ్ళూ, కాసిన్ని ద్రాక్షపళ్ళూ తీసుకొని వచ్చాడు—

'ఇవన్నీ ఎవరికి ?' అని అడిగేను—

'మీకే' ... నిన్ననగా బయలు దేరారుకదా...' అంటూ తలుపు మూసి వచ్చాడు

'నేను హోటల్లో భోజనంచేసేశాను. ఆ కారియర్ మీ యిద్దరికే ' ...' అని చెప్పి, వెళ్ళి కుర్చీలో కూర్చున్నాడు.

* * *

అమ్మమ్మ చెప్పినట్టు వెళ్ళి ఆరోజు ఆఫీసుకి సెలవుపెట్టి వచ్చాడు—

ఆ మధ్యాహ్నం ఆ మ్మ మ్మ అడిగింది — 'ఇంతకీ నీ ఉద్దేశం ఏమిట్రా ?' అని

'ఉద్దేశమా ? దేన్ని గురించీ ?' అని అడిగాడు బావ—

'సరి...బాగుందివరస '...ఇప్పుడు యెందుకు వచ్చామో తెలుసా ?...'

' ..... .... '

'మీ నాన్నకి నీ పెళ్ళి గురించేమీ తెలియదుట '...నువ్వు ఏ పిల్లని చేసు కుంటానంటే ఆ పిల్లని — నువ్వు కోరిన ముహూర్తానికి పెళ్ళి చెయ్యడానికి సిద్ధంగా వున్నాడుట ' ... ఇది నీ మేనత్త కూతురు స్కూలు ఫైనలు తప్పింది ! వీణ నేర్చుకుంది పాడు తుంది పేరు సరళ ' దీనిని నువ్వు చేసు కుంటావో చేసుకోవో ఖచ్చితంగా, నిర్మొహమాటంగాచెప్పేయ్!తెలిసిందా?' అంటూ కుండ బద్దలుకొట్టినట్లు చెప్పిన అమ్మమ్మ మాటలకి — నాకు ఓ పక్కన సిగ్గూ — మరో పక్కన ఆడపిల్లనై ఎందుకు పుట్టానా అన్నబాధా — మరో పక్కన బావ ఏమంటాడోనని ఆత్రుతల మధ్య ఉక్కిరి బిక్కిరి అయిపోయాను

ఇంతలో ఎవరో బయటినుంచి,

'గోపాలం '' అని కేకేశారు—

బావ 'ఇప్పుడే వస్తా' నంటూ తలుపు తీసుకుని దగ్గరవేసుకొని బయటకు వెళ్లాడు

'ఔనూ...బావపేరు క్రిష్ణ కదే ...' అని అమ్మమ్మని అడిగాను

'బావుందిమరీను ! చిన్ని కృష్ణ మూర్తి' అని చెప్పింది అమ్మమ్మ —

'మరి వాళ్ళ ఫ్రెండ్సు గోపాలం అని కేకేశారే'... పేరు మార్చుకున్నాడేమో'' అన్నాను—

అంతలో బావ రానేవచ్చాడు

'ఏరా నాయనా' నువ్వు పేరుకూడా మార్చుకున్నావా? చక్కగా మీ తాతయ్యా పేరు పెడితే.. గోపాలం ఏమిట్రా గోపాలం?' అని వెంటనే అడిగేసింది అమ్మమ్మ

'నా పేరు గోపాలమేగా!...'

'ఎవరన్నారు?...'

'ఒకరనేదేమిటీ ... ఎస్సెల్సీ రిజిస్టర్‌లో వుంటేనూ...నా పేరు వేణుగోపాలరావు' ఇంటో అంతా గోపాలం అనే పిలుస్తారుగా'' — బావకి పేరు మాట ఎత్తేసరికి లేని గొంతు వచ్చింది లాగా వుంది.

'అదికాదు...నీ పేరు చిన్ని కృష్ణమూర్తి కదూ?...'

'నయమే' ఎవరన్నారూ?—'

అయ్యబాబోయ్? ఈ అమ్మమ్మ కొంప ముంచేసింది'...

అతగాడి ఇంటిపేరుకూడా మారిపోయింది'!.... .

'ఈ రూమ్‌నంబర్ తొమ్మిదేనా' అని అడిగాను.

'కాదు...ఆరు' అన్నాడు అతగాడు–

'అయ్యో! బయట తొమ్మిదనేవుంది కదండీ'...' అన్నాను—


"ఏమండీ పిలిచారా ? బెల్ మ్రోగింది

'అబ్బే...చెక్కకివున్న మేకు లూజ్ అయి అది అలా తిరిగి పోతుందండీ–' అంటూ తలుపు తీసి – తలుపుకివున్న గుండ్రని చెక్కని కిందికి తిప్పేడు–

'ఏమే ... ....ఇలా తీశావు నా ప్రాణాలు?' అంటూ పిచ్చెత్తిపోయింది అమ్మమ్మ–

'మామ్మగారూ! మీరేం కంగారు పడకండి! మీకు రూమ్ నంబర్ తొమ్మిది కావాలికదా! పదండి...తీసుకు వెళ్తాను ......' అంటూ మా యిద్దర్నీ తొమ్మిదో నంబర్‌గదికి తీసుకువెళ్లాడు.

తలుపుకొట్టి 'ఒరే క్రిష్ణా! క్రిష్ణా!!'అని కేకేశాడు–

అతనూ బావ!...

చిన్నప్పుడేం......బావ పెద్దప్పుడు కూడా నల్లగానే వున్నాడు మరి!...

అతను మమ్మల్ని చూసి – 'రండి రండి'......నేను పొద్దుటే వచ్చాను

ఈ మధ్య వారంరోజులుగా వూళ్ళోలేను ఆఫీసుపనిమీద వూరువెళ్ళాను ఉత్తరాలు చూసుకొని మీరువచ్చి వెళ్ళిపోయారనుకున్నా' ఇవాళే వచ్చారన్నమాట'! మంచిదే!... దేవుడు మంచిపని చేశాడు!!

హమ్మయ్య!... ఇతగాడికి నిజంగా అమ్మమ్మ పోలికలు వున్నాయి ఈ ధోరణి చూస్తూవుంటే .....అసలు మమ్మల్ని మాట్లాడనిస్తాడా అనిపించింది-

పూర్తిగా చెమటతో తడిసిపోయిన నన్నుచూసి-గోపాలం ఫానువేశాడు-

'వీళ్ళని నీకెలా తెలుసురా? ' అన్నాడు బావ-

'తెలియడం ఏమిట్రా?' అంటూ వెనక పేజీలన్నీ చదివి వినిపించాడు-

'అదాసంగతి' సరిలే'' బామ్మా... నువ్వేం బాధపడకు' వీడుకూడా నాలాంటివాడే! పైగా, మనకులం వీడికులం అన్నీ ఒక్కటే'', ' అని, అమ్మమ్మని ఓదార్చేడు బావ-

మేము ఆరాత్రే బయలుదేరి మావూరు వచ్చేశాం!-

బావ తన అభిప్రాయం వుత్తరంలో రాస్తానని చెప్పాడు-

* * *

తర్వాత, బావదగ్గర్నుంచి వుత్తరం కూడా వచ్చింది-తనకి యిప్పట్లో పెళ్ళి చేసుకోవాలని లేదనీ, పైగా మేనరికం తనకి యిష్టంలేదనీను-

అంతకుముందు రోజే నాకోవుత్తరం వచ్చింది-అదిచాలా కొత్త దస్తూరీ. విప్పి చూశాను-

'మీకు-నిజం చెపుతున్నాను నన్నింతవరకూ ఏ అమ్మాయీ ప్రేమించలేదు నేనుకూడా ఎవర్నీ పెళ్ళాడదామని అనుకోలేదు కానీ, మిమ్మల్ని చూశాకా ఆకోరిక కలిగింది-నేను స్కూలుఫైనలు ప్యాసయ్యాను కానీ, ఉద్యోగంమాత్రం నెలకి నూటడెభ్భై రూపాయలు వచ్చేది చేస్తున్నాను-మీరు సరేనంటే-మా నాన్నగారిని మీ అమ్మా, నాన్నగారిదగ్గరికి పంపుతాను - సాహసించాను - మీ స్వదస్తూరీతో జవాబు రాయండి!... ఇట్లు నేను, గోపాలం '

తర్వాత-

తర్వాత...ఏం చెప్పేదీ' .

నాకు చెప్పడం రాదుమరి'......



# కాముడు కాలిపోయాడు

శీలా వీర్రాజు

ఒక్కసారిగా నిలువెత్తున లేచిన మంటల్లో చీకటి కాలిపోయింది. ఆ మంటల్లో కాముడు కాలిపోతున్నాడు కిటికీలోంచి వెలుతురు గదిలోకి వంగుతోంది గది గోడలమీద చీకటి వెలుతుర్లు అలలు అలలుగా కదులుతున్నాయి పిల్లలు బయట అరుస్తున్నారు కాలిపోతోన్న కాముడ్ని చూసి సంతోషంతో ఏడుస్తున్నారు

గదిలో మంచంమీదనుండి కలలోకి తొంగిచూస్తోన్న ఫణీంద్రుడికి తెలివి వచ్చేసింది నిద్ర తేలిపోయింది లేచి కిటికీవద్దకు వెళ్ళాడు వీధిలో కిటికీకి కాస్త అవల మంట చుట్టూ పిల్లలు గెంతుతున్నారు నిర్దాక్షిణ్యంగా కాలిపోతోన్న బెల్లం బుట్టలోని చీమలు చిటపట మంటున్నాయి

అతనికి చిన్నప్పటి భోగిమంట జ్ఞాపకానికి వచ్చింది వాళ్ళ వీధిలో లోకేశ్వరి యింటిముందు భోగిమంట వేసేవారు పిల్లలంతా బూడిద మిగిలేవరకూ ఆ మంటను వదిలేవారు కాదు లోకేశ్వరి అందరిమీదా అధికారం చలాయించేది ఎవరు మంట దగ్గర కూర్చోవాలో, ఎవరు కూర్చోకూడదో ఆమె నిర్ణయించేది డబ్బున్నవాళ్ళమ్మాయి లోకేశ్వరి అంతా ఆమె చెప్పినట్టే వినేవారు.

ఒకనాడు ఆమె ఫణీంద్రుడ్నీ. మరో యిద్దరబ్బాయిల్నీ మంటవద్దకు రానియ్యలేదు అందుకు అట్టే కారణం కూడా లేదు భోగిదండ ఎవరు పెద్దది కట్టుకుంటారో అని వాళ్ళల్లో వాళ్ళు పంతాలు వేసుకున్నారు లోకేశ్వరి వాళ్ళ పొలంలో పాలేరుచేత పిడకలు పెట్టించింది ఎండిపోయిన తర్వాత వాటిని ఎవరో దొంగిలించేశారు లోకేశ్వరి మళ్ళీ పెట్టించింది. ఈసారికూడా అలానే పోయాయి మొత్తంమీద ఆమె పెద్దదండను కట్టుకోలేక పోయింది ఆ సంవత్సరం ఫణీంద్రుడి దండ పెద్దదని అంతా ఒప్పుకున్నారు ఆమెకూడా ఒప్పుకోక తప్ప లేదు అసలు ఆ పిడకలు ఫణీంద్రుడే దొంగిలించాడని ఆమె అనుమానం

అందుకని అమె ఫణీంద్రుడ్ని మంట దగ్గరకు రానియ్యలేదు

ఫణీంద్రుడికి చాలా కోపం వచ్చింది నిజానికి ఆ భోగి మంటలోని సగం దుంగలు అతనే లాక్కొచ్చాడు స్కూలు

విడిచిపెట్టగానే పదిమంది పిల్లల్ని వెంట బెట్టుకొని పొలాల్లోనూ, తోపుల్లోనూ తిరిగి తాటి దుంగలు, తుమ్మ తుప్పలు లాకొచ్చాడు ఒకసారి యీతముల్లు పాదంలో దిగబడిపోయి నాలుగురోజులు నడవనియ్యనేలేదు.

లోకేశ్వరి వద్దంటున్నా తెగించి ముందుకు వచ్చాడు లోకేశ్వరి అడ్డంగా నిలబడి రెండు చేతుల్నీ బాణాల్లా నడుంమీద వేసుకొని 'ఎలా వస్తావో, రా చూద్దాం' అన్నట్టు చూసింది ఫణీంద్రుడు ఒక్క తోపు తోశాడు ఆమె తమాయించుకొని దగ్గరకొచ్చి అతని చొక్కా కాలరు పట్టుకుంది. అతను విదిలించుకున్నాడు ఆమె పట్టు వదల్లేదు ఆ తోపులాటలో అతను తూలి మంటమీద పడ్డాడు మణికట్టుపైన ఎడం చేతిమీద కొద్దిగా కాలింది వారం రోజులు ఆమెతో అతను మాట్లాడలేదు

ఆప్రయత్నంగానే అతనిలో నిట్టూర్పు లేచింది కిటికీ ఊచల్ని పట్టుకున్న అతని చేతిమీద కాలిపోయిన మచ్చ వెక్కిరించింది

ఇప్పు డతనికి మిగిలింది ఆ మచ్చే'

ఎవరి కంఠమో అతన్ని ఆలోచనల్నుంచి లేపింది. అటు చూశాడు ఎదుటింటి గుమ్మంలో భగవతి ఎవరో పిల్లవాడ్ని కేకలేస్తోంది

నిద్రలేచి వచ్చినట్టుంది, భగవతి కళ్లు మత్తుగా ఉన్నాయి జడ చంపల్ని మూసేసి వదులుగా వెనక్కు వ్రేలాడుతోంది కుడిచెవి దుద్దులోని ఎర్రరాయి క్షణంసేపు తోకచుక్కలాంటి కిరణాన్ని క్రిందకు వదిలింది పసుపుపచ్చని చీర మడతల్లో చీకటి వెలుతుర్లు దాగొని దోబూచు లాడుకొంటున్నాయి తెల్లని ఆమె ముఖంమీద ఎర్రని మంట గులాబీ రంగును నింపుతోంది

భగవతి కిటికీ వయిపు చూసింది కళ్ళ రెప్పల్ని టపటపా కొట్టుకుని చూపుల్ని క్రిందకు దించుకుంది సిగ్గు బారిన ఆమె బుగ్గల్లో చీకటి కాటుక పెట్టింది

ఫణీంద్రుడు భగవతినే చూస్తూ నుంచున్నాడు అతనికి లోకేశ్వరి జ్ఞాపకానికి వచ్చింది లోకేశ్వరి అచ్చంగా ఆమెలా ఉండకపోయినా భగవతిలాగానే లోకేశ్వరి కళ్ళను టపటప లాడించేది పొడవైన వెడల్పాటి ముఖంలో విశాలమైన కళ్ళు, లోపలి పాపల అల్లర్లను బయట పెడుతుంటాయి అలా కళ్ళతో నవ్వేవాళ్ళంటే అతనికి యిష్టం విచిత్రం' భగవతిని చూసినప్పుడల్లా లోకేశ్వరి జ్ఞాపకాని కొస్తుంది కాని, లోకేశ్వరిని చూస్తే భగవతి జ్ఞాపకానికి రాదు

ఫణీంద్రుడు మరోసారి ఎదుటింటి వయిపు చూశాడు భగవతి యింకా అలానే నిలబడి ఉంది దొంగలాగా చూపులు విసిరి నవ్వుతోంది ఎదుటి మంట యిందాకటంత ఉధృతంగా లేదు ఎవరో బలవంతంగా జ్వాలల్ని అణిచే

స్తున్నట్లు క్రిందకు దిగిపోతోంది. పిల్లలు చింకిచాపలు, బుట్టలు ఏరుకొచ్చి మంటను నిలబెడుతున్నారు

భగవతి లోపలికి వెళ్ళి కట్టెపేళ్ళు తెచ్చి మంటలో వేసింది. మంట తిరిగి నిలువెత్తున లేచింది ఆనందంతో ఆమె కిటికీలోకి చూసింది.

ఫణీంద్రుడు చూశాడు ఆమె ముఖం లోని చిరునవ్వును, కళ్ళల్లోని కాంతిని అతను దాచేసుకున్నాడు తిరిగి వెళ్ళి పడుకున్నాడు

నిద్ర రావటంలేదు ఎప్పుడో అది తేలిపోయింది. ఇప్పుడతన్ని ఆలోచనలు తేల్చివేస్తున్నాయి.

భగవతి అందమైన అమ్మాయి. తనంత తానుగా సన్నిహితం కావాలని ప్రయత్నిస్తోంది ఆమె అంటే తనకూ యిష్టమే. ఆమెను ఎందుకు దూరంగా ఉంచివేస్తున్నాడో ఆలోచించి నప్పుడు తగిన సమాధానం అతనికి లభించలేదు

లోకేశ్వరి ఆలోచనలతో మనసు వికలమై వేరే యింట్లోకి మారిపోదామని ప్రయత్నం చేసినప్పుడు, ఆ ప్రయత్నం లోనే భగవతి తొలిసారి కనుపించింది గది కాళీగా ఉన్నట్టు ఆవిడే చెప్పింది

ఫణీంద్రుడు గది వెతుక్కుంటూ వస్తూ ఆ యింటి ముందు ఆగిపోయాడు గుమ్మంలో ఉన్న ముసలాయన్ని 'ఇక్కడెక్కడయినా అద్దెకు గది దొరుకుతుందా ?' అని అడిగాడు ఆయనకు బ్రహ్మచెముడు రెండుసార్లు చెప్పినా వినిపించినట్టులేదు భగవతి యీ శబ్దానికి లోపలనుంచి వచ్చింది. అదే ప్రశ్న ఆమెనూ అడిగాడు ఆ ఎదుటిల్లు చూపించి అక్కడకు వెళ్ళి అడగండి అంది.



"ఏమిట్రా తలా తోక లేదు నీ జవాబుకు ."
"మీ ప్రశ్న అలాగుంది సార్ "

ఆ మరుసటిరోజు అతను ఆ గదిలో దిగడం ఆమె చూసింది ఆ సాయంకాలం సంధ్య వాలిపోయిన తర్వాత ఎప్పుడూ లేని ఫ్లూటు వాయిద్యాన్ని ఆమె వింది అది ఎక్కడనుంచి వచ్చిందో ఆమెకు ఊహించడం కష్టం కాలేదు.

ఆ ఫ్లూటు వాయిద్యంతోనే అతను ఆమెకు సన్నిహిత మయిపోయాడు. అతని పొడుగాటి వ్రేళ్ళు, చింపిరిగా ఎగిరిపడుతూండే జుట్టు, ముతక కద్దరు లాల్చీ, పైజామా, సగం అరిగిన ఆకు

జోళ్ళూ ఆమెకు చాలా అందంగా కనుపించేవి వాటి అన్నిటిలోని ఆ వ్యక్తిని ఆమెకు తరచు చూడాలని, చూస్తూ ఉండిపోవాలని అనిపించేది

అంతంత మాత్రంగానైనా ఆమె ఎప్పుడూ అతనితో మాట్లాడలేదు — రెండూ మూడుసార్లు తప్ప ఆ అవకాశాన్ని అతను కల్పించేవాడు కాదు చిలిపిగా ఆమెచేసే అల్లరిని నిశ్చలంగా చూసి వెళ్ళిపోతుండేవాడు ఒక్కొక్కప్పుడు ఆమెకు సహనం కూడా సన్నగిల్లిపోతుండేది అభిమానంతో, కోపంతో అతనికై ఎప్పుడూ పరితపించగూడదనుకునేది కాని అతన్ని చూస్తే, అతని మురళీ నాదాన్ని వింటే రాధిక లాగా అయిపోతుంది సముద్ర గర్భం ఎంత ప్రశాంతంగా ఉన్నా ఒక్కొక్కప్పుడు ఆ ప్రశాంతతో విసిగిపోయి కోటానుకోట్ల బాహువుల్ని ఆకాశంలోకి సాచి 'యీ నిశ్చలతను యిక భరించలేను ప్రభూ' అని విలపించినట్టే, అంత గంభీరమైన అతనూ ఎప్పుడో ఒకప్పుడు ఆ గాంభీర్యాన్ని భరించలేక తననుచూసి చిరునవ్వు విసరకపోతాడా అని ఆమె ఆశ

తనకై యింతగా పరితపిస్తోన్న భగవతిని చూస్తే ఫణీంద్రుడికి జాలివేసింది రోజూ తన ఉనికి తెలియడంతోనే గుమ్మంలోకొచ్చి నుంచుని చూపుల్తోనే తృప్తిపడే ఆమెను అనవసంగా యిక బాధపెట్టదలచుకోలేదు ఇంతకాలమూ ఏ విషయాన్ని గూర్చి భయపడ్డాడో ఆ విషయాన్ని ఆమెకు తెలియజేసి ఆ భయాన్ని పోగొట్టాలి అనుకున్నాడు తన నగ్న జీవితాన్ని ఆమె భరించలేదేమోనని అతని భయం

'ఏమయినా ఆమెను యిక బాధపెట్ట గూడదు' అనుకున్నాడు.

ఆ నిర్ణయం చేసుకున్న తర్వాత అతని మనస్సు ఎప్పుడూ లేనంత తేలిగ్గా అయిపోయింది. లోకేశ్వరి తన హృదయంలో నింపివేసిన బరువుకూడా తొలగిపోయినట్లనిపించింది ఆ తర్వాత లోకేశ్వరిని గురించి మరో పది నిమిషాలు ఆలోచించాడు పూర్వంలాగా అతని ఆలోచనల్లో యిప్పుడు స్వార్ధం లేదు, బాధ లేదు

'రేపే లోకేశ్వరి పెళ్ళి' అనుకున్నాడు హాయిగా నిద్రపోయాడు.

నిద్రలేవగానే, రంగుల్ని పులుముకొని ఉదయం అందంగా కనుపించింది. ఎక్కడబడితే అక్కడ రంగులు ఎగురుతున్నాయి ఊరంతా రంగుల్లో మునిగి చిన్న పిల్లలా ఆడుకొంటోంది

ఆరోజు హోళి!

ఫణీంద్రుని మనసులో రాత్రి కలలో జల్లిన వసంతం యింకా రంగుల్ని కోల్పోలేదు మత్తుగా లేచి కిటికీ వద్దకు వెళ్ళాడు పిల్లలు ఒకరిమీద ఒకరు వసంతం జల్లుకుంటున్నారు ముఖానికి రంగుల్ని పులుముతున్నారు భగవతి

ఇంద్రధనుస్సులోని మెరుపులా నవ్వు తోంది.

కాస్సేపు అతను ఆలోచనలకు రంగుల్ని పులుముతూ నుచున్నాడు అప్రయత్నంగానే అతని పెదవులమీద నుండి చిరునవ్వు దొర్లిపోయింది ఆ చిరునవ్వును ఏరుకుని భగవతి యింట్లోకి వెళ్ళిపోయింది పసుపురంగులో పెళ్ళి కూతురులాగే ఉంది ఆమె

అతను గబగబా కాలకృత్యాల్ని ముగించుకున్నాడు మరో రెండుగంటల్లో పసుపుబట్టల్లో లోకేశ్వరిని చూడబోతు న్నాడు పెళ్ళికూతురై, పెళ్ళిపీటలమీద కూర్చుని తనకై ఎదురుచూస్తూ ఉం టుంది ఆమె ఆమె జీవితాన్ని, ఆమెనూ పంచుకోబోయే వ్యక్తి తనను అక్కడ చూస్తేనేగాని తృప్తిపడడు అందుకే అతను గబగబా అన్ని పనుల్నీ పూర్తి చేసుకున్నాడు ఆ ముందురోజు ఉతికి యిస్త్రీ చేయించిన బట్టలు వేసుకున్నాడు. ఆమెకని కొన్న పుస్తకంలో అందంగా కొన్ని లైనులు వ్రాశాడు మూడునాలుగు సార్లు చదువుకుని తృప్తిగా ఊపిరితీశాడు

ముహూర్తానికి యింకా గంట టయి ముంది మరో అరగంటకు బయలుదేరితే సరిగ్గా పెళ్ళిపీటలమీదనుండి లోకేశ్వరి తనను చూడవచ్చు వంచిన ముఖంలోని చెమర్చిన కళ్ళను మరొకరు చూసే అవ కాశం ఉండదు



"నువ్వు వద్దంకాక నా బొమ్మలన్నీ విరగ్గొడు తున్నావా ? ఛీ ' ఏంటి నాన్నా ?"

ఫణీంద్రుడు పుస్తకం తెరిచి మొదటి పేజీలో తను వ్రాసిన వాక్యాల్ని మరో సారి చదువుకున్నాడు

ఆ వాక్యాల్లో లోకేశ్వరి తనను చూడ గలదనే అతని నమ్మకం తనను ఆమె అపార్థం చేసుకొంటోంది అలా చేసుకో వడం ఆమె తప్పేమీ కాదు ప్రయత్న పూర్వకంగా తను ఆమెను దూరంచేసు కొంటున్న ఈ చర్యవెనుక ఎంత బలమైన కారణమున్నదీ ఆలోచిస్తే, తన అశక్తతను ఆమె మన్నించగలదని అతని అభిప్రాయం లోకేశ్వరి ప్రేమను తిరస్కరించి తను దురదృష్టవంతుడే అవుతున్నాడు ఆ విషయం ఆమె ఎదుట వప్పుకోవడానికి అతనికి సిగ్గేమీ లేదు

ఒకరోజు అతను ఆమె కన్నీళ్ళలో స్నానం చేశాడు ఆ కన్నీళ్ళు అతన్ని

ఉక్కిరి బిక్కిరి చేసివేశాయి. అతని మనసంతా అదోలా అయిపోయింది ఆమె హృదయాన్ని గాయపరిచినందుకు క్షమాపణ వేడుకొన్నాడు గాని ఆమె దేవత కాలేక పోయింది. ఏడుస్తూ మౌనంగా వెళ్ళిపోయింది.

ఆమె ఆశల్ని అత నెప్పుడూ కూల్చి వేయదలచుకో లేదు. 'నీకు నేనంటే యిష్టమేనా' అని తొలిసారి ఆమె అడిగినప్పుడే ఆమెలో అతనికి వింత కాంతి కనుపించింది. అంతస్థుల విబే ధాల్ని అధిగమించిన ఆమెను ఒక దేవత గానే భావించాడు చిన్నప్పటి లంగా జాకెట్టులోని లోకేశ్వరికీ, యీనాటి లోకేశ్వరికీ ఎంత విభేదం ఉందో ఆలో చించినప్పుడు అతనికి ఆశ్చర్యం వేసింది ఆమెను దూరంచేసుకో దలచుకో లేదు.

కాని యీనాడు ఆమెను తనంతతాను దూరం చేసుకోక తప్పడంలేదు. ఇంతకాలమూ తన చదువుకు అజ్ఞాతంగా సహాయం చేస్తూన్న వ్యక్తి ఆమె మేన మామే అనీ, అతను ఆమెను పెళ్ళి చేసుకోదలచుకున్నాడనీ విన్నప్పుడు కొయ్యబొమ్మలా స్తబ్ధుడైపోయాడు ఆనాడే తను దురదృష్టవంతుడ ననే విషయం అతనికి వ్యక్తపడిపోయింది.

తన అభివృద్ధికి కారకుడైన అతనికి కృతఘ్నుడుగా చిరకాలం జ్ఞాపకం ఉండ దలచుకోలేదు. బండెడు దుఃఖాన్నీ భరించ డానికే నిశ్చయించుకున్నాడు

ఆ తర్వాత ఆమె కలిసినప్పుడు "లోకేశ్వరీ నిన్ను నేను పెళ్ళి చేసుకో లేను. క్షమించు" అన్నాడు

ఆమె గతుక్కుమంది. విచిత్రంగా అతని కళ్ళల్లోకి చూస్తూ దగ్గరకు వచ్చి నుంచుంది.

"నేను చాలా దురదృష్టవంతుణ్ని లోకేశ్వరీ నీలాంటిదాన్ని చేతులారా దూరం చేసుకొంటున్న అదృష్టహీనుణ్ని. నా నిర్ణయం నీ హృదయాన్ని చిన్నా భిన్నం చేస్తుందని నాకు తెలుసు కాని అసహాయుణ్ని. ఏమీ చేయలేను క్షమించు'' అన్నాడు ఆరిపోయిన పెదాల్ని తడుపుకున్నాడు

లోకేశ్వరి క్షమించకుండానే వెళ్ళి పోయింది.

ఆ తర్వాత ఆమెను కలవడానికి ప్రయత్నం చెయ్యలేదు రెండు మూడు సార్లు ఆమె ఎదురయినపుడు దూరం నుంచే ఆమెను చూసి, ఆమెకు కనబడ కుండా తప్పుకునే వాడు తనను చూస్తే పాత సంఘటనలతో ఆమె మనసు బాధ పడుతుందని అతని భయం

చాలా కాలం తర్వాత ఒకరోజు తిన్నగా లోకేశ్వరే అతని గదికి వచ్చింది

"ఫణీ! నన్ను చూసి అలా పారి పోవడం చాలా బాధగా ఉంది నాకు కనుపించి నప్పుడయినా పలకరించి మాట్లాడక పోవడం మంచిపని అనలేను అంతగా నన్ను చూసి భయపడాల్సిన

అవసరం ఏమొచ్చిందో నాకు అర్థం కావడం లేదు'' అంది

దాని కతను సమాధానం చెప్పలేక పోయాడు

ఆమె చాలా సేపు అలానే కూర్చుండి పోయింది వెళ్ళిపోయేముందు పుస్తకం లోంచి శుభలేఖ ఒకటి తీసియిచ్చి ''ఆశలు కూలిపోయినా అభిమానం విరిగి పోలేదు నన్ను నువ్వు దూరం చేసు కున్నా నిన్నెప్పుడూ నేను దూరం చేసుకో లేను నీ మీద నాకు కోపం ఉండడం సహజంగాని, నామీద నీకు కోపం ఉండ డంలో అర్థంలేదు నన్నెంత అసహ్యించు కున్నా కనీసం నా వివాహాని కయినా రావడానికి ప్రయత్నించు అల్ప సంతోషిని—అంతకన్నా నేనేమీ ఎక్కువ కోరను'' అంది

మరొకసారి అతను ఆమె కన్నీళ్ళలో స్నానం చేశాడు కాని ఎక్కువసేపు అతన్ని కన్నీళ్ళలో తడపడం ఆమెకు యిష్టం లేకపోయింది వెంటనే అక్కడ నుంచి కదిలి వెళ్ళిపోయింది

వెళ్ళిపోతున్న లోకేశ్వరితో ''లేదు లోకేశ్వరీ ! నువ్వంటే నాకు ఏ మాత్రం కోపం గాని ద్వేషంగాని లేవు నిన్ను నేనెప్పుడూ అసహ్యించుకో లేదు ఎల్లప్పుడూ ప్రేమిస్తూనే ఉంటాను తప్ప కుండా వచ్చి, నీ వివాహాన్ని కళ్ళారా చూసి, నీ అదృష్టానికి నా అభినందనల్ని అందజేస్తాను'' అన్నాడు

అప్పటికే ఆమె ఆ వీధిచివరకు వెళ్ళి పోయింది

ఫణీంద్రుడి ఆలోచనలు విచ్చి పోయాయి ఇంటివాళ్ళ గడియారం ఒక్కసారి నిశ్శబ్దంలో క్రూరంగా అరిచింది

అదిరిపడి లేచాడు ఫణీంద్రుడు

ఆలోచనల్తో అసలు సంగతే మరచి పోయాడు ఈ పాటికి లోకేశ్వరి పెళ్ళి పీటలమీద కూర్చుంటుంది ఆమె చూపులు నాలుగు మూలల్లోకీ పరుగెత్తుతుంటాయి నిరాశను నింపుకోకుండానే తను అక్కడకు చేరుకోవాలి

గదికి తాళం వేశాడు మెట్లమీద నుంచుని వీధిలోకి చూశాడు ఎదురింటి గుమ్మంలో క్షణంపాటు మెరుపులా భగవతి మెరిసి మాయమయ్యింది రంగులు నింపిన ముఖంలోంచి సన్నగా నవ్వింది ఇంద్రధనుస్సు లాంటి ఆ నవ్వు అతని హృదయంలో రంగుల్ని వెద జల్లింది క్షణంసేపు అలానే నిలుచుని మెట్లుదిగి వీధిలోకి వచ్చాడు ఆలోచ నల్తో అక్కడనుండి గబగబా కదిలాడు

అవతలి యింటి గుమ్మంముందు నుండి వెళ్తున్నప్పుడు అకస్మాత్తుగా అతనిమీద రంగులు వచ్చిపడ్డాయి. భగవతి గుమ్మంలో నిలబడి రెండు చేతుల్తోనూ రెండు రంగు నీళ్ళ సీసాల్ని పట్టుకొని పకపకా నవ్వుతోంది !





ఫణీంద్రుడు ఆగిపోయాడు ఒకసారి తన బట్టలపయిపు చూసుకున్నాడు బట్టలు రంగుల్తో వెక్కిరిస్తున్నాయి పుస్తకంమీద రంగులు గజిబిజిగా అలుక్కుపోయాయి

అతనికి కళ్ళనీళ్ళు తిరిగాయి కొద్ది సేపు ఆలాగే నిలబడిపోయి ఆమె ముఖంలోకి చూశాడు ఇంకా అలానే నవ్వుతోంది ఆమె అక్కడనుంచి ముందుకు వెళ్ళలేక పోయాడు వెనక్కు తిరిగి వచ్చి కుర్చీలో కూలబడ్డాడు

ఆలోచిస్తున్నకొద్దీ అతని కళ్లు నీళ్లతో తడిసిపోతున్నాయి అతనికి ఉన్నవి రెండేరెండు జతలు ఆ ముందటిరోజునే ఒక జత బట్టల్ని తెల్లగా ఉతుక్కుని యిస్త్రీ చేయించి యివ్వాళ్టికనే దాచుకున్నాడు ముగ్గురు మిత్రుల్ని కాళ్ళావేళ్ళా బ్రతిమలాడి యిరవై రూపాయల్ని సంపాదించాడు దాంతో నాట్యశాస్త్రం మీద పుస్తకం ఒకటి కొన్నాడు పెళ్ళినాడు ఆమె కిచ్చే కానుక అది ఆమెకు నాట్యం అంటే మహాయిష్టం అంతకు ముందు కొంతకాలంపాటు ఆమె నేర్చుకుంది వివాహానంతరం అది మూలపడి పోకూడదని అతని అభిప్రాయం,

తాహతుకుమించిచేసిన యింత ప్రయత్నమూ క్షణంలోవృధా అయిపోయింది తను ఆమెను అసహ్యించుకోవడం లేదని, ఎప్పటికీ ఆమెను ప్రేమిస్తూనే ఉంటానని



నిరూపించుకునే అవకాశం అతనికి యిక లేదు అక్కడ పెళ్ళి ఎండిట్లో లోకేశ్వరి కళ్ళు యీపాటికే అలసిపోయి శోష వచ్చినట్టు వాలిపోతాయి




ఫణీంద్రుడు లేచాడు తెల్ల కాగితం ఒకటి వెతికి తీసుకొచ్చాడు దానిమీద పెన్సిలుతో చిన్న సున్నా చుట్టి కళ్ళు, ముక్కు, చెవులు, నోరు అవీ వేశాడు అడుగున పెద్ద సున్నా, దానికి దిగువన అటూయిటూ కాళ్ళూ చేతుల్లా గీతలు గీశాడు పొట్టలో నల్లగా కొట్టొచ్చినట్టు కనపడేట్టుగా పెద్దక్షరాలతో 'కాముడు' అని వ్రాశాడు గుమ్మంలో నుంచున్న భగవతికి ఆ బొమ్మను చూపించాడు అగ్గిపుల్ల వెలిగించి ఆ బొమ్మ ఒక చివర అంటించాడు ఆ మంట భగభగా మండి దాన్ని కాల్చివేసింది మిగిలిపోయిన నల్లని బూడిద గాలిలో ఎగిరిపోయింది

నవ్వుతూ చూస్తూన్న భగవతికళ్ళు ముడుచుకుపోయాయి ఆమె ముఖంలోని యింద్రధనుస్సు పారిపోయింది 

---

ము ప

# సినిమా క్విజ్








పై మూడు బొమ్మలూ మూడు సినిమాల పేర్లు తెలియజేస్తవి  ఏమిటవి ?

(జవాబులు 96 వ పేజీలో)

(జవాబులు 96 వ పేజీలో)




గోడమీద బల్లి వులిక్కిపడింది తన నీడ చూసుకుని – వోల్టేజ్ తక్కువయి వెలుగుతున్న బల్బు చటుక్కున కాంతితో వుబ్బింది...

"చాలా రోజులయింది మిమ్మల్ని చూసి–పెళ్ళిలో చూడ్డమే – యిన్నాళ్ళకి అనుకోకుండా జరిగింది యిలారావడం."

"మామయ్యా, నువ్వు పెద్దవాడివయిపోయావ్" అంది అనసూయ ఆయన తలనీ మొహాన్నీ చూస్తూ.

"యీమాట మీ అత్తయ్య వింటంటే నీమీద సూట్ ఫైల్ చేస్తుంది జాగ్రత్త." ముగ్గురి నవ్వులూ కలిసిపోయాయి ... ఆయనే అన్నాడు ... "యిందులో ఆశ్చర్యపడాల్సిం దేముంది చలపతీ– చిన్నవాడినయితే తప్ప ... యేమంటావు..."

"నిజమే" అన్నాడు చలపతి.

"యెలా వుంది మీ సంసారం– సాఫీగా సాగిపోతోందా – అనసూయా" అడిగాడు భానుమూర్తిగారు అనసూయని చూస్తూ...

"అదేమిటండీ – యిద్దర్నీ కూర్చోబెట్టి అడిగితే యెలాచెప్పేది ... అంతేనంటావా అనసూయా" అన్నాడు చలపతి.

"నిజం మామయ్యా ... నన్నొక్కదాన్నే యే వంటిట్లోనో వంటిగాచూసి అడిగావంటే–యీయనగారు నన్ను బాధ పెట్టేస్తున్నారనీ, యెప్పుడూ తోడుగా సినిమాకు తీసుకువెళ్ళరనీ – నా భావాలు అర్థం చేసుకోరనీ చెప్పేదాన్ని – కానీ ఆయన వుండిపోయారు ... యెలా చెప్పేది..." చిన్నగా నవ్వుతూ అంది భర్తని చూడండి అన్నట్టు ధీమాగా ...

"అవునండీ—భోజనంలో రాళ్ళపాలు అమితం—రుచి మితం—కాఫీలో నల్లనీళ్లా తెల్లనీళ్ళా యెప్పుడూ డైవర్స్ యిచ్చు కుంటాయి...సూటీపోటీ మాటలు—అల కలు — రుక్మిణత్తయ్య కూతురు ప్రభా వతి—లేకపోతే యెదిరింటి సరోజో నా కళ్ళలో కన్పిస్తున్నారని యీర్ష్య...... యివన్నీ యెవరితో చెప్పుకోను — మీరొచ్చారుకదా యే బీచ్‌వడ్డునో అతి దూరంగా సముద్రం కన్నీటి కెరటాల్ని రేపుకుంటున్న సాయంత్రం — యీ గుండెల్లో బాధకూడా అంతేనని చూపుదాం అనుకున్నాను —" అన్నాడు మరింతగా నవ్వుతూ చలపతి.

"బావుందర్రా — యిదే మీ అత్తయ్య అయితే యేంచేసేదో తెలుసా" ఉపో ద్ఘాతం మొదలుపెట్టాడు భానుమూర్తిగారు.

"దానికీ నాకూ, వేలసంఖ్యని వందల సంఖ్యతో హెచ్చవెయ్యడంగానీ, భాగా రించడంగానీ చేతకాని రోజుల్లో పెళ్ళ య్యింది...తిరిగి మేం కల్సుకునే సరికి అది చలం, బుచ్చిబాబూ, లారెన్స్, మామ్ నావెల్స్ చదివే అంతగా యెదిగి పోయింది...."

"అంటే నీకు తగ్గ యిల్లాలుగా తర్ఫీదు అయ్యిందన్నమాట" అనసూయ అంది...

"నేను దాన్నిచూసి పోల్చుకోలేక 'అమ్మాయ్...యిక్కడ సీత అనే పిల్ల వుండాలి తెల్సా' అని అడిగాను"

"మీ భార్యనే...?"

"అవును. అదేంచెప్పిందో జవాబుగా తెలుసా ... 'నేనే...యెందుకు?' అంది ప్రశ్నార్ధకంగా".

"బలే — బలే..."

"బలేకాదమ్మా, .దీని కెంత మొగాళ్ళ సమాధానం యివ్వగల్రు చెప్పు అన సూయా...యెవరో నీ మొగుడొచ్చా డంటే తలుపు వారలోంచి వంటి కంటితో చూసే ఆడదాన్ని — కాలరెత్తుకుని వచ్చిన మనిషి భర్తకాబట్టి—సిగ్గుతో లేత ఆకులా ముడుచుకుపోయిన భార్యల్ని మాత్రం యెరుగుదును...నాభార్య-సీత- అలా అడగటంతో నా వాక్కు పూర్తిగా పడిపోయింది — 'నువ్వు నా భార్యవని చెప్పనా — లేక నేను నీ మొగుణ్ణి' అని చెప్పాలో తెలియక తికమక పడ్డాను..."

"అదేమిటి మామయ్యా...యెంతైనా భార్యేగా — సీతా అని పిలవలేక పోయావ్..."

"అదెలా ... మొదటే నేను సీతా అని సంభోదించివుంటే మరోవిధంగా వుండేది మా తొలి కలయిక — తీరా అప్పుడు పిలవడం ప్రమాదం అన్పిం చింది..."

"మరేంచేశారు..."

"ఏంచెయ్యలేదు ... ఆలోచన తెగే లోపల ఆపద్బాంధవుల్లా అత్తగారువచ్చి రక్షించారనుకోండి ... యింతకీ చెప్పొ చ్చేది — మా సంసారం మొదలుపెట్టాక

మాకు యే విభేదాలూ, మనస్పర్ధలూ లేవు ... యెందుకంటారేమో ... అది, దాని వుద్దేశాలు చెప్పేసేది — నేనూ అంతే...వో సారి దానికి కోపం వచ్చి తిప్పుకోలేకపోయింది కాబోలు —

'మా వాళ్ళు చేసేరుగాని అసలు మీరంటే నా కిష్టంలేదు యెప్పుడూ కూడా' అంది...

"ఛా అన్నీ అబద్ధాలు మామయ్యా.."

"చెప్పనీ — మాటల్లో అడ్డుకోకు మరి ... నాకేం బాధ అనిపించలేదు... నా వుద్దేశాలు కూడా అప్పట్లో వేరుగానే వుండేవి...నా భార్య అంటే—అమ్మలా, పిన్నిలా, చెల్లాయిలా వుండాలి...మాట లాడని స్త్రీ అంటే నాకు అభిమానం... అమాయకత్వం తొణికిసలాడే ఆడ దంటే ప్రాణం...అవేమీకూడా మీ అత్త య్యలో లేవు...అందుకే వెంటనే నేనూ అనేశాను...'వోసి వెర్రి మొహం — నేను మాత్రం నువ్వంటే పడిచస్తున్నా ననుకోకు — మనల్ని మైనర్లుగాచేసి పెద్దాళ్ళుచేసిన పెళ్ళిది...వాళ్ళమీద గౌరవం కొద్దీ తప్ప, నా భార్య వేరు రూపంలో వుండాలని నాకూ ఆశగా వుంది...'అని.

"అయితే మీ మధ్య రోజూ పోట్లాటే నన్నమాట..." చలపతి అన్నాడు...

"పోట్లాటేమిటయ్యా ... మేం యీ వాదన చేసేసరికి మా పెద్దబ్బాయి కాలే జీలో చదువుకుంటున్నాడు ... లలిత



"పండుగపూట కలిగింది వేసాం. వెళ్ళు..."
"మనయింటిలోనుండి వడలవాసన వస్తూంటే.. వెళ్ళమంటారా..."

---

పరికిణీలు, వోణీలూ వేసుకుంటూ వివాహవేదిక్కి దగ్గరవుతున్నానని పరోక్షంగా హెచ్చరిస్తోంది..."

"అయితే తీరని కోరికలతోనే, సంసారయాత్ర సాగిపోతోందన్న మాట..."

భానుమూర్తిగారు దీర్ఘంగా నవ్వాడు.. హాలంతా దద్దరిల్లింది. కళ్ళజోడులోంచి కంటిపాప తళతళమంది...

"అదేంలేదు చలపతీ... అయిష్టత కొద్దిగానైనా వుండకపోతే బ్రతుకుపట్ల రుచి చస్తుందనుకో. .దొరకనిదానికోసం వెదుకులాడ్డం...అశాంతి వడిలో పడి

పోతామేమోనని భయంతో, వొకళ్ళ కొకళ్ళు దగ్గరవడంకోసం ప్రయత్నం చెయ్యడం, ... జరుగుతూంటాయి ... గోల్ కీపర్ అనేవాడు లేకపోతే గోల్ చెయ్యడానికి యే ప్లేయర్ అన్నవాడైనా వొప్పుకుంటాడా చెప్పు...''

''కలతలతో వొకళ్ళ నొకళ్ళు వంచించుకోవడం, మనస్పర్ధలు ... యివన్నీ యెలా జరుగుతున్నా యంటారు...''

"ఎదటి మనిషి నిజరూపం తెల్సుకో పోవడం మూలంగా నే...నా భార్యే వుందనుకో...దాని బాధలు అది చెబు తుంది.. నా వుద్దేశాలు నేను చెబుతాను... చాలా వాటిని సమన్వయంగా తీర్చిదిద్ది యేకంచేసుకుంటాం...మిగిలిన వాటితో 'మరోజన్మ'కని సంధి చేసుకుంటాం..."

అనసూయ ఆలోచిస్తూఅంది...

"మా స్నేహితురాలు వుండేది మామయ్యా, ఇందుమతి అని—అది చాలా అందంగా వుండేది... అది మాఅందరికీ తెలుసు... పదిమంది కలిసి యెక్కడి కైనా వెడితే అది రాజకుమార్తెలా, మే మంతా చెలికత్తెల్లా వుండేవాళ్ళం..."

"బాగానే వుంది. మీరు కాలుపెట్టిన చోటల్లా ప్రేమ విజృంభణ... తద్వారా యీర్ష్యలు, పోటీలూ, యుద్ధం, యివన్నీ క్షణాలమీద సృష్టిచేసే వారన్నమాట.." చలపతి నవ్వాడు... కానీ అనసూయ గతంలోకి ప్రయాణం చేసినదానిలా వుంది... మాటలు మాత్రం ఆలోకం నుంచి విసురుతున్నట్లుగా వస్తున్నాయి..

"దాని జీవితంలో నిజమైన పతనం తను అందగత్తెనని తెలియడం మూలం గానే ప్రారంభమయింది. అదే బాధాకరం మామయ్యా... ఇందుమతిలాంటి వాళ్లెం దరో సుఖపడ్డారు... అందంతో ఆక ర్షించి నిజ జీవితానికి బంగారు పూవు లద్దుకోవడం— వెన్నెలతో బ్రతుక్కి చాందినీ కట్టుకోవడం దానికొక్కదానికే కుదరలేదు... యెంచేతో...''

''అదేం... అంత అందగత్తెకు యే మగాడూ అందిరాలేదా... లేక అవిడే తృణీకరించిందా...''

"అలాజరిగితే బాగానే వుండేది మామయ్యా... అదీకాలేదు... బి. య్యే పాస్ అయ్యింది... యేదో కొద్దిపాటి ఆస్తి, బంధువులూ వున్నారు. అప్పటికి దాని బ్రతుకు—సరిగ్గా వెన్నెట్లో ముగ్గుతో చుక్కలు పెట్టుకుంది... యిక పట్టీలూ... వంకీలూ తిప్పడం తరవాయి... అంద మైనబొమ్మ తయారవుతుంది...కానీకొంత మంది దాని అందంముందు ''యిన్ఫీరి యారిటి" తో, మరి కొందరు భయంతో ఆ చుక్కల్ని కలయతొక్కేసారు ... వట్టి బూడిద— కాళరాత్రి మింగి, కక్కిన వెన్నెల ఆనమాలుగా మాత్రం మిగిలింది. దాని జీవితం ఆఖరికి మాటలురాని శిలా ఖండంలా, అపురూపమైన అజంతా సుందరిలా అయిపోయింది... అందరూ

ఆ బొమ్మని చూసి మాత్రం ఆనందిస్తారు.. పూజిస్తారు...కలల్లో కని తపిస్తారు... అంతేతప్ప మనిషనుకోరు...

"అయితే" అన్నాడు చలపతి—

"ఏడాదిక్రితం అది నాకో వుత్తరం వ్రాసింది..."

"ఓ మొగుణ్ణి వెతికిపెట్టమనా"

'అనసూయా ... ... నన్నింతకాలం నాలో ఆకర్షణా, అందం మభ్యపెట్టాయి.. వాటినే ప్రేమిస్తూ అదేజీవితం అనుకున్నాను ... తీరా నేను చిటారుకొమ్మ చేరినతర్వాత వంటిగా నిలవలేననీ యేదో వో ఆధారంతో ఊగాలనిపిస్తోంది ... కానీ నేను పైనుంచి క్రిందకి రాలేను— నాదగ్గరి కెవరూ రావడంలేదెలా'గని ?"

"బావుంది ... కాశీమజిలీ కథలోలా రాత్రి అరుగుమీద పడుకున్న యే మగ వాణ్ణో పెళ్ళి చేసుకుంటే పోయేదిగా" చలపతి అన్నాడు.

''అలాగే చేసింది ... తనమీద తను అసహ్యం పుట్టించుకుంది ... కావాలనుకున్నవి అందకపోయినతర్వాత నాకేదో కావాలీ అనుకోవడం ఆగిపోవాలి— అందుకే పెళ్ళాం పోయి ముగ్గురుపిల్లలున్న వో ముసిలాయన్నిచూసి పెళ్ళి చేసుకుంది..."

"ఘోరం ... కావాలనే యీశిక్ష విధించుకుందా..."

"అవును ... తన్ని వంచించిన అందాన్ని యేడిపించాలని, బానిస చేసి రాసి రంపాన పెట్టాలనీ అలా చేసిందిట"

"ఇప్పుడైనా సుఖంగా వుందా..."

''లేదు మామయ్యా ... ఆ అందం తిరిగి దాన్ని మోసగించింది ... వెర్రి కోపంతో తన్ని తను గాయం చేసుకుంది ... అదృశ్యుడైన భగవంతుణ్ణి ఆడిపోసికోవటం లాంటిది ఆ కోపం. మనం ఆయన్ని తిట్టినంతమాత్రాన, అదృష్టాలు, అనర్ధాలూ తప్పించుకోలేంగా... దానిమొగుడు రోజూ రాసి రంపాన పెడతాట్ట...ఆయనకి చచ్చే అనుమానం. తనను యెక్కడ మోసగిస్తుందోనని కళ్ళల్లో కాపలా కాస్తాడుట..."

"పెళ్ళి చేసుకున్నా అంతే అయిందన్నమాట..."

"అవును...ఆఖరికి కోపంతో విసిగి అందట కూడానూ... 'నేను మిమ్మల్ని కోరిచేసుకున్నా— మోసం చేసే వుద్దేశం నాకేంలేదు... యెవరితోనో లేచిపోవడానికీ, అందర్నీ ఆకర్షించడానికీ అయితే మిమ్మల్ని పెళ్ళిచేసుకోవడం దేనికి... నన్ను మనస్ఫూర్తిగా ప్రేమించండి. యెందుకు అనుమానిస్తార'ని యేడ్చి మొత్తుకుందిట."

భానుమూర్తి నిట్టూర్చి అన్నాడు...

"ఆ అమ్మాయి పెళ్ళిచేసుకోకుండా వుంటేనే సుఖపడేదేమో... అందరికీ పనిచేసే మందులు కొందరికి వెగటు సూచిస్తాయి... అమృతం తాగితే ప్రతి

వాడూ బ్రతకకపోవచ్చు చలపతీ... మనసు కోడెత్రాచులాంటిది... మనిషి రక్తం మింగిందంటే చస్తానని తనకూ తెలుసు... అయినా మనిషిని కరిచి చంపుతుంది— అదే విచిత్రం...''

''తరువాత యేం జరిగింది...''

"మామయ్య చెప్పినట్టేఅయింది. కక్ష కొద్దీలోకాన్ని కరవాలనుకుంది..తద్వారా తనకు సుఖం, శాంతి లభిస్తాయను కుంది...''

అనసూయ లేచి టేబిల్ మీద వున్న బుక్ తెరచి వో వుత్తరంతెస్తూ అంది... "నిన్నటిరోజు వుత్తరం వ్రాసింది... ఇందుమతి ఆఖరి వుత్తరం యిదేనేమో బహుశా..."

చలపతి వుత్తరం అందుకుని విప్పాడు...అక్షరాలుకూడా అందంగానే వున్నాయి... సిరా మాత్రం కాంతిలేక నీళ్లువారినట్లుగా అన్పిస్తోంది...

''చిన్నప్పటినుంచీ నన్ను నేను అభిమానించుకుంటూ పెరిగాను అనసూయా.. అలాగే అందరూ నన్ను ఆదరించాలనుకునేదాన్ని... అందుకే అందరిమధ్యా తిరిగేదాన్ని...యెదిగేటప్పటికి నన్నూ, నా అందాన్నీచూసి యెవరైనా ప్రేమించి పెళ్ళిచేసుకుంటే చాలనిపించేది. నా కోరిక వింతగా వుందికదూ... యిదో వెర్రితనం అంటావ్ నువ్వు— కానీ ఖర్మ— నా ఆశ అది— నన్నుచూసి, నువ్వుకావాలి నాకు— అనే మనిషికి ప్రాణం యివ్వాలనిపించేది... దానికోసమే పాతిక సంవత్సరాలు యెదురుచూశాను... కానీ నాకు మిగిలింది నిరాశే అయింది... నాలో లోపంలేదు... అందుకే వెర్రికోపం... యెవరినో కాటువెయ్యాలని నాకు జీవితంలో విలాసాన్నీ, తృప్తినీ యివ్వని యీ అందం మీద కక్ష కలగడం మొదలు పెట్టింది... పెళ్ళిచేసుకున్నాను... కానీ అక్కడా వోడిపోయాను... నా అందం నాకు శత్రువు...మనసు నన్ను మోసగించింది... జీవితంలో నేను యీ రోజుకి పూర్తిగా వోడిపోయాను... అందుకే యీ నిష్క్రమణ...' 'ఇందుమతి'

ఉత్తరం ముగించాడు. చలపతి...

"కోరికలు చాలా చిత్రమయినవి అనసూయా...తీరనంతకాలం వేధించుకు తింటాయి...తీరా కోరికలు తీరుతూంటే మనల్ని మనమే తెల్సుకోలేం ... వో రకమైన మానసిక అసంతృప్తే దీనికి కారణమేమో..." ఆగి అన్నాడు భానుమూర్తిగారు...

"నాకు చిన్నప్పుడు మిఠాయి దుకాణంలో కూర్చున్న యజమానిని చూస్తే వెర్రికోపం పుట్టుకొచ్చేది ... అణా పట్టుకొని వెడితేగాని మన్ని దరిదాపుకి రాని వ్వడువాడు ... వాడుమాత్రం మహారాజులా చుట్టూ రకరకాల పదార్థాలమధ్య కూర్చుంటాడు ... వాడ్ని చూసినప్పుడల్లా నేనూ వో మిఠాయి దుకాణం పెట్టాలని ఆశపడేవాణ్ణి..."

''మావారికికూడా యిష్టం మిఠాయి అంటే ... యిప్పుడయితేమాత్రం పెట్టొచ్చుగా...''

భానుమూర్తిగారు చిన్నగా నవ్వి ... ''వుండబట్టలేక వోరోజు అడిగేశాను...' 'మరి నువ్వు యిన్ని పదార్థాల మధ్య కూర్చుంటావు...వాటినెప్పుడూ కనీసం తినాలనిపించదా తినవా'' అని.

'ఛా ఛా ... యివంటే అసహ్యం నాకు' అన్నాడు—వాడు.

'యేం? ఆకలివేసినా యెంగిలిపడవా' అన్నాను నమ్మకంలేక...

'తిన్నండీ ... అంతగా ఆకలివేస్తే యింటికివెళ్ళి, మా యింటిది చేసిన సరుకులు తింటాగానీ, యివి చూస్తూంటే నాకు వున్న ఆకలికూడా చస్తుం'దంటూ గల్లా పెట్టిలోంచి వో పొట్లంవిప్పి అందులో చేగోడీలు రెండునోట్లో వేసుకుని నవలడం మొదలుపెట్టాడు ... అప్పుడే నాకు జీవితం అంటే అర్థమయింది అనసూయా...''

''యేమిటి— భూమి గుండ్రం, చేగోడీ గుండ్రం అనా...''

''కాదు...జీవితం—దానిపట్ల ఆశలు, ఆశయాలపట్ల సుముఖత ... కక్షలూ, కోరికలూ—అన్నీనావే అనుకునే అహం— యిదంతా వట్టి అభూతకల్పన అన్పించింది ... కోరికలన్నవి మితంగా లేకపోతే మనంకూడా ఆ అంగడి



''పోలీస్‌అబ్బాయ్ ! చూడు, మరే, మరే, నేను లేకుండా మా అమ్మ వెళ్లింది, మరి నువ్వు చూశావా ఎటు వెళ్లిందో ?''

వాడి మనస్తత్వంతో సమానమయిపోతాం ... ఆకలివేసినప్పుడు వో అణా పట్టుకుని ఆశతీర్చుకోవడం వుత్తమం గానీ — అత్యాసతో పెద్దదుకాణం పెట్టాలనుకుంటే మనకూ ఆ నిస్పృహ — ఆ ఏహ్యాభావం కల్గితీరతాయి...తిరిగి బ్రతుకు అణాతోతీరే ఆశే కావాలంటుంది. దొరకనిదానికోసం వెదుకులాడ్డం, దొరికినవాటితో అసంతృప్తి, చీదర సృష్టించుకోవడం మనిషిరూపం — ''

''అయితే మనసు బాధపడుతున్నది— యెందుకంటారు...'' చలపతి తీక్షణంగా అడిగాడు.

''యెందుకా? అదోజబ్బు...మనిషిని పూర్తిగా తయారుచెయ్యకుండా భగవంతుడుకొన్ని అల్పత్వాలతో వదిలేశాడు. మనుషులు, యెన్ని అడుగులు యెత్తుగా

యెదిగినా మానసికంగా యెప్పుడూ పసి వాళ్ళే.. తల్లి కన్పించిందంటే ఉయ్యాల్లో ఊగుతున్న పసివాడు కేర్‌మని యేడ్వడం మొదలు పెడతాడు... సరే కదా అని ఆ తల్లి ఉయ్యాలదించి యెత్తుకున్నా, లేక కింద దించినా యేడుస్తూనేవుంటాడు... ఆవిడ విసిగి యే బొమ్మో చేతికిచ్చి ఉయ్యాల్లో కూచోబెట్టి వో ఊపు ఊపి వెళ్ళిపోతుంది... ఆ ఉయ్యాల వోపిక వున్నంతసేపు ఊగుతుంది.. తిరిగి వాడు స్వశక్తితో కుదుపుకుంటేగాని అది కదలదు... ఆ పనిచేలకాదు... అంతగా తడబడుతూలేస్తే పడిపోతామని భయం— దాన్తో తిరిగి యేడుపు మొదలవుతుంది.. చలపతీ... జీవితం యెవరో ఊపితే ఊగేదే... యెప్పుడూ యెవరో ఊపా లనే కోరుకుంటుంది... అలా ఊపు తూంటే బాగానే వుంటుంది... కానీ మనం ఊపుకుని ఊగడానికి బాధపడతాం తప్ప ప్రయత్నం చెయ్యలేం ...... ఇందుమతి బ్రతుక్కూడా అంతే...తనకు తానుగా ఊగలేదు ... అది సాధ్యం కాలేదు... యెవరో ఊపాలి. ఆ క్షణం వరకూ వోపిక పట్టలేక కాళ్లతడబడి నైరాశ్యంలోకి పడిపోయింది...''

హాల్లో గడియారం పదిగంటలు కొడుతూ ఆవలించింది...

''నే వెళ్ళి పడుకుంటాను'' అన్నాడు భానుమూర్తిగారు.

''ఆ గదిలో వేశాను పక్క'' అంది అనసూయ...

''కొంచెం టీ కలిపి తీసుకురా అన సూయా...తాగి పడుకుంటారు''అన్నాడు చలపతి...

''వద్దు...ఆరోగ్యం చెడుతుందని మీ అత్తయ్య ఆ అలవాటు మాన్పించింది'' అన్నాడు కుర్చీలోంచిలేస్తూ.

అనసూయ లోపలినుంచి టీ తీసుకు వచ్చి భర్తకిచ్చింది..చలపతి టీ తాగుతూ అన్నాడు....

''మీ మామయ్యగా రంటే యేమో అనుకున్నాను. పెద్దవేదాంతం వుంది మనిషిలో''

''ఇవన్నీ ఒకళ్ళకి చెప్పడానికే పనికివస్తాయి...మా అత్తయ్య పాపం.. యెన్నోబాధలు అనుభవిస్తోంది యీాయన గారితో...''

''అదేం...''

''అసలు — మామయ్య చదువుకునే రోజుల్లో క్లాస్‌మేట్‌ని ప్రేమించి చాలా దూరం వెళ్ళాడు...అత్తయ్యని యేలుకో న్నాడు ... ఆఖరికి నలుగురూ చివాట్లు పెడితే, యేం చెయ్యలేక వూరు కున్నాడు...''

''ఇంకేం ఘటికులే...''

''ఆయన్ని కాలం ఊపిన ఉయ్యాల్లో కట్టిపడేశారని కోపం'' అనసూయ నవ్వింది...తిరిగి అంది...



"కొత్తచోటు భయంగా ఉందండి, దొంగగాని వస్తాడేమో?"
"భయ మెందుకు, నువ్వు లేచి నుంచో, వాడే పారిపోతాడు."

"ఓ సారి ఆ ప్రియురాల్ని యింటికి తీసుకువస్తే తలబాదుకుని యేడ్వడం మొదలుపెట్టిందిట ... యీ యనగారు కోపంలో కొడతాడు...అత్తయ్య అందరికీ వ్రాసి గోలచేసి నోరు మూయిస్తూ వుంటుంది..."

"మరి వొకళ్ళ నొకళ్ళు అర్థంచేసుకున్నా మంటారు..."

"లోకం మెప్పుకోసం...మగవాడు కదా ... ఆధిక్యత యెప్పటికప్పుడు చూపించుకోవడానికి...మరోసారి నిరూపించుకుందుకూ..." అనసూయ అలా అని లోపలికి వెళ్ళిపోయింది...

చలపతి వొక్కసారి కళ్ళు పెద్దవి చేసి చూసేటప్పటికి అనసూయవీపు — ఆ వీపుమీద అల్లుకున్న నక్షత్రాల్లాంటి పూల జాకట్టు — వెలుతురుపడి జారిపోతున్న జాకెట్టుక్రింది నడుం భాగం కన్పించాయి...

చలపతి చప్పున కళ్ళు మూసుకున్నాడు...ప్రభావతి కన్పించింది ... మనసు మాట్లాడుతోంది పరాకుగా ...

"నా లేమితనం మూలంగా నిన్ను నేను పోగొట్టుకున్నాను ప్రభావతీ ... నా అర్థాంగిగా నువ్వు నిలబడవలసిన స్థానంలో అనసూయ చోటుచేసుకుంది.. నా పెళ్ళి — యీ సంసారం—యిదో మజిలీ లాంటిది నాకు ... తిరిగి యెప్పటికో అప్పటికి యాత్రికుడు గమ్యస్థానానికి చేరుకోవాలికదా....అప్పుడు...వెన్నెల పహరాకాస్తున్న వాకిట్లో ... యిద్దరం కలిసి బ్రతుక్కి రెండోవైపేముందో

తెల్సుకుంటాం...యిది చీకటి...యేనాటి కైనా వెన్నెల రావాలి...వస్తుంది ... అంతవరకూ యీశాపం..."

నిశ్శబ్దం చలపతిని భరించలేక కోపంతో అనసూయ దగ్గరకు పరిగెత్తింది...

మరత మంచంమీద వత్తిగిలి పడుకున్న అనసూయ చెంపకి వెన్నెల సింగారం పూస్తోంది. జడలోంచి చెవివరకూ జారిన మల్లెలు గుసగుసలు చెబుతున్నాయి...

"బావా... నిన్ను నేను కాదనలేదు... అలా అంటే నా జీవితానికి అర్థంలేదు... నువ్వు రాకుండానే, నన్ను చూడనివ్వకుండానే యీ పెళ్ళిచేశారు... అడ్డుకుందుకు అశక్తురాల్ని... నువ్వన్నట్టు ఆడదాని అబలత్వం వివాహ నిశ్చయంలోనే బయటపడుతుంది! సంసారం చేసుకుంటూ యీ చింత పెట్టుకోవడం తప్పని సావిత్రి వుత్తరాల్లో వ్రాస్తోంది... యెలా సాధ్యం శేషూ అది... అన్యాయంగా ఖైదులో పడ్డ వ్యక్తి పరాకుగా కూడా అది నా యిల్లు అనుకోలేదు... జైలుశిక్ష అనంతరం తన యిల్లుని వూహించుకుంటే అది తప్పా... యీ ఖైదులోనే నేను చచ్చిపోతే... నీ మనసులోంచి వొక్క నిట్టూర్పు... నీ కోసం వెలిగి ఆరిపోయిన యీ అనసూయ కోసం వొక్క వోదార్పు అందిస్తావని తెలుసు... మా మయ్య అన్నట్టు యీ నాడు జీవితంలో కాలం ఊపి వదిలిన ఉయ్యాల్లో ఊగుతున్నాను ... అది ఆగిపోకుండా రా.. లేకపోతే నేనూ............

నిశ్శబ్దం నేలకరుచుకుని పడియేడుస్తోంది...

కాలం తెగ్గొట్టుకుని ఊపే ఉయ్యాల్లో చంద్రుడు జోగుతున్నాడు...

చీకటి ఆకాశాన్ని కౌగలించుకుంటోంది...

మేఘాలు నక్షత్రాల్ని ముద్దుపెట్టుకుంటున్నాయి...



---

## సినిమా క్విజ్ - జవాబులు

*1.* మొదటి రాత్రి

*2.* పెళ్లిచేసి చూడు

*3.* దొంగలున్నారు జాగ్రత్త



# యువతీలోకం



## ప్రముఖ భారత మహిళలు

### గాంధారి

భారత జీవనంలో మహాభారతమున కున్న సంబంధం అమూల్యమయి నటువంటిది. వివిధ అభిరుచులుగల వారికి మహాభారతం నచ్చినంతగా మరో మహాకావ్యం నచ్చుతుందనుకోను. జీవితానికి సుస్పష్టమైన, సమగ్రమైన దర్పణం వంటిదీ కావ్యం. బ్రతుకులోని ఏ సందర్భానికయినా సరిపోలగల సంఘటనలెన్నో ఈ గ్రంథంలో ఉన్నాయి.

మహర్షి కృష్ణద్వైపాయనులవారు, తమ గ్రంథాన్ని ప్రారంభించుతూ, ప్రప్రథమంగా చిత్రించిన పాత్ర గాంధారి. ఈ పాత్రపట్ల వ్యాసమహర్షుల వారికి కూడా ప్రత్యేకమైన అభిమానమున్నదేమో ననిపిస్తుంది!

మహాభారతంలోని, మహోదాత్త చరితల్లో గాంధారి ఒకటి. ధర్మనిర్ణయం పట్లనూ, న్యాయ నిర్ణయంపట్లనూ, ఆమెగారు సామాజిక ప్రభావానికి అతీతంగా వ్యవహరించేది! బంధుత్వంగానీ, వ్యక్తులమధ్యగల సంబంధాలుగానీ, ఆమె సచ్ఛీలతను, సత్యప్రేమిత్వాన్ని చలింపచేయలేకపోయాయి. ఆమె జీవితం సుఖంతో ప్రారంభమయి, పుత్రశోకంతో ముగిసిపోయింది.

గాంధారి తండ్రిపేరు సుబలుడు. ఇతను వాయవ్యభారతంలోని గాంధార రాజ్యానికి అధిపతి. కురుచక్రవర్తియైన ధృతరాష్ట్రునికి తగిన సంబంధం వెదకాలన్న ఉద్దేశంతో భీష్మాచార్యులు వివిధప్రాంతాలకు బ్రాహ్మణులను పంపించాడు. వారిలో కొందరు గాంధార రాజ్యానికి వెళ్ళి సుబలుని సందర్శించి వచ్చారు. భీష్ముడు, వారిద్వారా అన్ని విషయాలనూ తెలుసుకొని, ధృతరాష్ట్రునికి అన్నివిధాలా తగిన వధువు గాంధారియే నని నిర్ణయించుకొన్నాడు. ఒక శుభ ముహూర్తాన బ్రాహ్మణులను పిలిపించి, తన నిర్ణయాన్ని వారికి తెలియపరచాడు.

---

*కంఠంనేని ఉషాదేవి*

ఈ రాయబారంపట్ల సుబలునికి ప్రప్రథమంగా ఎటువంటి సదభిప్రాయ మూలేదు. పుట్టంధుడైన ధృతరాష్ట్రునికి తన కూతురు నివ్వడానికి సుబలుడు అంగీకరించలేదు. కానీ, రాయబారుల పైదుష్యంవల్ల అతను అంగీకరించాడు. ఇందుకు మరో కారణంకూడా ఉన్నది. మహారాజ వంశాలలో వొకటైన కురు వంశంతో తను వియ్యమందగలగడం వలన, తన రాజ్యానికికూడా, భద్రత రక్షణలు అధికమవుతాయని సుబలుడు అనుకొన్నాడు.

మాతికలవలన ఈవార్తవిన్న గాంధారి తండ్రి నిర్ణయాన్ని మన స్ఫూర్తిగా అంగీకరించింది. ధృత రాష్ట్రునికి 'దృష్టి' లేదని విన్నది. తన భర్తకులేని దృష్టి తనకుకూడా ఉండ రాదనుకొన్నది, అప్పటినుండే తను సైతం కృత్రిమంగా అంధత్వాన్ని కొని తెచ్చుకొన్నది. కళ్ళు కనపడకుండా. ఒక పట్టీని ధరించసాగింది. జీవితాంతం వరకూ, గాంధారి ఆ పట్టీని విడువలేదు.

గాంధారికి నూర్గురు పుత్రులు జన్మించారు. వారిపై ఎన్నో ఆశలను పెట్టుకొన్న దా తల్లి. కానీ, ఏ వొక్కరూ, ఆమె ఆశలను సఫలీకృతం చేయలేదు. సహోదరతుల్యులైన పాండవులపట్లతన పుత్రులు ప్రవర్తించే విధానాన్ని ఆమె ఏనాడూ ఆమోదించలేదు. అనేకసార్లు, మహారాజుతో, బిడ్డల దుష్టప్రవర్తనను గురించి అభియోగం చేసింది. వారిని అదుపులో ఉంచవలసిందిగా కోరింది.

ధర్మరాజు జూదంలో తన సర్వస్వాన్ని కోల్పోయాడు. ఆఖరుకు ద్రౌపతిని కూడా అతను పందెమొడ్డి వోడిపోయాడు. సభయావత్తూ కౌరవుల పక్షాన ఉన్నది. గాంధారి మహారాజును కలుసుకొని, ఈ జూదం న్యాయబద్ధం కాదని ప్రకటించవలసిందిగా ప్రార్థించింది. కౌరవ వంశానికి మాయనిమచ్చగా దుర్యోధనుడు తయారవుతున్నందుకు ఆమెగారెంతయు క్షోభించిపోయారు.

అలాగని ఆమెకు బిడ్డలమీద ప్రేమ లేదనుకోవడం న్యాయంకాదు. బిడ్డలెంతటి క్షుద్రులయినా, వారిని తల్లి ప్రేమించకుండా ఉండలేదు. మాతృప్రేమ, బిడ్డల దుష్టవర్తనపట్లగల అసహనం — వీటి మధ్య గాంధారిహృదయం వ్యధాకులిత మయిపోయింది. కన్నబిడ్డలను పరిత్యజించనూలేదు; వారి క్షుద్రప్రవర్తనను ఆమోదించనూ లేదు.

గాంధారి శాంతిప్రియ. యుద్ధమంటే ఆమెకెంతో ఏవగింపు యుద్ధం ఏ సమస్యనూ పరిష్కరించదని, ఆమెగారు దుర్యోధనునికి హితబోధ చేసింది. అవేవీ అతని చెవికెక్కలేదు. యుద్ధం అతని పాలనావిధానాలలో వొకటి. రాయబారాలు విఫలమై యుద్ధం ప్రారంభమయింది.

యుద్ధసన్నద్ధుడై వెళ్ళబోయే ముందు, దుర్యోధనుడు తల్లికి నమస్కరించి,

ఆమె ఆశీర్వాదాన్ని పొందేవాడు. గాంధారి ఏమని దీవించాలి? యుద్ధంలో విజయిపై తిరిగిరమ్మని ఆశీర్వదించాలా? కొడుకు చేస్తున్నది ధర్మయుద్ధంకాదు. అపజయం పొందాలనుకోవడం, తల్లిగా ఆమె కతీతమైన స్థితి. పరస్పర విరుద్ధాలైన ఈ శక్తులమధ్య ఆమెనలిగిపోయింది. పుత్రప్రేమకన్నా, ధర్మమే అధికమని ఆమె విశ్వాసం "ధర్మం జయించుగాక" అని దీవించి పంపేది.

యుద్ధంలో నూర్గురు కొడుకులు నామరూపాలులేకుండాపోయారు. పాండవులు విజయులయ్యారు. పుత్ర దుఃఖంతో కుసులారిపోతున్న గాంధారిని, పాండవులు, ద్రౌపది, కుంతీదేవికూడా ఎంతో ఆదరంగా చూశారు. ఈ పుత్రశోకాన్ని 16 సంవత్సరాలపాటు హస్తినాపురంలో ఉండి భరించిందామె. ఆ తరువాత, భర్తతోనూ, విదురుడు, సంజయుడు, కుంతీదేవితోనూ కలిసి హిమాలయాలకు వెళ్ళిపోయింది.

హస్తినాపురినుండి వెళ్ళేరోజున బ్రహ్మాండమైనసభజరిగింది. ధృతరాష్ట్రుని తరువాత, గాంధారి మాట్లాడింది. తన నూర్గురబిడ్డల పాపకార్యాలను ఆమె బయటపెట్టింది. వారిని మన్నించవలసిందిగా కోరింది.

ముందుగా కుంతీదేవి, ఆమె భుజాలపై చేతులువేసి గాంధారి, ఆమె వెనుక ధృతరాష్ట్రుడు, రెండుప్రక్కలా విదుర సంజయులు, హిమాలయాలకు బయలుదేరారు. హస్తిపురివాసులు వీరి నిష్క్రమణను చూసి, తల్లిలేని పిల్లలలాగా రోదించారు.

హిమాలయారణ్య సీమలలో కొంతకాలం ఉన్నారు. ఒకసారి కార్చిచ్చువారిని అలముకొన్నది. వారుభయపడలేదు. తప్పుకోవడానికికూడా ప్రయత్నించలేదు. అందరూ అందులో కాలిపోయారు. ఆ క్షణానకూడా గాంధారికళ్ళకు గంతలున్నాయి, ఆక్షణానకూడా ఆమె 'దృష్టి'ని కోరుకోలేదు.

గాంధారి జీవితం ధర్మసంఛన్నమైనది. సచ్ఛీలతకు ఆమె మచ్చుముక్క. బ్రతుకులోని వెలుగునీడలు, సుఖదుఃఖాలు, అల్లిబిల్లిగా అల్లుకుపోయాయి. అయినా ఆమహాసాధ్వి రూపచిత్రం స్వర్ణకాంతులతో, జేగీయమానంగా ప్రకాశిస్తూ కలకాలం మన మనోప్రపంచంలో ఉండిపోతుంది.



# ఆర్థికంగా స్త్రీ

—రమాదేవి—

కాలం ఎప్పుడూ ఒకే మాదిరిగ నడవదు. దేశ కాలపరిస్థితుల ననుసరించి న్యాయశాస్త్రమూ, ధర్మసూత్రాలూ మార్పులు చేర్పులతో విస్తృతపడుతూ రావడం సహజం.

"హిందూధర్మశాస్త్రం కేవలం భగవత్ కల్పితం. దానిని పవిత్ర హిందూ మతాన్నుంచి వేరుచేసే హక్కు ఎవరికీ లేదు" అని కొందరు ఎప్పుడు ఎలాంటి మార్పులు జరిగినప్పటికీ అడ్డుపడుతూ వచ్చినా, వాటిని అధిగమించి అవసరాన్ననుసరించి తనని తాను విశాలపఱచుకుంటూనే వస్తోంది హిందూధర్మశాస్త్రం. ధర్మశాస్త్రం ఒకప్పుడు సంకుచితంగా ఉంది, ఒకప్పుడు విస్తృతపడిందీ అనే కంటే దానిని చేపట్టి వ్యాఖ్యానించిన వారి మనస్తత్వాల్నిబట్టి తనని తాను మలుచుకోవలసివచ్చింది అని చెప్పవలసి వస్తుంది.

వితంతువు దుస్థితిని గుర్తించి ప్రభుత్వం చివరికి ఎలాగో వారికి భర్త ఆస్తిలో జీవితకాలపు హక్కు లభించేటట్లుగ చట్టాన్ని రూపొందించింది అనుకుంటే, దానివల్ల వితంతువుకు మరికొన్ని కష్టాలుకూడా సంక్రమించాయి. ఆవిడ చావుకోసం ఆతృతగా ఎదురుచూసే దాయాదులు కొందరయితే, అంతవరకూ ఓపికపట్టలేని మరికొందరు ఆవిడ్ని కల్లబొల్లి కబుర్లతో నమ్మించి; మరి కొందరు భయపెట్టి ఎలాగో ఆ ఆస్తిని ఆవిడ జీవితకాలంలోనే తమపేరిట రాయించుకోవడం సాగించారు. అందుచేత జీవితకాలపు హక్కులస్థానే భర్త ఆస్తిపైన సంపూర్ణ హక్కులు వితంతువుకు లభిస్తేనేకాని ఆవిడ ఆర్థిక సమస్య తీరేటట్లు కనపడలేదు.

అంతేకాదు. కొడుకు, కూతురు ఒకే కడుపున పుట్టినా, తలిదండ్రుల ఆస్తికి కొడుకొక్కడే వారసుడు కావడం, కూతురుకి వారసత్వపు హక్కులేక పోవడంలో న్యాయం కనిపించదు. దానికి కొందరు పెద్దలు చెప్పే సాకులేమిటంటే, "వేలకు వేలు కట్నాలు తీసుకుని పెళ్ళి చేసుకుని వెళ్ళిపోయే కూతురికి ఇంకా తండ్రి ఆస్తిలో భాగమేమిటి?... పోనీ భాగమిచ్చినా దానిని నిజంగా చెప్పు

చేతలలో పెట్టుకునేది ఎవరో పరాయి వాళ్ళకు పుట్టిన అల్లుడేకదా! అలా కుటుంబపు ఆస్తి పరోక్షంగానైనా ఇతరులకు పోవలసిందేగా...అంతేకాకుండా ఈ ఆస్థి తగాదాలతో సోదరీ సోదరుల మధ్య కలతలేర్పడి వాత్సల్యం రూపుమాసిపోతుంది. ఎలాంటి కష్టాలలోనైనా ఆడబిడ్డకు తన అన్నదమ్ముల అండ ఉందనే భరోసా ఉంటుంది సహజంగా. అలాంటి అండ కూడ కరువవుతుంది ఆడపిల్లకూడ వాళ్ళతో పోటీగ వాటా తీసుకుంటే" అని.

అయితే వారి వాదనలో సత్యం కనపడదు. ఆడపిల్లలకుకూడ మొగపిల్లలతోపాటు ఆస్థిలో సమంగా వాటాపంచి ఇవ్వడం జరిగితే ఇక వేరే కట్నాల సమస్య ఉండదు. వారి వాటాయే వారి కట్నం అనుకోవచ్చు. అంతస్థుకు మించిన హంగులకుపోయి కట్నాలిచ్చి ఇల్లు గుల్లచేసుకునే అవస్థ తలిదండ్రులకి తప్పుతుంది. ఆస్థి పంపకంలో వాటా పొందినంత మాత్రంచేత ఏ చెల్లెలూ అన్నకి శత్రువు అయిపోదు. అల్లుడు పరాయివాడనుకోవడానికి, తమ పిల్లను పెండ్లిచేసుకోవడానికి అర్హుడయినవాడు, కూతురు ఆస్థిని కూతురితోపాటు అనుభవించడానికి మాత్రం పరాయి వాడెలా అవుతాడు?

ఇలా వాదోపవాదాలు సాగుతూనే ఉన్నాయి. 1956 లో (కొత్తచట్టం) వారసత్వపు చట్టం అమలులోకి రావేవచ్చింది. ఈ చట్టప్రకారం తండ్రిఆస్థిలో కొడుకుతోపాటు కూతురికీ సమాన హక్కుంది. వితంతువుకు భర్త ఆస్థిలో సంపూర్ణ హక్కులు లభించాయి. కొడుకుతోపాటు తల్లి, భార్యా, కూతురికి కూడా సమాన వాటాలు లభించాయి; ఈ చట్టం ఒక విధంగా వారసత్వంలో విప్లవాన్ని తీసుకువచ్చిందనే చెప్పాలి. అంతకు పూర్వం వారసత్వానికీ, వితంతువు సత్ప్రవర్తన, సత్శీలానికి సంబంధం ఉండేది. ఇప్పుడా ముడి విడివడింది. వితంతువు, ఆస్థిపంపకం క్లైముకి తిరిగి పెండ్లిచేసుకోకపోతే ఆస్థిలో హక్కును కలిగిఉంటుంది. ఆ తరువాత తిరిగి పెండ్లిచేసుకున్నప్పటికీ తన పూర్వపు ఆస్థిలో హక్కుని కోల్పోదు.

చట్టాన్ని నిశితంగా పరిశీలించిచూస్తే ప్రేమ, ఆప్యాయతల నాధారంచేసుకునే ఈ చట్టాన్ని నిర్మించారని అనిపిస్తుంది. కొడుకులు లేనప్పుడు, కడుపున పుట్టి తలిదండ్రుల ప్రేమాభిమానాలను చూరగొని, వాత్సల్యాన్నిచూపే కూతురికి తమ ఆస్థి చెందకుండ, ఎవరో దూరపు దాయాదులకు చెందడంలో అర్థం కనిపించదు. అలాగే తన కష్టసుఖాలలో పాలుపంచుకొని; తానే సర్వస్వంగా నమ్మి సేవచేసిన భార్య తన ఆస్థిని అనుభవించకుండా మరెవరో దానిని అనుభవించడంలోనూ న్యాయం కన

పడదు. ఈ సూత్రాన్ని గమనంలో ఉంచుకునే ఈ చట్ట నిర్మాణం జరిగిందనడంలో సందేహంలేదు.

అన్ని రంగాలలోను స్త్రీ పురుష భేదంలేకుండ సమానహక్కులు, సమాన అవకాశాలను అందరికీ కల్పించడం మన రాజ్యాంగచట్టధర్మం. ఆధ్యేయాన్ని గమనంలో ఉంచుకునే మన ప్రభుత్వం ఈ క్రొత్తచట్టాన్ని అమలులోకి తెచ్చింది.

అయితే 'ఈ చట్టం ఎంతవరకు ఆచరణలోకి వచ్చింది' అంటే; ప్రస్తుత పరిస్థితులను పరికిస్తే ఎక్కువగా దానిని ప్రజలు అనుసరించడంలేదనే చెప్పాల్సి వస్తుంది. అందరికీ సమాన అవకాశాలను, సమానహక్కులను కల్పించడం ప్రభుత్వధర్మం. వాటిని గుర్తించి, ఆచరణలో పెట్టుకొని, అనుభవించడం ప్రజలకర్తవ్యం. అందుచేత ప్రభుత్వం అమలుజరిపేచట్టాల కనుగుణంగా ప్రజలలో భావసంచలనం కలిగితేనే వాటి నిర్మాణానికి అర్థం గోచరిస్తుంది. లేనప్పుడు చట్టంరూపంలో న్యాయధర్మం తనస్థానంలో తను చెక్కు చెదరకుండా నిలిచిఉంటుంది. సంఘంలో దురాచారాలు దురన్యాయాలు వాటితోవన అవి విశృంఖల విహారం సలుపుతూ ఉంటాయి. చట్టానికీ, ఆచరణకీ సమన్వయం కుదిరినప్పుడే ప్రజాస్వామ్యం నిరాటంకంగా సాగిపోతుంది. అసలు క్రొత్తచట్టం విషయంలో పురుషుడు బాధపడవలసింది మాత్రం ఏముంది? తనతోపాటుగ ఆస్తిని పంచుకునేది మాత్రం ఏ పరాయివారు కనుక! తన తల్లి, తన భార్య, తన కూతురు, తన అక్కచెల్లెళ్ళేకదా! తనకు జన్మనిచ్చిన తల్లిసౌఖ్యం తనదికాదా? తన కష్టసుఖాలలో పాలు పంచుకొని, ప్రేమానురాగాలతో తనని మైమరపించే భార్య తన ఆస్తిని అనుభవించడానికి తగదా? తన కడుపున పుట్టిన కూతురు ముద్దుముచ్చట్లు తనవికావా? 'ఇది నా తండ్రి ఇచ్చిన ఆస్తి' అని గర్వంగా చెప్పుకుంటే అది తనకు మాత్రం గౌరవంకాదా? తనతో పాటు రక్తాన్ని పంచుకొనిపుట్టే తన అక్కచెల్లెళ్ళు తనతోపాటు ఆర్థికంగా సౌఖ్యపడడానికి వారు నోచుకోలేదా? అందుచేత పురుషుడు తన ఆస్తిలో ఎవరో కొంతభాగం ఎత్తుకుపోయినట్టుగ బాధ పడనవసరంలేదు. అదే విధంగా స్త్రీలు కూడ తమకీ పురుషునితోపాటు వారసత్వపు హక్కు ఉందికదా అని ప్రేమ మమతల్ని త్రెంచుకొని కేవలం ప్రాణానికీ, ఆస్తికీ లంకెపెట్టుకొని బ్రతకవలసిన అవసరంలేదు. ఆస్తి ఆర్థికావసరాలను తీర్చడానికే స్త్రీకైన, పురుషునికైన ఉపయోగపడాలి. అంతేకాని స్త్రీ పురుషుల మధ్యకాని, మనిషికీ మనిషికీ మధ్యకాని మాత్సర్యాలను పెంచడానికి ఉపయోగపడకూడదు.



# పెరుగుదల

రోజులు గడిచినకొద్దీ దాంపత్యంలో గూడ ఎంత మార్పొస్తుంది! పెళ్ళయిన కొత్తలో మొగవాడు మహా జబర్దస్తీగా వుంటాడు. స్త్రీ మొదట్లో లొంగినట్లుండి, లేదా నటించి చివరకంతా తన చిటికెన వేలితో నడిపిస్తుందట. రోజులుగడిచాక భర్తనుగూర్చి ఆమాత్రం శ్రమాపడదు. కనుసైగలతోనే పనంతా చేయిస్తుంది. స్త్రీ గదిలో ఎటుచూస్తే అటు పరుగెడుతూ (ఏదో పనివుందేమోనని), విధేయతతో ఆమెకేసి చూడడమదీ వూహించితే నవ్వురావొచ్చుగాని, పురుషుడు ఏవో ఆశల్తో, లేక కనీసం, కారణముందనే సాకుతోనైనా కనుసన్నలలో మెలగడం మాత్రం ఖాయం.

మరి వివాహమయిన కొత్తలో ఒకళ్ళదీ, రోజులు గడిచాక మరొకళ్ళదీ ప్రభావమనుకుంటే, 10,15 సంవత్సరాల తర్వాత ? అదిపరిపక్వదశ అనవచ్చునా? ఏమో మరి! ఏ దశలో అనుభవాలు, అందం ఆదశవే. మరి వార్ధక్యంవస్తే అప్పటి అనుబంధాలు మరింత బాగుండ వచ్చేమో — దానిక్కారణం ఇప్పుడను భవించాలనే కోరిక లేకపోవడమేగాక, చిన్నప్పటి అనుభవాల స్మృతులూ, పెద్దప్పటి అనుభవాలూ అన్నీ కలిపి మరింత బాగుందొచ్చు. ఈ భావం వార్ధక్యచిహ్నం కాదుగదా ?

వార్ధక్యం అంటే చిన్నవాళ్ళ మనస్తత్వం అర్ధంగాని దశా, లేక 50 ఏళ్ళ తర్వాతికాలమా ? వయసొచ్చిన పెద్దవాళ్లు కొందరు గుర్తొచ్చి వాళ్ళనెట్లా పెద్దవాళ్ళ నాలో తెలీలా సుబ్బారాయుడి షష్టికి పుట్టలో పాలుపోయడానికి వెళ్ళే స్త్రీలను చూసి "పిచ్చివాళ్ళు, పుట్టలో పాలుపోస్తే ఏమొస్తుంది, ఇంటిదగ్గర బిడ్డలకు నిండా పాలిచ్చేదానికి" అనే మాతాత, ఏ పెళ్ళికి వెళ్ళినా కుర్రవాళ్ళ దగ్గరకన్నా ఆయన చుట్టూ జనం మూగుతారు ఆయన చలోక్తులు వినేందుకు.

అలాగే, మా 'గోరె' నాన్నగారెప్పుడూ తనని మందలిస్తూండేవారట —

— టి. కృష్ణాబాయి

స్థిరంగా వుండదని – ఆయన దగ్గరున్న అమిత గ్రంధసంచయం నుండి చలం 'బిడ్డలశిక్షణ' ఓసారి ఆతండ్రి చేతి కొచ్చింది. అది చదివినాయన భార్యతో అంటున్నాడట, "ఓసి పిచ్చిదానా, ఎందుకే బాధపడతావ్. ఇన్నాళ్ళూ వాడిని దిద్దగల మనుకునేవాడిని. వాడిదో పుస్తకం చదివాను నిన్న. వాడిని మనం అదుపులో పెట్టడంవల్లకన్నా వాడికి నచ్చినపనులకే వదిలేస్తే, దానిలోనే వాడు పెరగొచ్చు'' అని. మార్పులు వయసు మళ్ళాక రావను కోవడం పొరబాటేమో!

నాన్నగారు మరీను – శరీరంలో వార్ధక్యచిహ్నాలున్నా, మనసు ఎంతకుర్రకారుగా వుంటుంది! వయసొచ్చినా చిన్న వాళ్ళలాగ ప్రవర్తిస్తే అది వుత్సాహం క్రింద జమకడతారాలేక, పెరుగుదల లేక పోవడం కిందా?

ఏదేమైనా ముసలివాళ్లమైనా చిన్నవాళ్ల మనస్తత్వం అర్ధంచేసుకోగలిగితే బాగుణ్ణు. వాళ్ళావయసులో చేసేతప్పుల్ని పూర్తిగా దిద్దలేమనే వివేకమూ అవసరమే. ప్రతి ఒక్కరూ స్వానుభవంతో తప్ప నేర్చుకోరు. ఇతరుల అనుభవం కొందరకే ఉపయోగపడేది. ఒకపని Fatal అని తెలిస్తేనే చేయటానికి జడిసేది, లేకుంటే మా మూ లే. కొన్నిమతాల్లో అంతంత బెదిరింపులుండబట్టే వచ్చేజన్మలో బాధలు తప్పవనబట్టే కొంత వెనకాడడం జరుగుతుంది.

ప్రతిఒక్కరూ స్వానుభవంతోగాని నేర్చుకోకపోవటంవల్లనేమో, సామాన్య మానవుల ప్రవర్తన ఎన్ని యుగాలకీ మారనిది! స్థూలంగా రూపంలో మారినట్లు కనిపించినా వివరాల్లో మాత్రంకాదు. అందుకే ఏ కాలంలోనూ మార్పుకోసం త్యాగంచేసే ప్రవక్తలూ, సమిధలుగా వుపకరించే సంస్కర్తలూ, కొందర్ని చూసి అయినా మారే యువకులూ, మారనే మారమనే మొండిరకం ఉంటూనే వుంటారు. ఇందులో ఏ కోవకు చెందినా నిజమైన తృప్తి ఆత్మనైర్మల్యంతో సాధ్యమే. గుడ్డిగానే కావచ్చు, తానునమ్మినది సంఘానికి హానిలేనిదైతే, ఆచరిస్తే తప్పేముంది? కాని ప్రతిఒక్కళ్ళూ కొద్దికాలం తర్వాతనైనా, వెనుదిరిగి చూసుకుని ఆత్మపరీక్ష చేసుకుంటూంటే ఎదుగుదలకు అవకాశముంటుందేమో!



# నా కాలేజీ అనుభవాలు

మమత

## 1

అతి అమాయకంగా గడిచిపోయింది నా హైస్కూల్ జీవితం. కాలేజీలో చదువుకుంటున్న అమ్మాయిల్ని చూస్తూ ఎంతో ఈర్ష్యపడేదాన్ని. వీళ్ళింత చక్కగా ఎలా మాట్లాడతారా అని ఆశ్చర్యపోయేదాన్ని. దాదాపు కాలేజీ జీవితాన్ని మనసులో ఆరాధిస్తుండేదాన్ని. కాని దిగితేకాని లోతు తెలియదన్నట్లు కాలేజీలోకి వెళ్లినతర్వాత అనిపించింది నేను ఎలాటి అనుభవాలు, అనుబంధాలు కావాలనుకున్నానో అవి లోపించినై. కొత్తగా వెళ్ళినవాళ్ళని చనువుగా పలకరించి సహాయపడేబదులు ఘోరంగా యేడ్పించేవాళ్ళు. మొదట్లో మేము ఏడ్చినా తర్వాత వాళ్ళనే యేడ్పించేవాళ్ళము.

కాలేజీ చాలా అందంగా వుండేది. ఎదురుగా ఫౌంటెన్, గులాబీలు, వెన్నముద్దలు రకరకాల పూవులతో తోట. అక్కడక్కడ నీడలతో చెట్లు, వాటి క్రింద అమ్మాయిలు, వాళ్ళ రంగురంగుల చీరెలు కాలేజీ ఒక సీతాకోకచిలుకలా వుండేది. అమ్మాయిలు అలాటివాళ్ళే. ఒకరోజు ఒకరి ఫ్రెండ్ అయితే ఇంకో రోజు యింకొకరి ఫ్రెండు. రోజుకో లెక్చరరు వెనకాల తిరిగేవారు. అమ్మాయిలు కొందరు ఒక లెక్చరరు వెనకాల తిరుగుతుంటే మిగతా లెక్చరర్సుకి కోపం వచ్చేది. ప్రతి లెక్చరరుకి కొంత మంది ఫేవరేట్స్ వుండేవారు. యింత ధైర్యస్థులుకూడా ఎలక్షన్స్ వస్తే పేరు ప్రపోజ్ చేయడానికి లేవమన్నా లేచేవారు కాదు. ఎవరైనా ప్రపోజ్‌చేస్తే వాళ్ళెళ్ళి "మేం వుండం బాబో" అని పేరు తీసేయించుకునేవాళ్లు. ఆఖరికి ఎలాగో ఎలక్షన్సు అయేవి. నాటకాలు, స్పోర్ట్సులో అందరూ పాల్గొనేవారు.

ఆగస్టు పదిహేనున అనుకోకుండా ఫాన్సీ డ్రెస్ కాంపిటీషన్ పెట్టారు. అందరూ కూచుని టిఫిన్స్ తింటుండగా

ఒకమ్మాయి బిచ్చగత్తె వేషం వేసుకుని వచ్చింది ఎంత సహజంగా వుందంటే టిఫిన్ తింటున్నవాళ్ళు స్వీట్స్ అవీ బిచ్చం వేసారు తీరాచూస్తే 4వ సం॥ B Sc, అమ్మాయి 'ఇల్లరికం' చూసి గాస్ కొడ్తున్నాననుకోకండి పచ్చినిజం

సాయంత్రంఫిజికల్ డైరెక్టరుకి కళ్లు కప్పి యే మూలో కూర్చుని నవలలు, కావ్యాలు చదివేవాళ్ళం సినిమాలమీద విమర్శలు, పాటలు, పద్యాలతో రెండేళ్ళు గడిచిపోయాయి మా ఫేర్ వెల్ పార్టీ నాడు మా సెక్రటరీ మాట్లాడిన మాటలకి లెక్చరర్స్, స్టూడెంట్స్కూడా కంట తడిపెట్టుకున్నారు ఆ రోజే 'కరుణామయి' నాటకం ప్రదర్శించాము అందులో మా క్లాస్మేట్ సవతితల్లి కొట్టినప్పుడు ఏడవాల్సిన సీనులో నిజంగానే ఏడ్చేసింది దాంతో చూస్తున్న అందరి కళ్ళల్లోకి నీళ్ళొచ్చాయి చిన్నచిన్న పోట్లాట లొచ్చినా మాలో ఐకమత్యం వుండేది జీవితం కెలెడియోస్కోప్ తిర్గినట్లు తిరిగి పోయింది ఎలా పాసయ్యామో మాకే తెలియదు B A కి కో ఎడ్యుకేషనల్ కాలేజీలో చేరాము మా కాలేజీ వాళ్ళం ఐదుగురం మగపిల్లల్నిచూస్తే పులుల్ని చూసినట్లే వుండేది వాళ్ళూ దానికి తగినట్లే కొందరు వెకిలిచేష్టలుచేస్తూ వాళ్ళవైపు చూడగానే ఘనంగా నవ్వే వారు తర్వాత, తర్వాత చాలా మర్యాదగా చూసేవారు ఏ క్లాసో, ఏ లెక్చరరో హైంటేబిల్ తెలియక యీ కొత్త అనుభవంతో భయపడుతూ వుండేవాళ్ళం మధ్యాహ్నంపూట కాంటీన్కి వెళ్ళినా నుంచుని తినాల్సి వచ్చేది కాంటీన్కి వెళ్తే ఎలక్షనప్పుడు చచ్చే భయంగా వుండేది బిల్ యివ్వటానికి పదిమంది ముందుకి వచ్చేవారు ఎలక్షన్ల రోజుల్లో అమ్మాయిలు కాంటీన్కి కదలమన్నా కదిలేవారు కారు

మగపిల్లలకి, లెక్చరర్సుకి నిక్నేమ్స్ పెట్టేవారు ఒకాయన్ని సెంటుమాస్టరు గారనేవారు ఒకరోజు యింకో లెక్చరరుతో ఏదో మాట్లాడుతూ ఆపేరు పైకనేసింది ఒకమ్మాయి ఇక ఆ లెక్చరరుతోసహా అందరం నవ్వలేకచచ్చాం ఒక క్లాసులో ఎవరో విద్యార్థి student ఆడపిల్లల మీదికి పడాలని ఒక కాగితపు విమానంచేసివిసిరాడు అదివెళ్ళి లెక్చరరు మీద పడింది ఇహ చూసుకోండి ఆయన fire అయిపోయి ఒక గంట లెక్చర్ యిచ్చారు అది యిప్పటికీ జ్ఞాపకంవుంది తేలు కుట్టిన దొంగిల్లా boys కూడా కిక్కురుమనకుండా విన్నారు

మొదటి సంవత్సరం చివరలో యింకా రెండు నెలలలో పరీక్షలనగా మా కాలేజీలో ఒకరోజు షేక్స్పియర్ ట్రాజెడీ 'హేమ్లెట్' సినిమా వచ్చింది ఆరోజే మా క్లాస్ మేట్ ఒకమ్మాయి పుట్టినరోజు ఆరోజు పూలు పెట్టుకుని

మేం పదముగ్గురం ఒక్క గ్రూప్ వాళ్ళం సరదాగా హోటల్‌కివెళ్ళి బాగా enjoy చేసాము అందరంకలిసి పచ్చగడ్డి మీద నీలాకాశం క్రింద open air theatre లో ఆ పిక్చర్ చూసాం ఎవరి దారిన వారు వెళ్ళిపోయాం మర్నాడు అంత దుర్వార్త వింటామని ఎవ్వరమూ అనుకోలేదు మా క్లాసుమేటు యింకొక అమ్మాయి కాలేజీనుంచి హాస్టల్‌కి వెళ్తూ రోడ్డుమీద పడిపోయి చనిపోయింది మృత్యువు అంటే ఏమిటి అనేది అంతవరకు ఏనాడూ నాకెదురు కాలా మృత్యువు దగ్గరగా వచ్చిన వారిలో మొదట ఆ అమ్మాయిమీదే చేయి వేసింది విధి ఎంత బలీయమో' మానవుడి మేధస్సు ఎంత తక్కువ పరిమితుల్లో పరిభ్రమిస్తుందో ఊహించుకొని వణికిపోయాను కాని నాకళ్ళల్లోకి నీళ్ళు రాలేదు ఆ వార్త వినగానే తర్వాత మిగతా పిల్లలు గోల గోలగా వాళ్ళ తలితండ్రుల్ని గురించి చెప్తుంటే బాధపడింది మనసు మాలో ఒకరు అనంతలోకివెళ్ళి పోయారు' నామనసు కొత్తబొమ్మ చూసిన పసిపిల్ల హృదయంలానే వుంది కాని ఎంతభయంకర పరిణామాలు తెచ్చింది ఆ లోటుతోనే మొదటిఏడు పూర్తయ్యింది రెండవ సంవత్సరం మామూలుగా గడిచిపోయింది ఎలాగో B A అనిపించుకున్నాము

తర్వాత యూనివర్సిటీకి ప్రయాణం. ఇంతవరకూ ఊరు విడిచి ఎక్కడకూ వెళ్ళి వుండలేదు రైల్లో. సన్నగా కురుస్తున్న వర్షాన్ని చూస్తూ ఆగస్టులో బయలుదేరాము ఎంతో పచ్చగా కనపడింది లోకం చేతిలో ఆచంట జానకిరాం గారి 'నా స్మృతి పథంలో' చదువుతూ వుంటే నా జ్ఞాపకాలుకూడా నన్ను ముసురుకున్నై వాల్తేరు స్టేషను చేరేప్పటికి వర్షం తగ్గింది తిన్నగా లేడీస్ హాస్టల్‌కి వెళ్ళాము పోనీటెయిల్స్ కట్టుకొని నైట్ గౌన్స్ వేసుకొనివున్నవాళ్ళు మా బుట్టా తట్టా చూసి ఎవరో పల్లెటూరు బైతులనుకున్నారు కాబోలు ఏడిపించడం మొదలెట్టారు వాళ్ళని చూస్తుంటే వీళ్ళు M A అయినాక స్టూడెంట్స్‌కి manners ఎలా నేర్పుతారా అనుకునేదాన్ని యూనివర్శిటీ క్లాసురూములు మురికిగావున్నా బరాణీ పూలతీగలతో, జీడిమామిడి, సీతాఫలం చెట్లతో మిట్టపల్లాల్లో చుట్టూ నీలాకాశం వినీల సముద్రం కన్పడుతూ వుండగా నిండుగా వుండేది ఒక్కనెల ఆ జీవితం. తర్వాత అనారోగ్య కారణంగా వచ్చేసాను దాన్ని వదిలిపెట్టి రావాలన్నా బాధే అనిపించింది మానవ జీవితంలో అనుబంధాలే అలాంటివి ఎన్ని బాధలుపడ్డా, సరదాలుపడ్డా అదే జీవితం బావుందనిపిస్తుంది గతకాల మెప్పుడూ మధురమే కదా' అందులో కాలేజీ రోజులు మరీను

రూంలో మా రెండు జడల నళిని కని పించింది అంతకుముందు రోజు నళినీ నేనూ తెలుగు క్లాసులో కలిసే కూర్చున్నాం కాబట్టి అది మాక్లాసేనని నిశ్చయించుకొని ధైర్యంచేసి మా లెక్చరర్ పర్మిషన్ పొంది లోపలికి వెళ్లాను క్లాసులో విద్యార్థులూ, విద్యార్థినులూ నన్ను వింతగా చూస్తుంటే, నిజంగా చమటలు పట్టాయి ఎలాగో సర్దుకొని కూర్చునేలోగా మా లెక్చరర్ అటెండెన్సు చూస్తూ 'నంబర్ ప్లీజ్ ' అన్నాడు 'చెప్పాను ఆయన ఆశ్చర్యంగా చూస్తూ "గ్రూప్?" అన్నాడు చెప్పాను ఆయన సన్నగా నవ్వుతూ "యిది బయాలజీ క్లాసుకాదు హిస్టరీక్లాసు మీరు వెళ్లొచ్చు " అని ఇంగ్లీషులో అంటుంటే క్లాసంతా ఒకటేగోల నిజంగా నా బాధ ఏమని చెప్పను! తేలిపోతున్న పాదాలతో ఆ క్లాసును విడిచి వెయిటింగ్ రూం వేపు నడచాను

ఇది క్రొత్తలో జరిగిన సంఘటన క్రొత్తలో యిలా కన్ఫ్యూసయినా తరువాత తరువాత అలవాటయి పోయింది

బయాలజీక్లాసులో ప్రాణం బిగబట్టుకుని కూర్చునేదాన్ని అసలే బయాలజీ కష్టం దానికి తోడుగా ఎనభై మైళ్ళ వేగంతో, ఇంగ్లీషులో లెక్చర్ యిచ్చే మహానుబావుడు, వుండి వుండి బాంబు పేల్చినట్లు "Come on ! tell me what is parthenogenesis" అనో లేకపోతే 'what is metamorphism ?' అనో ప్రశ్నించేవాడు ఎప్పుడు ఎవర్ని అడుగుతాడో తెలియదు సమాధానం తెలిసినా అంతమంది మొగపిల్లల ముందు, ఆంగ్లంలో చెప్పడం అంటే కష్టంకాదుమరీ? జువాలజీ ప్రాక్టికల్సులో జరిగిన ఓ సంఘటన ఇప్పటికీ తలచుకొంటే ఒళ్లు జలదరిస్తుంది ఆరోజు Rat డిసెక్షన్ చేయవలసి వచ్చింది అసలే యెలుకలంటే నాకు చచ్చేభయం. దానికితోడు నాకు యిచ్చిన యెలుక నీళ్ళలో తడిసి పొట్టబాగా ఉబ్బిఉంది ఇక తప్పనిసరిగా బట్టి ముక్కుకు Hankey అడ్డుపెట్టుకొని మెల్లగా కడుపు ఓపెన్ చేసాను నాలుగు పిల్లలు కడుపులో చచ్చివున్నాయి నాస్థితి వేరే వర్ణించాలా ? మీరే వూహించండి కళ్ళు తిరిగాయి కెవ్వున అరచి పడిపోయాను మెలకువ వచ్చేలోగా నా కాయం జనరల్ హాస్పిటల్ క్యాజువాలిటీలో వుంది. ఈ అనుభవాన్ని నేను మరువగలనా ?

గ్రూపు క్లాసులకు విరుద్ధంగా వుండేది మా తెలుగుక్లాసు మా లెక్చరుగారు శాంతినికేతనంలో తెలుగు M A చదివారు వ్రాయమంటే దిట్టంగా వ్రాస్తారు కానీ పాపం నాలుక కాస్త మందమేమో, మాటలు నోరుదాటిరావు వచ్చినా అష్టవంకరలతో గానీ రావు ఉపన్యాసాల్లో కూడా శుద్ధ గ్రాంధికాన్నుపయోగించాలని

ఆయన ఆశ కానీ, నాలుక మాటవినదు ఆయన పడే బాధ మాకు కడుపునిండా నవ్వుకునేందుకు సాయపడేది పాపం ఆయన తిట్టడంకూడా గ్రాంధికంగానే వుండేది అల్లరి చేసిన అబ్బాయిలను ఆయనగారు యిలా తిట్టేవారు "ఏవండీ- మీరు శుద్ధ నికృష్ట పాపభూయిష్ట. " ఆ పైన నాలుకతిరక్క- అంతటితో ఆపే వారు దానితో చిన్నసైజు విప్లవం బయలుదేరేది కళ్ళలో నీళ్ళుతిరిగేదాకా నవ్వుకొనేవాళ్ళం కోపం భరించలేక- "ఏవండీ-మీరేనండీ, మీరే-మీరు ముందు Get out – వెళ్ళండీ మీరు వెళ్ళకపోతే నేనే పోవల్సివస్తుంది వెళ్ళండీ," అనే వారు. అల్లరి చేసిన అబ్బాయి లేచి నిలు చొని "నిజంగా వెళ్ళమంటారా సార్?" అంటే ఆయన ''ఔను నిస్సందేహంగా వెళ్ళవలయును –" అనే వాడు ఆ అబ్బాయి ''చాల సంతోషంసార్'" అని బయలుదేరే ఫోజు పెట్టేవాడు గురువుగారికి ఏమనాలో తోచక "ముందు మీరు సిడౌన్" అనేవారు మాకు కావలసినంత నవ్వు

అసలు మా తెలుగు లెక్చరర్‌గారి రూపమే విచిత్రంగా వుండేది ఆయన Fore head చాల విశాలంగా సమతలంగా వుండేది క్లాసులోకి రాగానే ఒక్కా మారు పెద్ద దస్తీతో ఆ ఫోర్ హెడ్‌ను తుడుచుకోవడం ఆయన అల వాటు ఒకదినం ఆలాగే నుదుటిమీద దస్తీ వేసాడోలేదో, వెనుకనుండి "బ్లాక్ బోర్డు బాగా తుడవండి మాష్టారూ'" అని ఓ హెచ్చరిక నవ్వకుండా మేమెలా వుండగలం చెప్పండి

యిలా తెలుగు క్లాసు గ్లాని పట్టిన (గ్రూప్ క్లాసుల్లో) మా మెదడుకు పెద్ద Relief గా ఉండేది.

క్లాసులోని Boys చేసే అల్లరి మాదాకా వచ్చేది అమ్మాయిలచే ఆక ర్షింపబడాలని ఒక్కొక్క అబ్బాయీ చేసే ప్రయత్నాలు చూస్తే మాకు జాలీ, నవ్వూ రెండూ కలిగేవి మేమూ వాళ్ళ మాదిరే చదువుకొనేందుకే వచ్చామనీ, వరాన్వేషణకు రాలేదనీ, ఆపని చూడ్డా నికి మాకూ తలిదండ్రులు, అన్న దమ్ములూ వున్నారని వాళ్ళకు జ్ఞాపక ముంటే ఆలా చేయరుకదా అని అను కొనేవాళ్ళం

మా హాస్టలు జీవితంకూడా మరపు రానిదే కావాలసినంత స్వేచ్ఛ, అంతకు మించిన నిర్బంధాలు రెండూ వుండేవి వందమందితో కలిసి జీవించడం కూడా ఒక తీయని అనుభవమే '

మారూం చాల పెద్దది. అందులో ఐదుప్రాణులు నివసించవలసి వచ్చింది Birds of same feather flock together, అన్నట్లు ప్రస్తుతం ఐదుగురం ఫెయిలయే విషయంలో అవిభాగ్యమైన ఐకమత్యాన్నే ప్రదర్శించాము అది వేరే సంగతి

'చదవొచ్చు లెద్దూ' అనుకుంటూనే, సంవత్సరమంతా కాలేజీ ఫంక్షన్స్‌కోసం షెచ్చించిన త్యాగమయులం మే మైదు దురం ఒకచోట చేర్చిన ఆ భగవంతు ణ్ణాలి అందరికీ అన్ని హాబీలున్నాయి కాబట్టే మొత్తం యిలా కట్టగట్టుకొని Fail అయ్యాం —

పరీక్ష దినాల్లో ఒక అనుభవం మా సౌదామిని ఏ కళనుందో యేమో తల్లి, పన్నెండు దాటినా చదువుతూనే వుంది తెల్లవారితే పరీక్షలు మొదలు నాకు నిద్ర ముంచుకొస్తుంటే మాఅమ్మడు సౌదామిని నడిగాను — "నన్నొక గంటసేపైంతరు వాత లేప'' మని అంటే ఒంటిగంటకు లేపమని చెప్పాను చదువుతూనే "వూ(" అంది ఎటూ ఒకగంటలో లేపుతుందికదా అని నిద్రపొయ్యాను సూర్యకిరణాలు మొఖాన పడుతుంటే లేచాను సౌదామిని మొద్దులా నిద్ర పోతుంది టైమ్ ఏడయింది దానిమీద, నన్ను లేపనందుకు కోపం ముంచు కొచ్చింది ఎనిమిది గంటలకు పరీక్ష గంటలో ఏం చదువగలను చెప్పండీ ? దాన్ని తట్టి లేపాను లేచి కూర్చుని నన్ను ఎగాదిగా చూచి "నన్ను మూడు గంటలకెందుకు లేపలేదు ?" అవి నన్నడిగింది నేనేం చెప్పాలో తెలియక . . ''నేను నీకంటేముందుగా పడుకొని వంటిగంటకు లేపమంటే, నేను నిన్ను ఎలా లేపాలి ?" అన్నాను అది విసవిసనడచి నా దిండుక్రిందనుండి ఒక కాగితాన్ని తీసి నా కిచ్చింది దానిలో "Please wake me up at 3' o clock" అని వుంది నిద్రపోతున్న నాతలదిండు క్రింద అలాంటి కాగితం పెట్టిన దాని తెలివికి నవ్వాలా ఏడ్వాలా ?

మా కాలేజీలో ఆటోగ్రాపులు తీసి కోవడం ఒక హాబీ ఆటోలు అడిగి తీసి కొనేపుడే మా క్లాసు అబ్బాయిలంతా మాకు పరిచయమయ్యారు ఇంతకాలమూ చేసిన అల్లరికి మన్నింపు వేడుకొని, చాల ఆప్యాయంగా మాటలాడారు సంవత్సరమంతా ఒకే క్లాసులో వుండి కూడా కాలేజీ విడిచివెళ్ళే చివరి ఘడి యల్లో ఆత్మీయులుగా మారిన మా క్లాసు సోదరులను విడచి రావడం కూడా బాధగా వుంది

సంవత్సరం పొడుగునా యిలా కలిసి వుంటే యెంత ఆనందంగా వుండేదో ననిపించింది స్టేషన్లో మాకు Send off యిస్తున్న వాళ్ళను చూస్తే !

ఇన్ని తీయనైన అనుభవాల అనుభూతులు మనస్సును ఉక్కిరిబిక్కిరి చేస్తుంటే కళ్ళు మూయడమెలా ? అందుకే రేపు సెప్టెంబర్‌లోనైనా యీ పరీక్ష పూర్తిచేసి వచ్చేయేడైనా మా కాలేజీతో కలసిపోవాలని నిశ్చయించు కొనడం జరిగింది Wish me best of luck ! ★



చూపులో చూపు

# ప్రశ్నావేదిక ? ? ?

*శ్రీమతి కత్తుల సూర్యాకాంతమ్మ, గుంటూరు*

సమాన హక్కులను గురించి మీ అభిప్రాయమేమిటి ?

ఉండాలనే.

నేటి స్త్రీలు అబలలా, సబలలా ?

భర్తల పాలిటి సబలలు, లోకంపాలిట అబలలు.

* * *

*ప్రకాశరావు, గుంటూరు*

పంచశీలను అమలుపరుచు దేశాలేవి ?

మనదేశం ఒక్కటే.

* * *

*మట్టుపల్లి రామారావు, నిజామాబాదు*

చిత్తూరు ఉపఎన్నికలో కాంగ్రెసు పార్టీని కమ్యూనిష్టుపార్టి బలపరచడం సమంజసమేనా ?

కాదని చిత్తూరు ఓటర్లే సమాధానం చెప్పారు.

* * *

*యస్ వి. సుబ్బారావు, హైదరాబాదు*

సిగ్గులేని స్త్రీ కంచెలేని చేనువంటిదంటారు మీ అభిప్రాయం ?

చేనుకు కంచెలేక పోవటంవల్ల వచ్చిన విశాలత్వంలో ఆకర్షణ లేక పోలేదు.

* * *

*కుమారి బత్తుల అన్నపూర్ణమ్మ, కాకినాడ*

కాలానుగుణంగా కవిత్వం మారటానికి కారణమేమిటి ?

కవిత్వం వ్రాసే కవి కాలానికి బద్ధుడవటమే.

*ఏ. వాంజ, తాడేపల్లిగూడెం*

**రామాయణంలోని అంగదరాయబారానికి, భారతంలోని శ్రీకృష్ణరాయబారానికి వున్న తేడా ఎటువంటిది ?**

తెలిసి చేసేపనికి, తెలియక చేసేపనికి వున్నటువంటి తేడా వంటిది. అంగదుడు మామూలు మనిషి తనరాయబారంలో అలాగే ప్రవర్తించాడు. తనరాయబారం నెగ్గవచ్చుననే ఆశవుండి దానికి తగిన రీతిని మాట్లాడాడు శ్రీకృష్ణుడు భగవంతుడు. తనరాయబారం నెగ్గదని ఆయనకు తెలుసు అందుకనే రాయబారానికి వెళ్ళబోయేముందు యుద్ధం తప్పదని చెప్పి వెళ్తాడు అయినా ఈ ప్రపంచం ఆయనకొక లీల గనుక తనరాయబారాన్ని ఒక లీలగానడిపాడు అంగదుడు మామూలు మనిషివలె తన రాయబారంలో రోషా వేశాలను వెలిబుచ్చాడు. శ్రీకృష్ణుడు అలాచెయ్యక తన చుట్టూ వున్నవారికంటే ఎప్పటికప్పుడు పై స్థాయిలో వుండి మాట్లాడాడు. యుద్ధం వస్తుందేమోననే భయంగాని, యుద్ధాన్ని తప్పించాలని ఆవేశంగాని ఆయనకులేదు. ఒక ఆటగా తన రాయబారాన్ని నడిపి తానుచెప్పదలిచింది చెప్పి యింటికి తిరిగివచ్చాడు. వీరిద్దరిలో జయాన్ని సాధించాలనే సైనికునివంటివాడు అంగదుడు. ధర్మాన్ని భోధించాలనే గురువువంటివాడు శ్రీకృష్ణుడు. సైనికుడు తన ప్రయత్నంలో వ్యసనపడ్తాడు గురువు తన విద్యుక్త ధర్మాని నెరవేర్చుకొని వూరుకుంటాడు. అదే తేడా.

* * *

*కె శ్రీరాం, గుంతకల్లు*

**మానవుడు తన జీవితాశయాన్ని నెరవేర్చుకోవటానికి నిరంతరకృషి మంచిదా ? అదృష్టంకోసం వేచివుండటం మంచిదా ?**

నిరంతరకృషి చేసేవారినే అదృష్టం వరిస్తుంది గాలిలో దీపంపెట్టి, భగవంతుడా ! అన్నిటికీ నీవే వున్నావు అనటంవల్ల ప్రయోజనం లేదని చెప్పే సామెత మనకు వుండనే వుంది. అదీకాకుండా, ఆశయం నెర

వేరినా, నెరవేరకపోయినా నిరంతరకృషిలో ఒకవిధమైన ఆనందాన్ని అనుభవిస్తాడు. మానవుడు ఆ ఆనందం అదృష్టంకోసం వేచివుండేవరకు వుండదు

రవీంద్రనాథటాగూరుగారి గీతాంజలి, టాల్‌స్టాయ్‌గారి సమరము—శాంతి, వీటికి తేడా ఏమిటి ?

భగవంతుని దర్శించిన వ్యక్తి వ్రాసినపుస్తకం గీతాంజలి. భగవంతుని దర్శనానికై సాధన చేస్తున్నవ్యక్తి వ్రాసిన పుస్తకం సమరమూ—శాంతి.

*　　　　*　　　　*

*ఎం. వెంకటనారాయణ, డోర్నకల్*

కాంగ్రెసు కొద్ది సంవత్సరాలలో పూర్తిగా పడిపోతుందని నేననుకుంటున్నాను. మీరేమంటారు?

బండ్లు ఓడలవటం, ఓడలు బండ్లవటం ప్రకృతి సహజం

*　　　　*　　　　*

*పొన్నగంటి సూర్యనారాయణ, జయపురం*

బుద్ధుడు తన బోధనలలో భగవంతుడ్ని గూర్చి ఎచ్చటా ప్రసంగించక పోయినా, ఈ నాడు చాలామంది దేవునిగా స్తుతిస్తునారు. అటువంటి స్తవంలోవున్న పవిత్రత ఆదర్శత ఏమై వుంటుంది ?

బుద్ధుడు భగవంతుణ్ణి ప్రస్తావించకపోవటానికి ఆ నాటి పరిస్థితులే కారణంగాని, ఆయనకు భగవంతునిమీద నమ్మకం లేకపోవుటకాదని నే ననుకుంటున్నాను. ఆ నాడు భగవంతుని పేరుమీదుగా పరపీడన ఎక్కువగా జరుగుతూండేది. మానవ సంబంధాలు పూర్తిగా కుళ్ళిపోయిన పరిస్థితులవి ఆ పరిస్థితులను బాగు చెయ్యాలంటే, మానవునిమీదా, మానవ ప్రయత్నంమీదా దృష్టిని కేంద్రీకరించాలని బుద్ధుడు భావించాడు. అలాగే ప్రవర్తించాడు. అందువల్ల యిప్పుడెవరైనా అతణ్ణి భగవంతునిగా పూజిస్తే ఆయన కే అభ్యంతరమూ వుండదను

కుంటాను ఇక ఆ పూజలోని పవిత్రత, ఆదర్శత ఎమైవుంటుందంటూరా? అవి ఆయా వ్యక్తుల మానసిక స్థాయిలనుబట్టి వుంటాయండీ. పూజలు ముఖ్యంకాదు, ఆ పూజల వెనుకవున్న వక్తి ముఖ్యం.

*　　　*　　　*

*కుమారి అంబటి దేవకి, అలహాబాద్*

ఉత్తమ సాహిత్యపు విలువ లెంతవరకు?

మానవునిస్థాయిని పెంచేవరకు

*　　　*　　　*

*ఒంకరి భాస్కరరావు, అనకాపల్లి*

సంఘం ఎటువంటిది ?

ఆవు పొదుగువంటిది నేర్పుగలిగిన వానికి పాలిస్తుంది, లేనివాడిని తంతుంది

అందరూ ఆచరించవల్సింది, ఆచరించలేనిదీ ఏమిటండి ?

సత్యము చెప్పటం

*　　　*　　　*

*జ్వాలాముఖి, తెనాలి*

గతించిన జీవితం స్మృతిలోకి రాకుండా వుండాలంటే ఏమిచెయ్యాలి ?

జీవించటం మానుకోవాలి.

*　　　*　　　*

*వరుదు రంగారావు, అలుగు*

సంగీత సాహిత్యాలకున్న ఆధ్యాత్మిక సంబంధ మెట్టిది ?

గంగా యమునల సంగమము వంటిది.

# సరికొత్త పాత మనుష్యులు!

తలెత్తి చూసేసరికి మరోతల తగిలింది ఎవరోనని చూస్తే, శారద! కళ్ళల్లోంచి పడలేక, అక్కడ ఆగలేక, బరువుగాపడింది ఒక్క కన్నీటిబొట్టు

'ఇటుచూడండి' అంది, రఘు తలను తనవైపు తిప్పుకుంటూ

'.........

మిమ్మల్నే'

'ఊ ....'

'నన్ను......'

'ఊహూ .....'

'మీనిర్ణయం ఏదైనా...'

'నువ్వు... .'

'నామీద మీ అభిప్రాయం ఏదైనా '

'ఇంకా......'

'అయితే, విన్నరన్నమాట నేను చెప్పదలచుకున్నది నాలో ఉండిపోవాలన్న మాటేనా?'

'ఇది నువ్వుచెప్పకపోయినా ..'

'మీ మనసు మార్చుకోమనటంలేదు'

'మనస్సా? నాకా? నువ్వు ఉంచావంటావా?'

'అంతమాట అనకండి'

'ఏమీ అననులే నువ్వూ ఏమీ

'ఎట్లా అనగలుగుతున్నారు, మీరు యీ మాటలు?'

'నిజమే నా తెలివి తక్కువ దనానికి నాకే......'

'మీరు వినక తప్పదు అయితే'

'కట్టుకథా?'

'బ్రతుకుకథ'

'కనిపిస్తూంటే గట్టెక్కి మూడాలంటావా?'

'సామెత బాగానేఉంది కాని

'నిప్పులేందే పొగరాదంటారు'

'క్షమించండి మనిషికి మనిషి అర్థం కారంటారుగూడాను'

ఈసారి రఘు తలపైకెత్తి చూసేసరికి చుట్టుపక్కల ఎవ్వరూలేరు పట్టపగలే చీకటిలాగ పెరిగిన చెట్లుతప్ప

2

నాటకంలో డైలాగ్‌లాగ వాళ్ళిద్దరూ మాట్లాడుకోవడం ఎలా ఉన్నా, వాళ్ళ

మురళీధర్

జీవితాలు మాత్రం ఉండవలసినట్లుగా లేవు ఆ లేక పోవడానికి వాళ్ళిద్దరే కారణం వాళ్ళేకాదు, వాళ్ళస్థానంలో ఎవరున్నా ఒప్పుకోరు. ఇంకమూడో వాళ్ళెవరైనా అయితే అసలే ఏమీ చెప్ప లేరు

ఎవరిసమస్యలు వాళ్ళ కర్థంకావు. ఇంకొకళ్ళు యితరుల సమస్యలకు పరిష్కారం చూపించలేరు మనం నిర్ణయాలకు వచ్చేసిన తర్వాతగాని వాట్లను గూర్చి ఆలోచించడం మొదలెట్టం అప్పుడు మనకు ఎంత ఆలోచించినా, మనం తీసుకున్న నిర్ణయాలే సరియైన విగా కనిపిస్తాయి ఆలోచించి పని చేద్దామని అనుకుంటాము కాని నిత్య జీవితంలో, పనిచేసిన తర్వాతగాని దాన్నిగూర్చి ఆలోచించం.

వీళ్ళింతగా విపరీతంగా చర్చలో పాల్గొన్న వాళ్ళలా మాట్లాడుకుని విడిపోవడానికి కారణం, వీళ్ళిద్దరూ అతి కొద్దికాలంలో అతిదగ్గరగా రావడమే

ఇంజనీరుగా ఉంటూన్న రఘుకు ఒక్కటే సమస్య మేనమామ కూతురు సీతను ఎట్లా పెళ్ళిచేసుకోకుండా ఉండటమాఅని సీతను రఘు పెళ్ళిచేసుకోక పోవడానికి ప్రత్యేకమైన కారణంకూడా ఏమీలేదు, ఒక్క మేనమామ కూతురని తప్ప

రఘు ఇంజనీరింగ్ ఫైనల్ యియర్‌లో ఉన్నప్పుడు మేనమామ రామారావుగారు 'ఏరా, ఎప్పుడు చేసుకుంటావురా' అని అడిగాడు మాట వరసకు, సెలవలకి యింటికి వెళ్ళి నప్పుడు. రఘుకు మొదటిసారిగా తెలిసింది తను 'మేరేజి మార్కెట్' లోకి వెళ్ళకుండానే పెళ్ళి చేసుకునే రోజు వచ్చేస్తోందని దీనికి, ఏదో పొందానని సంతోషించాలో లేక ఏదో పోగొట్టుకున్నానని విచారించాలో అర్థంకాలేదు రఘుకు అభిమానం దెబ్బతింటుందేమోననే అనుమానం కలిగింది రఘుకు మొదటిసారిగా

'అంటే, నేను ఒప్పుకున్నాననేనా ఏమిటి?'

'నువ్వు యిప్పుడు కొత్తగా ఒప్పుకునే దేమిటి?'

'అంటే, మీ ఉద్దేశం...'

'ఇప్పుడు కొత్తగా, ఏమీతెలియనట్లు అడుగుతున్నా వేమిటోయ్? మీ అమ్మ నా చెల్లెలేగా? మీ నాన్న నాకు బావేగా? వాళ్ళులేనంతమాత్రాన, వాళ్ళు అన్నమాట వృథా అవుతుందని ఎట్లా అనుకునేది?'

'కాని నాకు పెళ్ళి చేసుకునే ఉద్దేశం లేదు మామయ్యా'

'చదువుకుంటున్నప్పుడు ఆ ఉద్దేశం ఉండకపోవడం మంచిదే ననుకో'

'అదికాదు మామయ్యా'

'సరేలే, శుభ్రంగా చదువుకుంటూన్న వాడికి నేను లేని సమస్యను దేనికి తెచ్చి పెట్టటం' అన్నాడు

ఊరు నుంచి వచ్చేసి ఉస్మానియా యూనివర్సిటీ ఇంజనీరింగ్ కాలేజి హాస్టలు గదిలో ఒక్కసారి హాయిగా గాలి పీల్చుకున్నాడు, ఏదో ఆపద తప్పి పోయినట్లు.

ఇక్కడి దాకా జరిగి ఊరుకో లేదు. రఘు అయితే ఖర్చు రాసేశాడు గాని, వాళ్ళ మామయ్య, రామారావుగారు మాత్రం రఘుని ఖర్చు రాసెయ్య లేదు దానికి బదులు యిదంతా రఘుయొక్క బుద్ధిమంత తనంగా, చదువుమీద అతనికి ఉండే శ్రద్ధకు నిదర్శనంగా భావించాడు

గిరుక్కున పరీక్షలు అయిపోయాయి ప్రతిఏడూ వచ్చినట్లే వేసంగి సెలవులు వచ్చాయి కూడాను కాని యీసారి సెలవులకి రఘు విజయవాడ వెళ్ళలేదు. స్నేహితులమంతా కలసి కలకత్తా వెడుతున్నామని మామయ్యకు ఉత్తరం రాశాడు

ఆ రైలుకు విజయవాడ స్టేషనుకు వచ్చాడు రామారావుగారు.

'అదికూడా వస్తానంది స్టేషనుకు'

'ఎందుకో' అని అందామనుకున్నాడు రఘు

'సీతను చూసి చాలా రోజులైంది ఇప్పుడెట్లా ఉందో? మూడు సంవత్సరాల క్రితం సన్నగా, నల్లగా ఉండేది ఆ మధ్య చూసేసరికి, అనుకున్నంత అసహ్యంగా లేదనిపించింది మరి.. వద్దామనుకునే



(వేటనుంచి తిరిగివస్తూ)

ప్యాను అయన పట్టిన కుందేటికి మూడే కాళ్లు కనకనే ఈ మూడుకాళ్ళది దొరికింది. లేకపోతే నాలుగు కాళ్ళదిఅయనకి దొరుకుతుందేమిటి?

---

బదులు వచ్చి ఉంటే? ఎంత నిర్లక్ష్యం?' అనుకున్నాడు రఘు తనలో తను.

బయటకి మాత్రం 'ఊ...' అన్నాడు

రైలు కదిలి వెళ్ళిపోయింది రామారావుగారిని ప్లాట్ ఫారం మీద దిగవిడిచేస్తూ

కొద్దిరోజుల తర్వాత రిజల్ట్సు వచ్చాయి రఘు పాస్ అయ్యాడు వెంటనే నాగార్జునసాగర్ ప్రాజెక్టులో జూనియర్ ఇంజనీర్‌గా వేశారు

మొదట నెల జీతం పుచ్చుకోంగానే రాశాడు మామయ్యకు ఉత్తరం

'భగవంతుడి దయవల్ల యిక్కడ అంతా బాగానే ఉన్నాం జూనియర్ ఇంజనీర్లం కొందరం కలిసి 'మెస్' మొదలెట్టాం నేను కులాసా మీరు వీలు చూసుకుని యిక్కడకు వస్తే ప్రాజెక్టు చూసినట్లు ఉంటుంది... '

ఉత్తరం అందుకున్నదే తడవుగా వచ్చేశాడు రామారావుగారు. ఆయన

అంత వెంటనే బయలుదేరి వస్తారని అనుకోక పోవడంవలన కొంచెం గాబరా గానే అన్నాడు రఘు

'ఒక కార్డుముక్క అయినా రాయ కుండా వచ్చాశావేమిటి మామయ్యా?'

'నీ దగ్గరకు రావటానికి కార్డు దేనికిరా ?'

'అహ .. అదికాదు ? కనుక్కోవ డానికి యిబ్బంది కలిగిందేమోనని ?'

'అబ్బే ఇబ్బందేముంది, యిందులో? బస్సు దిగగానే కూలివాడు తీసుకు వచ్చే శాడు సరాసరి '

'కాళ్ళు కడుక్కో, మామయ్యా. నేను 'మెస్'కి వెళ్ళి చెప్పివస్తాను. ఆదివారం కూడాను యీ వాళ' అంటూ వెళ్ళాడు రఘు

మెస్‌లో భోజనం చేసి గదికి వచ్చే శారు యిద్దరూ సాయంత్రంకాకముందే ప్రాజెక్టూ, అక్కడి శిల్పాలూ అవీ చూపించాడు రఘు

రాత్రి రూమ్‌కు వచ్చిన తర్వాత రఘుతో కొన్ని విషయాలు చెప్పక తప్ప లేదు రామారావుగారికి కొంచెం కునుకు తీస్తూంటే అన్నారాయన

'మెస్‌లో భోజనం చేస్తూన్నంత సేపూ నాకు బాధ అనిపించిందోయ్.'

'అందరితో బాటే మరి '

'అందరిమాట ఎట్లా ఉన్నా, నీ ఖర్మం ఏం కాలిందని ?'

'అంటే ?'

'ఆ వేసే మూడు ముళ్ళూ వేశావని పిస్తే నీకు అవస్థా అక్కర్లేదు, నాకు ఆందోళనా అక్కర్లేదు '

'అదికాదు మామయ్యా ' .

'ఇంక ఏమిటి ఆలస్యం ? ఎంతకాల మని దాన్ని పెట్టుకుని కూర్చుంటాము యింట్లో? చదువా అంటే స్కూలు ఫైనలుతో ఆపుచేస్తిమి ఇంకా చదివించనా వద్దా అంటే నువ్వు 'ఊ...ఆ...' అనక పోతివి.. ?'

'ఏమిటి మామయ్యా, నేను ఎప్పుడో చెప్పానుగా, యీ పెళ్ళి చేసుకోనని ?'

రామారావుగారికి ఏమీ వినిపించలేదు ఒక్క క్షణం ' ఒక్కసారి వంట్లో రక్తమంతా మెదడులోకి ఎగదట్టిన ట్లయింది

బుర్ర వేడిపోయిన వాడికి మల్లే—

'ఏమిటి, నువ్వన్నది '' అన్నాడు

మళ్ళీ చెప్పాడు రఘు మాట పొల్లు పోకుండా

'అయితే నువ్వు యింత కాలంబట్టీ చేసుకో నన్నది సీతనేనన్న మాట ''

'దీని కింత ఆశ్చర్యం ఎందుకు మామయ్యా "'

రామారావుగారికి తుబుక్కున ఉమ్మేసి లేచిపోదా మనిపించింది చేతులో ఏది ఉంటే అది విసిరేద్దా మనిపించింది. ఉన్నపళంగా ఆ 'మెస్' కూలి, దాన్లో రఘు ఒక్కడే కూరుకుపోతే బాగుండు ననిపించింది కాని అనుభవం అడ్డొచ్చి

ఆగమని చెప్పింది, అంత ఉద్రేకం అన్ని వేళలా తగదని తనబుద్ధి తనకే నచ్చ జెప్పటంతో కాస్త తమాయించుకున్నాడు

'చూడు నాయనా, ఏదో ఉద్రేకంలో అనెయ్యగానే సరిపోలేదు కాస్త ఆలో చించుకో ఈ సంబంధాలు తెంచుకుంటే అంత తేలికగా తెగిపోయేవి కావు

'ఏమిటో మామయ్యా, నాకు ఆ ఉద్దేశ్యం లేదు

'సరే, నేను వెళ్ళొస్తాను మరి

'ఎక్కడికి మామయ్యా '

'మునుపు కంట్రాక్టులు చేస్తున్నప్పుడు నా పార్టనర్‌గా ఉన్న మురహరిరావు యిప్పుడిక్కడ కంట్రాక్టులు చేస్తున్నాడు ఇక్కడకు వస్తున్నట్లు చెప్పానులే, మొన్న ఏదో పనిమీద ఆయన విజయవాడ వచ్చి నన్ను కలిసినప్పుడు అడ్రసు యిచ్చి తప్పకుండా కలుసుకోమన్నాడు అదిగాకుండా, అతనితో పనికూడా ఉందిలే వెళ్ళొస్తాను' అని వెళ్ళి పోయాడు

ఇంక రఘు ఏమీ అనలేక పోయాడు అనడానికి ఏమీలేదు కూడాను నిజానికి రఘుకు ఒకరకంగా నెత్తిమీద నుంచి బరువు దించేసినట్లయింది

'అమ్మయ్య వదిలిపోయింది గొడవ ఇంక నాకు ఎంతైనా స్వేచ్ఛ' అను కున్నాడు, అంతకుముందు దాకా దాన్ని ఎవరో అరికట్టినట్లుగా భావిస్తూ

బరువు దిగిపోయిందని తెలుసుకున్న రఘుకు వళ్ళంతా తేలికై పోయిన ట్లయింది కాని అంత తేలికదనాన్ని ఏం చేసుకోవడం? ఏ రకంగా యీ స్వేచ్ఛను సద్వినియోగం చెయ్యడం? ఎవర్ని ప్రేమించడం? ఎందుకు ఊరుకోవటం?

ఈప్రశ్నలన్నీ గుచ్చుకునీ గుచ్చుకోని శరాల్లాగ గుచ్చుకున్నాయి రఘుని ఎట్లాగైనా సరే తను మామూలు వాళ్ళ కన్నా భిన్నంగా ప్రవర్తించాలి పెద్ద వాళ్ళు కుదిర్చిన, మాటిచ్చిన పెళ్ళిళ్ళు చేసుకోగూడదనే మోడ్రన్ అభిప్రా యాన్ని అమాంతం అనాలోచితంగా మింగేశాడు

అంతకుముందు దాకా అదే సందులో ఉంటూ స్కూలులో టీటరుగా పని చేస్తూన్న శారద రఘుని ఆకర్షించినా, స్వేచ్ఛలేదని అనుకుంటూన్న బుర్ర కాబట్టి ఆ ఆలోచనలను దగ్గరకు రానియ్య లేదు రఘు కాని యిప్పుడో? ఇప్పుడింక ఆ గొడవే లేదు శారదనే ఏమిటి, తను ఎవర్నయినా అమాంతం ప్రేమించే సెయ్యొచ్చు కాని చిక్కొచ్చిందే? శారద తనను ప్రేమించవద్దూ ఛ ఛ. తనంతట వాడు తను, చదువుకున్న వాడూ, మంచి ఉద్యోగం చేస్తున్న వాడూను తన కేం? అసలు తనకు యీ అనుమానం రావడమే తప్పు ఆత్మ విశ్వాసానికి ఆత్మహత్య। రోజూ యిటే వెడుతూ

ఉంటుంది శారద ఒక రోజున పెద్ద మనిషిలాగ పిలిచి మాట్లాడే స్తేనో? నో నో ..'

ఇట్లా ఆలోచిస్తూంటే, ఆ అమ్మాయి తన ఆఫీసు సూపరింటెండెంటూ ఒకే యింట్లో అద్దెకున్నట్లు జ్ఞాపకానికివచ్చి 'ఏమిటి యీకలిసిరావటం' అనుకున్నాడు రఘు

అవాళ 'సైట్' మీదకు వెళ్ళటం మానేసి ఆఫీసుపని ఏదో చూసుకున్నాడు. సాయంత్రం అయిదుగంటలు కాగానే అందరితో బాటు కలిసి బయటకు వచ్చేస్తూ, ఆఫీసు సూపరింటెండెంట్ వైపుతిరిగి సన్నగా నవ్వుతూ ఏదో మాట్లాడాడు ఇద్దరూ రోడ్డుమీద కొంత దూరం నడిచి, ఆయన యింటిదగ్గరకు రాగానే 'కాస్సేపుకూర్చుని వెడుదురు గాని రెండి' అన్నాడు ఆ అన్నదే తడవుగా లోపలకు వెళ్ళాడు రఘు కాఫీ అదీ పుచుకున్న తర్వాత, అదీ యిదీ మాట్లాడుకుని వెళ్ళబోతూంటే శారద హాలులోకి రావడం తటస్థించింది పక్కగదిలోంచి

శారద వాళ్ళతో 'పేయింగ్ గెస్ట్' గా ఉంటున్నట్టూ, అక్కడ గరల్స్ హైస్కూల్లో పనిచేస్తున్నట్టూ పరిచయం చేసాడు రఘుకు

శారదతో పరిచయం చేసుకుని వెళ్ళిపోయాడు రఘు ఇంటికి వెళ్ళగానే ఏదో చాలా ఉత్సాహంగా ఉన్నట్లు కనిపించింది మర్నాటినుంచీ, ఏమాత్రం తీరిక దొరికినా శారదతో ఆ సమయాన్ని పంచుకోవడం మొదలెట్టాడు

శారదలో అందరికన్న 'మోడెస్టీ' ఎక్కువ చాలా నిండుగా కనిపిస్తుంది కొద్దిగా మాట్లాడుతుంది మాట్లాడిన ప్రతిమాటా తూచితూచి వాడిందా అనిపిస్తుంది రఘును ముఖ్యంగా ఆకర్షించింది శారదలోని 'సింప్లిసిటీ', సన్నని చిరునవ్వాను

రఘులో, మేనమామ కూతురు సీతను చేసుకోవద్దనే భావం పాతుకుపోయినప్పటినుంచి, మిగతా వాళ్ళు ఎవరైన బాగానే కనిపిస్తున్నారు అందులో శారద కాస్త చదువుకున్నదీ, ఉద్యోగంచేస్తున్నదీ కూడాను చాలా 'ఐడియల్' గాను 'మోడ్రన్' గానూ ఉంటుందనుకున్నాడు రఘు

అయిదారునెలలు బాగానే గడిచాయి ఇద్దరూ కలసిమెలసి తిరగటమూ, చాలాసార్లు కలిసి హోటల్లో భోజనం చెయ్యటమూ, సినిమాకి వెళ్ళడమూ జరిగాయి

ఒక ఆదివారం సాయంత్రం రఘు శారదాను చాలా గుచ్చి గుచ్చి ప్రశ్నలు వేసాడెందుకో శారదకు ఓ పట్టాన కోపంరాదు కాని ఆ ప్రశ్నలను వింటూంటే, వాట్లకు అర్థం ఉన్నట్లు కనిపించలేదు శారదకు

'మీ బంధువుల్లోని సంబంధాలు రెండు మూడు తప్పిపోయాయటగా?'

‘ఊ. ’

‘ఎందుకనో?’

‘ఊ ’

‘సమాధానం చెప్పడం యిష్టంలేదా ఏమిటి? పోనీ అదైనా చెబితే ’

‘మీకు ఆ అనుమానం దేనికి వచ్చిందసలు?’

‘ఏదోదాస్తున్నావు, నాకు చెప్పకుండా’

‘మీకు అక్కర్లేనిది నేను మునుపు ఏమిటి?నాపూర్వ జన్మఏమిటి? వాట్లతో మీకేమిటి పట్టింపు?’

‘మనం వివాహబంధంలోకి రాబోతూన్నప్పుడు, నాకు యివన్నీ తెలియొద్దూ?’

‘చాలు లెండి, నవ్వేపోతారు ఇప్పుడు యింత గుచ్చిగుచ్చి అడుగు తున్నారు, నిజంగా మనిద్దరంగనక .’

‘ఊ.. .చెప్పేయ్, చెప్పదలుచుకున్న దేమిటో’

‘అవసరం ఉన్నదను కోవడంలేదు మిమ్మల్ని నేనేమీ ప్రాధేయపడలేదే?’

‘నేనన్నా, నా మాటఅన్నా నీకు లక్ష్యం లేదన్నమాట ’

‘అనుమానాలున్నవాళ్ళు దూరంగానే ఉండటం మంచిదనుకుంటా ’

‘అదికాదు శారదా, నేను మేనమామ కూతుర్ని కాదన్నది ’

‘నాకోసం అని నమ్మ మంటారా?’

ఇద్దరూ కాస్సేపు మాట్లాడు కోలేదు ఇంక యిద్దరికీ ఏదోఒకటి మాట్లాడు కోక తప్పలేదు



“శాస్త్రిగారూ మీరు ఈ పూట మా ఇంటికి భోజనానికి రావాలి ”

“రేపు పెట్టుకోకూడదూ?”

“ఏం? ఈవేళ మరెవరైనా పిలిచారా?”

“చిత్తం మీ భార్యగారు ఈ వేళ నన్ను భోజనానికి రమ్మని ఇంతకుముందే చెప్పారు ”

అసలు యిద్దరూ ఒకళ్ళకు తెలియకుండా ఒకళ్ళు చాలా ‘సీరియస్’ గా వివరాలు సేకరించారు అసలు యీ ‘స్పేడ్ వర్క్’ అంతా పెద్దవాళ్ళు చేసిపెట్టి, అన్నీ సరిగ్గా ఉన్నమీదట లాంఛనప్రాయంగా ఒకళ్ళకొకళ్ళని అందరి సమక్షంలో చూపించి ముడిపెట్టేసేవారు ఇష్టంలేక పోయినా, కొత్తలో ముక్కినా, మూలిగినా, తర్వాత, జీవితంతో వచ్చినట్లే రాజీకి వచ్చేసేవారు

కాని వీళ్ళు అందరికన్నా భిన్నంగా ప్రవర్తిద్దామనుకున్నారు మామూలుకన్న భిన్నంగా ప్రవర్తించాలంటే, కేవలం అనుకోవడం చాలదు వానికి

సరిపడిన మానసిక స్తోమత ఉండాలి క్రొత్తని ఆహ్వానించడానికీ, ఎదటి వాళ్ళ తప్పులు క్షమించడానికీ సిద్ధపడిఉండాలి

సమస్యలకు పరిష్కారమార్గం దొరకని వాళ్ళు చాలా మంది కాని సమస్యలు లేనివాళ్ళు హాయిగా ఉన్నారనుకోవడం కన్న, వాళ్ళనుకదల్చే సరియైన సమస్యలు లేకపోవడమే వాళ్ళపాలిట ఒక పెద్ద సమస్యగా పరిణమించవచ్చని చాలా మందికి తెలియదు

'మరిమనం' అన్నాడు రఘు, ఏమీ అనడానికి తోచక

'మనం శుద్ధ మామూలు మనుషులం మీరు బి యి పాసై జూనియర్ ఇంజనీరూ, నేను స్కూలు ఫైనల్ పాసై, ట్రయినింగు పాసై పంతులమ్మనైనాను మీరు మేనమామ కూతుర్ని చేసుకోకుండా ఒక క్రొత్తదారి తొక్కాలనుకున్నారు నేను చిన్నవాడైనా రెండో పెళ్ళి వాడిని చేసుకోననీ, బాంక్ గుమాస్తా ఉద్యోగం చేస్తూన్న మా బంధువుల్లో అబ్బాయిని చేసుకోననీ భీష్మించి యీ ఊరువచ్చి పంతులమ్మ ఉద్యోగంలో చేరాను అసలు మనకి... ..'

'మీరు అనవసరంగా యింకొకళ్ళ మీద అభిప్రాయాల్ని ఎందుకు యిస్తారు?'

'ఇంకా చెప్పాలంటే .చెప్పాలంటే ఏమిటి, చెప్పితీరాలనుకుంటూ మన మధ్య పెరిగిన స్నేహం, మన మనస్సులోని అంతరాల్ని దూరం చెయ్యలేకపోయింది మనం ఎప్పుడూ, యింకొకళ్ళని గూర్చి ఆలోచిస్తున్నామనుకుని మనల్ని గూర్చి మాత్రమే మనం ఆలోచించుకున్నాం '

మళ్ళా కాస్సేపటిదాక యిద్దరూ మాట్లాడుకో లేదు ఇంకా కాస్సేపయ్యే సరికి, ఒకళ్ళకొకళ్ళు యింకా బాగా అర్థమయ్యారు లాగా ఉంది ముఖావంగా, తెచ్చిపెట్టుకున్న బుద్ధిమంతతనంతో వెనక్కి వెళ్ళిపోయారిద్దరూ ·

Printed and Published by A Sudhakar Rao from Yuva Press, 5-9-88, Public Garden Road, Hyderabad-1 Controlling Editor Sri "CHAKRAPANI"

## గతమాసం చిత్ర పరిచయ పోటీ




*బహుమతి పొందిన వ్యాఖ్య*

"అబల యెంతటి యుద్యోగియైననేమి
ఇంటి తలపులు లేక తా నెట్టులుండు"

పంపినవారు గండ్లూరు నాగరత్నము, హైదరాబాదు

---

చిత్ర పరిచయ పోటీకిగాను వేయబడిన బొమ్మకు సరియైన వ్యాఖ్య వ్రాసినవారికి పదిరూపాయల విలువగల పుస్తకములను బహుమతిగా పంపుతాము ఇంగ్లీషు కాప్షన్ పనికి రాదు వ్యాఖ్య ఈ నెల 15 వ తేదీలోగా యువ సంపాదకునికి చేరాలి

# దీపావళి ప్రత్యేక సంచిక

# యువ

*ఈసంచికలో —*

అవసరాల రామకృష్ణరావు — ఇసుకపల్లి దక్షిణామూర్తి — కోడూరి కౌసల్యాదేవి — ఎస్ వి రంగారావు — కొమ్మూరి ఉషారాణి — ప్రతిమాదేవి — విజయలక్ష్మి — సుఖ్ఠాంకర్ — జి వి. జి. — హితశ్రీ — దాశరధి — మొదలైనవారి రచనలు,

*వడ్డాది పాపయ్యగారి వర్ణచిత్రాలు,*

*ఇంకెన్నో ఆకర్షణలు ఉంటాయి.*

